# శఠకోప గీతామృతము.



"తిరువాయిమొజి" యను

ద్రావిడ వేదమునకు తెనుఁగు పద్యము.

కవి:


నల్లాని చక్రవర్తుల వేంకట రాఘవాచార్యులు,

**L. M. P.**

తుని, (తూ॥ గోదావరిజిల్లా.)



1942

మొదటి కూర్పు 1,000 ప్రతులు

తుని. లక్ష్మీప్రెస్సునందు ముద్రితము.



అన్ని హక్కులు గ్రంథకర్తవి)


(వెల రు **1-2-0**

☞ గ్రంథము గ్రంథకర్త యొద్ద దొరకును.



శ్రీరస్తు

# శఠకోపగీతామృతము

శా॥ శ్రీమంతంబు బుధాభిగమ్య మమృత క్షీరాబ్ధిసామ్యంబు స్వ
ర్ధామాధారము భూధురంధరము వేదప్రోక్త వేద్యంబు గీ
తా మందస్మిత ముగ్ధవాఙ్మధిత మాత్రాత్రాణ మేకంబు మా
రామబ్రహ్మ మొసంగు మాకును బుమర్థంబున్ గృపార్ద్రంబుగన్। 1

మ॥ స్తనపానాదులు లేని దైవిక శిశుస్వాభావికంబైన వా
వనకైశోరము వాని షోడశ సమప్రాయంబునందే తపో
ధనుడౌ వానిని వైష్ణవానుభవమోద ప్రోక్త వేదార్థ గుం
భనక ద్రావిడ దివ్యకావ్య శఠకోపస్వామినిన్ మ్రొక్కెదన్। 2

ఉ॥ స్వానుభవాఢ్యులౌ ఋషుల సత్యవచస్సు శ్రుతిప్రమాణ ని
ర్మాణ దృఢంబుఁ జేసి పెర మాయవివాదముఁ దర్కవాద ఝుం
ఝూనిల ధూతమానసు వెలార్చి ప్రపంచహితంబుఁ జేయు రా
మానుజమౌని సూక్తి మహిమంబు శరణ్యము వైష్ణవాళికిన్। 3

ఉ। భావముఁ బొంగఁ దా ననుభవమ్ముల నైన మరలించి కాంచి నన్
గ్రేవలఁ జిమ్ములూర మది కెల్లఁగిలన్ మఱిలేని ధన్యుఁ బ్రా
జ్ఞ్వ విబుధాగ్రగణ్యు స్తను వేడ్కఁ గామన్మనసాం నా కిటన్
దైవ సమానుసిన్ దలఁచి దాసుఁడ నేనని కేలుమోడ్చెదన్। 4

మ॥ హరియె పుత్ర కళత్ర మిత్ర ధనధాన్య క్షేత్రసంపత్తి గా
నరజన్మన్ బురుషార్థమున్ గనిన మా "నల్లాని" వంశంబు సు
స్థిర సత్కీర్తికి హేతు భూతులగు లక్ష్మీనారసింహాది మ
ద్గురులన్ బంధుల సత్యసంధులనుఁ జేతుల్ మోడ్చి భావించుదున్॥ 5

మ॥ అనఘున్ నా సమకాలికున్ భరతఖండైశ్వర్యసంధాను మో
హనదాస్ గాంధి మహాత్ము లోకనుతు సత్యజ్ఞాను దీనప్రజా
వను విష్ణ్వంశు రవీంద్ర చంద్రనిభ శోభావైభవాహ్లాదుఁ బ్రా
వనుఁ జింతింతు యథార్థనిశ్చయ మతిప్రాబల్య సంసిద్ధికిన్॥ 6

మ॥ తన యంతన్ దొరకొన్న యాంధ్రకవితా తారుణ్యమున్ శ్రీనివా
సున కర్పించి రక్తిముక్తి యని దాసుండీతి యోచించి నీ
కనఘా! రాఘవరామచంద్ర! కృతిఁ జేయంబూన నేనాటికిన్
దనుపన్ జాలిన కూర్పు కూడ కిటు సందర్భించె నీనాటికిన్॥ 7

మ॥ చెలగున్ గౌశిక గోత్రపావనముగా శ్రీవైష్ణవాచార స
ల్లలితంబైయొక బ్రాహ్మణాన్వయము నల్లాన్ చక్రవర్త్యాఖ్య త
త్కులుఁడన్ వేంకటరాఘవాంకితుఁడ నెంతోకొంత విద్యాకృషిన్
గల తజ్జ్ఞుండ సుధీవిధేయుఁడను భక్తత్రాణ! నీవాఁడనున్॥ 8

మ॥ అనఘా! శార్వరిఁ గార్తికార్తి బహుళంబైయున్న యాసప్తమీ
దినమున్ బుష్యమి కూడు ప్రాతమునఁ బ్రొద్దెశంబునన్ వంశధా
రనదీ తీరమునందు నచ్యుతపురగ్రామంబునన్ వేంకటరా
మనృసింహార్యున కచ్యుతమ్మకును జన్మంబైతిఁ బుత్రుండనై॥ 9

మ॥ వర పాశ్చాత్య భిషగ్విధాన బహుళప్రావీణ్య లభ్యప్రజా
దరణోజ్జీవన మాంగ్ల వాక్చణత, యాంధ్రజ్ఞానమున్ జానకీ
శ్వర నిర్హేతుక జాయమాన కరుణా సంప్రాప్తసౌభాగ్య భా
స్వర సంసారముఁ గల్గియున్ దనియ నీశా! నిన్నుఁ గన్గోమిచేన్॥ 10

మ॥ తరుణప్రాయమునుండి భాగవతగాథా గాథమేపార న
స్థిరతన్ దూలుచు దేశదేశ మతసందేశంబులన్ దూచి శ్రీ
హరియే, ప్రాప్య ముపాయమన్న శరకోపాచార్య శ్రీసూక్తి ము
మ్మరమై తూఁగగ దానఁదోఁగుచును రామా! దానిఁదెల్గించెదన్॥ 11

మ॥ ఘన జన్మాంతర పుణ్యపాకమునఁగాక న్నాకు నాంగ్లేయ బో
ధన శాలాంతరధీత భౌతిక కళా ధర్మైకసంవేది కీ
శుని దివ్యానుభవంబు మీఁదికి మనస్సున్, ద్రావిడామ్నాయమున్
దెనుఁగున్ జేయు తలంపు పెంపుదగుత్రాఁ దోపున్ ఘటిల్లించునే॥ 12

ఉ॥ బమ్మెర పోతరాజనకు భాగవతమ్ముఁ దెలుంగుసేయు భా
గ్యమ్మొదఁగూర్చినట్టి ద్రవిడాగమమున్ దెలిగించుపెంపు సీ
తమ్మ మగండు నాకొసఁగె నర్హుడఁగాననేల? తొల్లి సం
ద్రమ్ముఁదరించె వానరౌకము రాముని బాసట నేమసాధ్యముల్?॥ 13

శా॥ ప్రాచీనాంధ్రకవీంద్రు లేరుఁ దెనిఁగింపన్మానిరా దివ్యవా
గ్వైచిత్ర్యాంబుధిమగ్నులై వెలివడన్ గాకుండి కాఁబోలు సం
కోచంబుల్విడి నీపదాబ్జముల నిక్కున్ మ్రొక్కి వేయింటినిన్
"దూచాల్" తప్పక తెల్గుఁజేసి విన్నవింతున్ గూర్చెదన్ రాఘవా!॥ 14

మ॥ మనుజక్షేమముఁ గోరి నేరని మతోన్మాదంబునన్ జేసి లో
కనుతుండైన శఠారియోగి నుడికిన్ గల్పించు క్లిష్టార్థముల్
వినకే కానకె యున్న దుష్టులఁ బృథ్వీశ్రేయమున్ దల్చి తె
ల్గునఁ సీతేశ్వర! నీకటాక్షముల వెల్గున్ గల్గి కావించెదన్॥ 15

మ॥ చెవికింపై వినిపింపకున్న కవితన్ జేకొరుఁగానన్ శఠా
రివచోరత్నము లాఁడనీఁడ నొకఁడే రీఁడేనిఁబోఁగొట్టి నా
కుఁదవ శాదస్థము, భావమున్, విడువ నాకాత్మ్యాంతియున్ జొప్ప ని
ద్రావిడామ్నాయమునుఁదెల్గుసేయు ఇడ కుంతిప్పున్నత నిబ్బాంగికన్. 16

శా॥ ప్రాలేయాచలగహ్వరోపల గళద్భాగీరథీ వీచికా
లీలన్ గ్రాలు శఠారియోగి పదలాలిత్యంబు నిత్యంబు నా
భీల ప్రాకృత శోకవైకృతమతిన్ బెంగైన నాబోంట్ల ప
ద్యాలన్ వచ్చునె? వచ్చునన్ని చవులన్ దారించి పూరించెడిన్॥ 17

శా॥ సీతా లక్ష్మణ యుక్తుడై రవికులశ్రీరాముడే నామదిన్
శీతానందమనోజ్ఞ దీప్తి వెలయించెన్ పాపపుంజీకటుల్
ధూతంబయ్యె శఠారిమాని కవితా దుగ్ధంబు సందిగ్ధ భా
షా తుంబన్ సరిఁగూర్చి యాంధ్రకవితా సత్పాత్రమున్ నింపితిన్॥ 18

మ॥ పరవిద్యాపరమై మహామధుర వాక్పాకంబు ద్రావిడ భా
వ రహస్యంబుల వెల్లడించు శఠకోపస్వామి శ్రీసూక్తి లో
పరమార్థంబు తెలుగుసేయఁబడె నీపై నీప్రబంధంబు సు
స్థిరమై లోకము లోపుచేసికొను పూచీ నీది సీతాపతీ॥ 19

శా॥ ఈసంసార విచార మేపుఁగొనునీ కిజ్జింకు లింకించెద
న్నీ సూనాదిక బంధుబంధనము లెన్నే నీళ్ళఁద్రావించె సా
యాసంబై జర చుట్టె మృత్యుభయబాధ్యంబయ్యెఁగాయంబు నీ
చేసాయంబొకె యాస రాఘవకుల క్షీరాబ్ధి ధన్వంతరీ!॥ 20

సీ॥ కనినట్లుఁ గననట్లు చిననాటిమదిఁ గాంచ నలరించు దివసంబు లరిగినట్లు
బాల్యచాపల్యాల్ప వరములడిగి వెక్కి-వెక్కి యేడ్చిన నాళ్ళు వెళ్ళినట్లు
కనునాస కడురెచ్చి కనమికిఁ గన్నీరుఁ గారించు దినములుఁ గడచినట్లు
మతమత శ్రుతులందు మహితవాక్తతులందు వెతకు వాసరములు వెడలినట్లు

గీ॥ భూరిసంసార గర్తాంధకార ఘోర । భావికాలంబుఁగని బెంగవడిన నాకు
గడపుదినమును గడపఁగలుగుదినము । తొలఁగ నోసరింపు మదె చాలు

జలజనాభ॥

శా॥ నీచేనైనది రాఘవా! తమిళ మాంధ్రీకారముం జేసి త।
ద్వాచారూఢిఁ దదంతరధ్వనులుఁ దద్గాంభీర్యమున్ దెచ్చి వి।
ద్యా చాతుర్య మెలర్ప దివ్యశఠకోపార్య ప్రబంధంబు భా।
షౌచిత్యంబునఁ బూర్తిఁ జేయఁగ దరంబా? నేను కించిజ్ఞుఁడన్॥ 22

శా॥ నానార్థోచిత శబ్దగుంభన నిధానంబీ ప్రబంధంబు పై।
పైనం జూచినఁ గాదు లోతుఁ గని విద్వాంసుల్ బహుధ్యాన సా।
ధానంబుల్ గమనించికొంచుఁ గవితాధన్యత్వమున్నాకు ల।
క్ష్మీనారాయణులట్లుఁ గూర్చి యుభయశ్రేయంబుఁ గావింపుఁడీ॥ 23





# శఠకోపగీతామృతము.

## ప్రథమశతకము

—♦మొదటిపది.♦—

గీ॥ ఆశ్రమ మహోన్నతానందు నజ్ఞజన వి । వేకదాత స్థిరజ్ఞానమ్మైరేకనేత
భాసురంబును దుఃఖనివారకమగు । పదమె యాశ్రయమనిపట్టి బ్రతుకు
మనస!॥ 1

చ॥ మనసు మలంబు మాయ గరిమన్ గ్రమమై వికసించు జ్ఞాన సా
ధనమునఁగాని యింద్రియకృతంబగు తెల్వినఁగాని యేనికిన్
గనఁబడువాఁడుఁగాఁడు గతకాలము, నేఁడును, ముందు, వానికీ
డన, నధికుఁడనన్, దెలియ మమ్మహితాత్మకు నాశ్రయించెదన్॥ 2

శా॥ దీనింబొందును దానిఁబొందఁడని సందేహింపఁగా కుర్వియం
దైనన్మిన్నున స్థూల సూక్ష్మ గతులన్ వ్యాపించి ప్రత్యక్ష భూ
తానీకమ్ముల నద్వితీయుఁడయి కళ్యాణాకృతిన్ నిండు సు
జ్ఞానానందు వినిర్మలున్ మనకుఁ గాంచం గూడె సర్వేశ్వరున్॥ 3

సీ॥ ఆవలియతఁడన్న నీవలియతఁడన్న మధ్యవాఁడనఁగను మనమనంగ
నచటి యామెయనంగ నిచటి యామెయనంగ మధ్యగానుండినమగువ
యనఁగ
నక్కడి యదియన నిక్కడి యదియన యారెంటి నడినున్నయది యనంగ
నెవ్వాఁడనంగను నెవ్వతయనఁగను నేదియనంగను నెవ్వరనఁగ॥ 4

సీ॥ నవియు, నివియును, నెవ్వియు నన్నియతఁడె । మంచివియు, గానియవిఁ జనియించినవియు ।
పుట్టుచున్నవిఁ పుట్టఁగఁబోవునవియు । నన్ని వస్తువులునుఁగూడ నతఁడొకండ

శా॥ ఆయావ్యక్తులు భక్తిభేదమున బ్రహ్మాదిష్టదైవంబులన్
స్వీయాభీష్టరతిన్ భజించుటయు సంసిద్ధార్థులైయుంట వా
డా యాదేవతలందుఁజొచ్చి కృతకర్మాధీన సాఫల్య కుం
డై మాతండె నతాళికిన్ వరములీయన్ బొల్చు యోగింపుఁడీ। 5

చ॥ నిలువఁగఁ గూరుచుండ శయనింపఁ జరింపఁగ హేతు వీక్రియల్
సలుపక యుండుటన్ గతము సామి యచింత్యుఁడు వాఁడె యేరికిన్
దెలుపఁగఁజెల్ల దావిభుని తీరింబవంటి దటంచు నేనని
శ్చలముగ తీరువాఁడతఁడె సామియు భర్తయు నాకు నిచ్చలున్। 6

చ॥ తిరముగు మిన్ను నగ్నిని, క్షితిన్, జలమున్, బవనంబు, వినిపైఁ
దిరిగెడు సర్వవస్తుసమితిన్, సృజయించి శరీరమందునన్
దిరపడియుండు జీవుని గతిన్ జగమంతయునిండి వేద వి
స్ఫురితుఁడు దైవమీ సకలభూతతతిన్ దనయందుఁ గొనున్॥ 7

చ॥ దివిజులెఱుంగఁ గాని ప్రకృతిన్ సృజియించి సమస్తవస్తుసం
భవకరుఁడై పరాత్పరుఁడు,ఁ బాలకుఁడున్ఁ బరిహర్త తానయై
భవుడవఁగాఁ బురత్రయము భంజనఁజేసె నజుండు నాఁగఁవే
దవిదులఁజేసె జేజెలను ధాత్రి రచించె వసించె నంతటన్॥ 8

మ॥ కలఁడన్నన్ గలఁడీ పదార్థతతి తత్కాయంబ. లేడన్ననున్
గలఁడ వస్తుచయంబు లవ్వానిఁ దత్కాయంబులై యుండుటన్
గలడున్ లేడను భావముల్ గుణములై కన్పట్టఁగాఁ బట్టి యె
వ్వలనన్ రెండు స్వభావముల్ గలిఁగియే వ్యాపించు లోకమ్ములన్। 9

మ॥ వివృతాంభోనిధి శీత బిందువులలోఁ బృథ్వీపరాగంబులోఁ
సువిశాలంబయి తోఁచు నాకసములో శోభిల్లు నా సూక్ష్మ వ
స్తువులన్ వానికి నాత్మలై మెఱయు వస్తుశ్రేణులందెల్ల వి
ష్ణువు వ్యాపించి యదృశ్యుఁడై నిలుచు వస్తుధ్వంసియున్నాఁడగున్॥ 10

—♦ఫలశ్రుతి♦—

మ॥ అతిసూక్ష్మాంబర, మగ్ని, వాయువునుఁ దోయం బుర్వియున్ వీనిలో
స్థితమౌ శబ్దముఁ దేజమున్, బలమునున్ శీతత్వమున్, క్షాంతి సూ
పతి పాదాలకునై; శఠారి 'కురుకూర్వాసుండు వాక్యాల యా
చిత గీతాకృతినున్న వేయిఁట, ముగించెన్ దొంతిరెండైనగాలన్॥

## —♦రెండవ పది♦—

కం॥ విడునప్పుడరి వస్తుసంగము। విడిచిన పిమ్మటను మీరు విశ్వాత్మలకున్
విడిదియగువానియందే। విడునప్పుడి మీయాత్మలెల్ల విడువడని వడిన్॥ 11

కం॥ ఎన్నఁగ జీవాత్మలుకడు। మన్నించు శరీరసమితి మనుఁగడలన్నన్
మిన్నున మెఱసెడు మెఱుపుల। కన్నను క్షణికంబు లనుచుఁగాంచుడి
మీరల్॥ 12

కం॥ మీరలు మీయది యనునది। వేఱు మొదలు నూడఁబెరికి విశ్వేశ్వరునిన్
జేరుఁడి ఆత్మలకంతకు। మీరిన యాధిక్యమేది? మేలొందఁగూర్చున్॥ 13

కం॥ చిదచిత్తులకుం బరుఁడయి। సదా ముదముఁ బొదలునట్టి సర్వేశుని హృ
న్పెదనిల్పి యాశ్రయింపుఁడు। వదలుఁడు వ్యర్థంబులైన పరవిషయములన్

కం॥ ప్రకృతి విడిపోయెననఁనాత్మకు మోక్షము కూడునైన దానన్ దను ప్ర
దక యింకవలఁచితేనియు। సకలాన్యము విడిచి కొలువు సర్వేశ్వరునిన్

కం॥ కరుణాపరుఁ డీశ్వరుఁడం। దఱకు సమానుండు మివుల దయఁగలిగి పరా
త్పరు సేవలన్నిటన్ ద। త్పరమతివై యడఁగి యుండు పరమార్థరతిన్ 16

క॥ పరిపూర్ణ రుచిరవిశ్వము । బరిపూర్ణముఁగాఁ గ్రహించి పరమేశుని దా
పరిపూర్ణశోభ యనుచున్ । బరికింపుము దానియందఁబ్రసరింపుమదిన్॥

క॥ వానికడఁ జేరఁ జేరిన । కానివి యవియెల్ల విడి వికావికలై సో
నానక తనువరఁబడని । ద్దానిఁగొలఁగి పోవునట్టి తఱివేచఁ దగున్॥ 18

క॥ అగణితములు, ద్యుతిమంతము। లగు,నిత్యానందమయములగునాత్మలతో
సొగసుగొనంబులగమితో । దగు నారాయణుని ధృఢ పదములన్
గొలుమా॥ 19

క॥ మనసును, వాకును, గాయము । నరఁబడు మూడింటి వితము నారసివీనిన్
మును ముస్నే లొంగఁబఱచి । కొనుమా! నిసామిఁ జేరికొనుమా
వినుతిన॥ 20

క॥ చేరిన చెఱువులుఁగల 'కురుఁకూరు' శఠారాతి నుడువు గొనములతో నొ
ప్పారిన వేయింట నీపది । తీరుగఁజెప్పంగఁబడె ద్వితీయ దశకమై॥

## —•మూడవ పది•—

మ॥ శ్రితవత్సల్యాసుఁ దదన్య దుర్లభుఁడు రాజీవాలయా నిత్య భా
వితుఁ డస్మత్పతి యవ్వ కవ్వముకడన్ వెన్నన్ హరింపంగ శి
క్షితుఁడై వక్షము రోటఁగట్టఁబడి గాసింబొందినట్లేచ్చె నా
శ్రితసౌలభ్యము చాల చిత్రమిది లక్ష్మీభర్త కూహించినన్॥ 21

మ। పలువాపంబులఁబొల్చువాఁడు జగతీ పాపహ్యంతరంబౌను శీ
తల కారుణ్యముఁ జల్లువాఁడు మొదలంతమ్మెంచగారాని యు
జ్జ్వలకల్యాణ గుణాత్మకుండు భవమోక్ష శ్రీప్రదుండు ని
శ్చలిత జ్ఞాన ధనప్రదుండు నిజదాసస్తోమ సంలభ్యుఁడున్॥ 22

ఉ। ఆమత ధర్మకోటిఁ గొనియాడఁబడందగు సృష్టి నాశముల్
జేయుచునున్న జెజెలు న చేతనులు న్నఱి చేతనాళియున్

గాయముఁగాఁ బొందిన యఖండ మహావిభవానుభావు నా
రాయణు మాయలెవ్వరి తరంబగు నేరఁగ ముజ్జగంబులన్॥ 23

ఉ॥ ఏరికి నిట్టివాఁడని గ్రహింప నసాధ్యుఁడు నావిభుండు నె
వ్వారికి నిట్టివాఁడనుచు భావనజేయఁగ సాధ్యుఁడయ్యె వే
పేరులు వేయిరూపులు లభించుట నాతని కొక్క రూపొకే
పేరును నుండు నుండదని వింత వితండ వివాదమేర్పడున్॥ 24

మ॥ పరతన్ షణ్మత భేద వాదములఁ దీర్పన్ ధర్మనిర్ణేతయై
పరమార్థంబెఱిగించె నచ్యుతుఁడు శుంభచ్ఛీలుఁ డాద్యాస శ్రీ
హరి తద్బోధిత భక్తియోగమున నన్యాదేశము ల్మాని యా
యరుదౌ తెల్వినఁ బొంది వానిఁగని మాయంజేయుఁడి వాసనల్॥ 25

సీ॥ అరయంగ నరయంగ నందునిందును బైనఁ జెలఁగుచునున్న యచేతనముల
కన్నను భిన్నమై యున్న జీవాత్మల యొక్క స్వభావమ్ము యోగమహిమ
నెఱుఁగఁబడియె నేని యేర్పడం దెలియదు దైవస్వభావమ్ము నేస్తులార
హరియన, నజుఁడన, హరుఁడన వీరిలో నారసి యొకని గొంజూడి చూడ।

గీ॥ మనసుఁబట్టిన యొక్కమూర్తిని గుఱించి । భావముఁజేసి చేసి యాభవ్య
మూర్తి వర్ణనమె చేసి చేసి సద్భక్తితనర । నాశ్రయింపుఁడు వాని
పాదాంబుజములఁ॥ 26

శా॥ ఏకానేక శరీరవారముల నూహింపంగ రాకుండి దీ
ప్తాకారుండగు విష్ణు, బ్రహ్మను, హరున్ స్వాంతమ్ములన్నిల్పి యం
దేకేశున్ హరినుంచి యన్యునెడ సర్వేశత్వ భావమ్ముఁ బో
నీకాయుఃపరిమాణముం గడపుఁడీ యారల్ దయాపూర్ణులై॥ 27

మ॥ మన డెందమ్ముల దోషముల్ గరఁగిపో మానాథు భోగ్యాంఘ్రులన్
దినముం గొల్చిన నాడునాడు మనలన్ వేధించు పాపమ్ము చె

క" ని వగఁజెందు నన్గని పికావళులార! మదీయదూతలై
చని యరుణాంబుజాక్షుఁడగు సామికిఁజెప్పిన ముప్పువచ్చునే?॥ 32

ఉ॥ అంచిత మందయానముల నన్నులతోఁ గవఁగూడి యాడు రా
యంచల పిండులార! "వక్షుగై మతిసూక్ష్మత ముజ్జగాల యా
చించిన కొంకెసామి తనచెల్వుఁ దలంచని నాయఘంబు మా
యించునె" యంచు లోఁగలఁగి యేడ్చునొకర్తని విన్నవించరే?। 33

చ॥ మనసు నెఱింగియున్ సదభిమానముతోఁ దగిదీపెకట్టి వే
దనయని జింతఁజేయఁడు కదా! ఘటి, మేఘుసభాంగుఁడట్టి నా
నినిఁగని యేమనందు? నిక నిల్వద యూపెకుఁ బ్రాణమంచునొ
క్క నుడి వచింతురోటు? కటి కొంచములార! వచింపకుందురో?॥ 34

మ॥ పరివహద్వారి సమీపదేశవనులన్ భక్త్యోగ్రమై తిర్గు చుం
టివి లేఁబాయపు నీరుకోడి! నిజసృష్టింబుట్టులోకమ్ముఁ గా
చి వరంబిచ్చెడు లచ్చిసామిఁ గనుచోఁ జెప్పంగదే! కంట న
శ్రువులంగార్చెడు నీపెఁబాపి యయినంబ్రోవంగనాయంబ'నన్॥ 35

మ। "సకృపోద్యోగ! భవద్వియోగమున నాసల్మాని పానంబుఁ గా
యకమున్నె దయచేసి నీవిహగరాడ్యానంబు సంప్రీతితో
నొకనాడేనియు దానివీధిఁ జననీవో?" యంచు నోతేటి! చ
క్రికి ఁజెప్పంగదె వాడు కన్బడినఁ జక్రీభూత రేఖాకృతీ!॥ 36

మ॥ ఎముకలఁ జిటిలింబాడుతువే? యెలప్రాయపుఁ బెంపుఁజలుకా! నా
యెముకలఁ ద్రాడుఁ గుచ్చినటులేచెడునీ చెడుగాలి. రాడు నా
రమణుఁడు ప్రేమఁజేయఁ డపరాధములన్ క్షమియింపఁ "డేమి నే
రములవి? సామి! యేలదయరాదని" నీవొక మాటనాడుమా!॥ 37

చ॥ మురిపెపుఁ జిన్నజిలకా! శ్రితమోహను నాహరిఁ జేరనేగి నా
పరమున దూతవై విరహబాధ వచింపుమటన్నఁ జేయ వె

వ్వరి నికఁ గొల్తువో? మధురపాకము లందినబెట్టఁ డంచు సుం
దరమగు నాదు రూపు పరితాపమునం జెడిపోవుచుండెడిన్॥ 38

మ॥ నడుమ న్వీచెడు మందమారుతమ! శ్రీనారాయణుం జేరి య
య్యెడుగుందమ్ముల యందుఁ గోరిందొగల నిత్యమ్మున్ సమర్పింప నే
ర్పడి యీదేహము వానివీడి మను దౌర్భాగ్యంబు లెక్కట్టి వో
యడుగం జెల్లదె? వానిఁ గన్గొనియె తూలాడింపు నన్నాదటన్॥ 93

మ॥ నతగంభీర మనస్స! దేహముల జన్మల్ చావులున్ జీవులుం
న్నితరంబుల్ సృజియింపనెంచి హరి మున్నే చేసె మున్నీరు ని
ద్రితుఁడై యందుఁ బరుండుఁ జక్రకరుఁడై దీపిల్లు నాసామిఁ గాం
చితయేనిన్ స్థితిఁజెప్పి పీడకుము వానిం గూడు పర్యంతమున్॥ 40

—♦ఫలశ్రుతి♦—

మ॥ సుర దుర్గ్రాహ్యుని సప్తలోకపతి క్రిష్ణున్ సస్యసంపన్నమౌ
'కురుకూర'న్ శఠకోపుడున్ దరిసి వాక్రొన్నట్టి గంభీర వా
గ్వరసంభావుకమౌ సహస్రమున నాప్తంబీ పదిన్ యుక్తి సుం
దరము న్నాలవదానిఁ గాంచి, కొనసా తద్దివ్య సంపద్గతిన్॥

—♦ఐదవ పది♦—

ఉ॥ ఆయత లోకకారకుని నయ్యమరేశ్వరు నిన్ను వెన్న దొం
గా! యని యంచు, లేమొలక నవ్వుల రాధకుఁ గాగ గొల్ల వై
పోయితివందు నాగ్న జెతి పొందునకై చని యేను కోడెలన్
మాయఁ గవుంగిలింపఁ దగునా యని యందును పాపచిత్తుడన్॥ 41

చ॥ తనువులఁ బులకలెత్త వగి తత్త్వపాంగ దవన్ సురల్ మునుల్
నినుఁగని పూలమాలలును నీరును గంధము ధూపమున్ సమ
ర్పణ మొనరించి మ్రొక్కట భవన్మహిమంబునుఁ జిన్నపుచ్చు లే
మని, నిను నిర్వికారు నఖిలాత్మకునిన్ సకలజ్ఞుఁ గొల్తుమో?॥ 42

మ॥ చరణాక్రాంత దిగంతుఁ డెవ్వరికి నజ్ఞాతుండు నేఁటికి యా
దటికున్ మాతృసముండు జ్ఞానమిడి ధాతన్ ముందుకల్పించి 'ప
ల్వళి నుద్యోగపు వేల్పులన్ మునుల నీవుంగూర్పుమా' యంచు నా
దర మొప్పం బనుపంగఁ జేయఁగొనె నాతండున్ ద్రయీలోకనుల్॥ 43

ఉ॥ తానయి, యద్వితీయుఁడయి తానె నిమిత్తము హేతుభూతుఁడై
తానె త్రిమూర్తుల న్మఱియుఁ దక్కిన దేవ మనుష్య జంతు సం
తానముఁ గూర్ప నబ్ధియయి తజ్జలమందున నిద్రఁ బోవు శ్రీ
జాని సురాధినేత గుణసాంద్రుఁడు నిత్యవిభూతివాసుఁడున్॥ 44

చ॥ సిరి హరిణాక్షి వక్షమునఁ జెందిన మాధవ! కుబ్జ నుండ విల్
బరచిన యట్లు గూనుడిపి బాగొనరించిన గోప! దీపితాం
బర హరినీలదేహ! మధుభంజన! పాపుఁడ నాకు నీవిక
స్వర చరణాంబుజాత మధుపానముఁ గూర్పవె సత్కృపామతిన్॥ 45

ఉ॥ పాపుఁడ నేను పాపములఁ బాపెడు నౌషధ మీవు దేవ తా
ప్రాపక! కేశవా! వలచి వల్లవగేహ సముద్భవుండవై
గోపులపెద్దవైతి! పెనుకొమ్మల సాలము లేడుఁ గూల్చితీ
రూప గుణాదులందలఁచి స్రుక్కెదు లోనఁ గలంగి మాధవా॥ 46

మ॥ తెలియన్ లేరట మేటిజ్ఞానులును నిన్ దేవేశ! గంధావహా
త్తులసీశీతలదామభూష! శ్రితబంధూ! భక్త సంసార శృం
ఖలలన్ ద్రెంచెడు నిన్ను నల్పమతినై కాంచంగనెంచు నా
సల నల్లాడుదు నింతకన్న నొక యజ్ఞానంబు వేఱున్నదే?॥ 47

శా॥ మున్నీ యేడు జగాల మ్రింగి వెలికిం బోఁగ్రక్కినం దక్క యా
మన్నే మైననుఁ జిక్కెనో? విరుగుగా మందుందిసంబూని శ్రీ
మన్నారాయణ! స్వీయమాయ నరసామాన్యాకృతిన్ దాల్చుచున్
వెన్నన్ మ్రింగితి వించుకంత విడవా వ్రేపల్లె వ్రేయాండ్రకున్॥ 48

మ॥ తనుఁ బ్రుంగింపఁగ వచ్చు పూతన విషస్తన్యంబులం బీల్చి దా
నిని బ్రుంగించిన దొడ్డబిడ్డను సురానీకైక నిర్వాహకున్
ఘనమాయావిని, నంబుజాలయ పతిన్ మన్నాథు నాత్మేశు మా
తనుఁ బోలెన్ మముఁ గాచు దివ్యతనునిన్ దార్కొంట వ్యర్థార్థమే?॥ 49

శా॥ నానాజన్మ దురంత పాపమయ సంకల్పుండ నానేనునున్
జ్ఞానాంగున్ జిదచిత్పదార్థగణ సూక్ష్మవ్యాప్తదీప్తాత్ముఁ డా
వానిం జేరిన, మాయమైన భవసంబంధంబు ఖండించి, క
ర్మానీకంబడఁగించి, భక్తినిడి, మోక్షాపేతుఁ గావింపఁడే?॥ 50

మ॥ వనమాలీ! ఘనమాయకా! యనుచు నాపల్మాయలం దే భ్రమన్
గొని, లక్ష్మీశుకృపన్ సుఖించి 'కురుకన్' గొల్వా శఠారాతి చె
ప్పిన గేయంబును, దుగ్ధముగ్ధమును నా వేయింటనుం బంచ మం
బన, నానీపని భక్తిరంజకమై యారాటమున్ బాపెడున్॥

## —♦ఆరవ పది♦—

గీ॥ ముక్తికాంక్షకులార! సద్భక్తులార! । యీశు, నక్లేశుఁ గొని యాడు డెల్లప్రొద్దు
విమలజలము సమర్పించి పిదప ధూప । మిచ్చి పూజించవలయు సర్వేశు విరుల॥ 51

గీ॥ మధురసాపూర శీతలమంజు తులసి । గార్లు వేదాది వేద్యు నేలీల, గొల్తు
మేమిపనిఁ జేయఁ జాలుదు మేమటంచు । సంశయముమాని తత్సేవ సలుపవలయు॥ 52

గీ॥ పల్కు, విసపురు కేసి యాపరమపురుషు । పజ్జఁ బాయదు మనసు తద్భజన మొప్పు
జేయుచుండుచు జిహ్వాక కాయమును ప । రవశతనుఁ బొంద లేచి నర్తనముఁ జేయు॥ 53

గీ॥ అమరులు వెనంగి చాటుఁ గొనములగముల । వరలు దేవు పిశాచము
వడిని విడక
హైయ్యమని నాదునెమ్మోయి తాండవించు । నతని యడుఁగుల కడ బ్రాలి
యనుసరించు॥ 54

గీ॥ చేకొనుట చేకొనకయుంట చెల్మియును, ను । పేక్షయును లేనివాడయ్యు
విడుచువారి,
ఁజేరువారిపి నరసి తన్ జేరువారి । కమృత సముఁడయి కామితార్థము
లొసంగు॥ 55

గీ॥ అమరులకు నమృతముం గూర్చు నట్టివాఁడు । మించు జిగిచక్రమును ధ
రియించువాఁడు
నలలఁ జెలరేగు పెనువెల్లి వెలయు జేజె । యమృతమునకన్నఁ బ్రియ
మయినట్టివాఁడు॥ 56

గీ॥ కడలి నడి లంక నేలెడు పుడమితేని । బుజములను శిరసులనుఁగూలఁ
బొడిచె నెవ్వఁ
డతని పాదాంబుజాతంబు లాశ్రయించి । పట్టిదాటుడి! కాలాబ్ధిభస్త్రులార!॥

గీ॥ విడువుడో భాగవతులార! విడిచి యతని ॥ నాశ్రయింపుఁడి! మీరటు
లాశ్రయింప
పట్టి పల్లార్చు క్రూరపాపములమాపి! మాపులేనట్టి ముక్తి సంపద నొ
సంగు॥ 58

గీ॥ ధర్మఫల భూతలక్ష్మికి ధవుఁడు నద్వి । తీయుఁడగు పరమాత్ముండు
ద్వివిధకర్మ
లనఁబడెడు పాపపుణ్యంబులను వదల్చి । శ్రిత జనాళికి మోక్ష లక్ష్మి
ని నొసంగు॥ 59

గీ॥ అరివినాశుండు వైనతేయధ్వజుండు । మాధవుఁడు సుందరాంగుఁడు మనలఁ గలచు
విపుల బహువిధ కలుషముల్వ్రేడల నడఁచు । క్షణపరిమితంబు కాలంబు చనక మున్న॥ 60

—♦ఫలశ్రుతి♦—

కం॥ తీయుట పాయుట లేవా । శ్రీయుతునకు నని శరారి చెప్పిన పోలుపో
వేయిఁట నారవదీ పది । మాయించున్ వినిన, జనన మాయాలతలన్॥

—♦ఏడవ పది♦—

గీ॥ జన్మబంధముల అజ్ఞానసక్తి మించి । సంగముఁ ద్యజించి, యాత్మ తేజము గ్రహించి
ధ్యానమొనరింతు రాచక్రధరుని బరుని । ఁబరమపావను ధార్మికు మ అపుమాని॥ 61

గీ॥ జగము జనులకునందని సంతసమున । ఁబొదలెడి యగోచరుండు గోపులకు మాకు
నేత. పెన్నిధి. మందు, నింద్రియకృతముగ । దాసులకుఁ గల్గు పాపా ద్దవ్వుఁజేయు॥ 62

గీ॥ వేల్ల్రవేటులఁ దినవోపు వేల్లమేటి । నీలవర్ణుని నద్భుత లీలు నమృత
నిభు సదాఁ గొల్చి మాయాజనితమయిన । యజ్ఞతను దుల్చి జ్ఞానము నందికొందు॥ 63

గీ॥ అజ్ఞత నశింప నాచిత్తమందు జొచ్చి । జ్ఞాన భద్భ్యాగులిచ్చు తేజసుఁడమర
కర్తయును, భర్త, వ స్వశీకర్త యతని । విశ్వపావను నెమని విషవనేస్తు?॥

గీ॥ నాకు దీపముఁ బ్రాణమై నడుమవచ్చి । మనుచు నాజేసు గొల్ల జవ్వనులకనుల
బన్నుచుఁ గపటత నారలమాకెఁజూచు । పరమశుభకరు నీశ్వరు వదలఁ గలనె?॥ 65

గీ॥ ఉపకృతికినయి పయికెత్తెనుర్వి యెల్ల । నారునొక సాలములనేల నడఁగ నేసె
వికసిత సుగంధ తులసీవివృతకిరీటు । నామనసుదాటి పోనిత్తునా? మఱెందు?॥ 66

గీ॥ వలయునని నేనె నాయెదవాని నిలుప । సతతాయాసించి వచ్చి వంచితమదీయ
చిత్తమునఁ జొచ్చె నాయాత్మ హత్తికలసె । నట్టివాఁడిఁక నను వీడి యెట్లోర్చు?॥ 67

గీ॥ రాధ సుందర భుజపరిరంభములకు । ముచ్చటిలువాఁడు జేజేల మొదటివాఁడు
నన్ను విడఁదోసిపుచ్చిన నామనస్సు । పట్టి విడిపించుకొను వాని వశముగాదు॥ 68

గీ॥ అమరులకు నాదిహేతువు, నమృతదాత । 'గొల్లరాయని నాయాత్మఁ గూడునట్లు
వెతకి యమరించి కలిపితి విడని వడిని । విడువనేర్చునె? నన్ను నాతఁడును నింక॥ 69

గీ॥ కోరి చేరినచోఁ, దొల్గు. చేరువారిఁ । జేరు. దుర్లభుఁడగుటనుఁ జేర్చుఁ దానె
మట్టి నాసామి గొనము లహర్నిశలునుఁ । దలచికొని పాడికొని విసువొలయకుందు॥ 70

కం॥ నాయందుఁ దనకుఁ గల యా ప్యాయంబున నవతరించె నాభీరుం డే
యేయన మత్స్య వరహా । ద్యాయత రూపములనొందె నాయనసను
దయన్॥ 78

కం॥ జనియించె నన్ని జాతుల । మన నాథుండెందు మనల మనుచుటకొఱకై
తన సుందర కర నికరం । బునఁదాలిచె శంఖ చక్ర ముఖ్యాయుధముల్॥

కం॥ ఇలగొలిచిన శ్రీపాదము । ఁగలనాథు మదీయనాథు కల్యాణ గుణా
బులఁ బొగడుట కుప్పొంగెడు । జలనిధి విధిఁ బొదలు స్తుతులె చాల
గ వలయున్॥ 80

—♦ఫలశ్రుతి♦—

కం॥ జలవర్ణ శీల వర్ణనఁ । గల శరకోపుని సహస్రకంబున నమరం
గల యీఎన్మిదవ పదియు । నలరింపం గలుగు శ్రితుల నఘవారక స్సె

## —♦తొమ్మిదవ పది♦—

చ॥ ఇవి, యవి, వీరు, వారనగ నేర్పడుచున్న సమస్త వస్తు జం
తువుల సృజించి పెంచి మఱి దుర్చించెడు దైవము, నావిభుండు మా
ధవుఁడనురాగవేది, నిజదాస జనైక వశుండె వచ్చి నా
భవ మది యెట్టిదొక్కొ? యిరువంకలఁ గాపయి నన్ను గాచెడిన్॥ 81

మ॥ శతరూపమ్ములనెత్తువాడు, దివిజాజ్ఞాత ప్రకారుండు ను
ద్ధతుఁడై యాదివరాహ రూపమున నీధాత్రీతలంబెత్తె మ
త్పతి కృష్ణుండయి భోజరాజ కరి దంతధ్వంసమున్ జేసె వి
స్తృత గంభీర పయోధిశాయి యయి నాచెంతన్విడం బించెడున్॥ 82

మ॥ అమితం బచ్యుతమున్ స్థిరం బయిన దివ్యంబైన శీలంబు వాఁ
డమరశ్రేష్ఠుఁడు నాదిపూరుషుఁడు నీలాభాంగ తేజస్కుఁడున్

రమణీయాంబుజనేత్రిఁ డబ్జనిలయా ప్రాణేశుఁడా వైనతే
యమహావాహన మెక్కి తోఁచును మదీయానంద సంధాయియై॥ 83

మ॥ సిరియు న్నేలయు నీలయున్ జెలులు; సృష్టింగల్గు ముల్లోకముల్
పరిపాలించెడు రాజ్యమెల్ల నిజగర్భంబందునంబొందు శ్రీ
హరి యాశ్చర్యసముద్రుఁ డంబుధిశయుండవ్యద్విభుండాశ్రితా
దరుఁడై నానడుమెక్కి యాడును యశోదా కృష్ణ ముగ్ధాకృతిన్॥ 84

చ॥ హరి హర పద్మసంభవ ముఖాంచిత సృష్టికి హేతుభూతుఁడీ
శ్వరుఁడొక మాయరక్కసికి వశ్యుఁడుఁగా నొడిఁ జిక్కి తత్పయో
ధరములఁ గుడ్చుఁ గుడ్చిఁ విషధారలఁ గీడ్పడ కాపె ప్రాణముల్
బిరబిర బీల్చె నాహృదయ వీధిని నిల్చెడు వీఁడె వింతయై॥ 85

మ॥ తనువుల్ జీవులుఁ బంచభూతములునున్ దద్దేహమైయుండ ధీ
జన దుర్జ్ఞేయ మహాప్రభావుఁడయి వాచా మానసాగోచరుం
డును, శుద్ధుండును, సంశయుప్రిదుఁడు నన్నుంబోవఁ జిత్తస్థుఁడై
య్యును దోస్సిమ నటించు నన్యులకు నిట్లున్నాడో? లేడో? కదా॥ 86

మ॥ వరబాహుద్వయిపై నురస్థలముపై భాసిల్లు నామాళిపై
జరణద్వంద్వముపై మనోజ్ఞ తులసీ సంబద్ధదామంబులన్
గరమొప్పారెడు నాదు సామి రుచిరాకారుండు నాజిహ్వపై
దిరమై యుండును నిచ్చల ప్రతిమ సందీప్తప్రభాసారుఁడై॥ 87

శా॥ వాగర్థంబులు తానెయాచు సకలోత్పత్తిస్థితి ధ్వంస నో
ద్యోగంబొక్కఁడ సేయువాఁడు హరి నీలోద్యత్ప్రభామూర్తి సం
రాగాంభోజసమాత్ముఁడాతత చతుర్బాహుండు చక్రాది సం
యోగుండై కనుపట్టె నాకనులఁ బుష్పోదంచి తోరస్కుఁడై॥ 88

శా॥ ఏదేవుండజరుద్రులన్ సురల నా, యీ, లోకముల్ జేసెనో
యాదేవుండగుపించు నాకనుల కజ్ఞాతుండు సేవ్యుండు నా

మీఁదన్ వాని కటాక్షముంబలుపెఁ జిమ్మెన్నాయఘమ్మెల్ల నా
మోదంబందె మదింద్రియంబు లతఁడున్మోమందె యునికింగొనెన్॥ 89

చ॥ హరి, హర, నీరజాసన ముఖామర వందిత సుందరాంఘ్రి పం
కరుహుఁడు, భాసురాంగుఁ డుపకారకుఁడా శ్రితపాలకుండు నా
శిరముననుండి నావదనసీమ విహారముఁజేయుచుండు త
చ్ఛిరమునఁ జల్లనైన తులసీదళదామము తావిఁజల్లఁగన్॥ 90

—♦ఫలశ్రుతి♦—

మ॥ తలపైనుండిన దేవదేవునకు భక్తిప్రీతిఁ జిత్తంబు లో
పలఁదోపించి శఠారియోగి 'కురుకూర్వాసుండు వాకొన్న గీ
తల వేయింటను నీపదిన్ విభుని చెంతన్ విన్నవింపంగ వా
రల శీర్షంబుల శ్రీనివాసపదముల్ రంజిల్లునెల్లప్పుడున్॥

—♦పదియవ పది♦—

మ॥ సమరోత్సాహ వివర్ధమాన విలసచ్చక్రాది దివ్యాయుధో
ద్యమమై, దీర్ఘపదంబునై, సకల లోకైకాశ్రయంబై త్రివి
క్రమమై, నీలమణి ప్రభా పరిచురమై, కన్పట్టె నాకన్నులం
దమరున్ వామనదేవరూపము క్రమోద్యద్వృద్ధి సంసిద్ధమై॥ 91

శా॥ నేల, న్నీళ్ళను, గాలిలోపలను, నింగి న్నిప్పునం దెప్పుడున్
దా, లీనుండయి యంతట న్విరియు నానాథుండె కందోయి కె
వ్వేళన్ గన్పడి లోఁదలంచికొని నేఁబిల్వంగనే వచ్చు నా
కేలా? భౌతిక భోగ భాగ్యములు నింకేయే పదార్థంబులున్॥ 92

చ॥ తలపఁగ నాకు నన్గనిన తండ్రికిఁ దాతకుఁ దాత తండ్రికిన్
గులమున కెల్ల సామియనఁ గూడిన వానిని నీరజాక్షు, శ్రీ
లలిత విశాలవక్షు, శ్రితలాలనదక్షు, ఁగృపాకటాక్షు, ని
ర్మల బుధకల్పవృక్షు సురరక్షకు నాశ్రయమాను చిత్తమా॥ 93

ఉ॥ చిత్తమ! మమ్మ! మంచిపనిజేసితి వేమొనరింప నింక నా
యత్తముకాను? నేను? మనయందుఁక నేమి కొఱంతకల్గు? శ్రీ
చిత్తహరుండు దివ్యజన సేవ్యుఁడునైన మదీయనాథు నే
మత్తిలి వీడిన న్విడకుమా! యొకనాడును నప్రమత్తవై॥ 94

చ॥ ఫలమునుఁ గోరకీ భువనపంక్తిని లోఁగొని నట్టి దేవు నీ
యిలయును నింగియున్ గుతలమిట్లు పదత్రయమాత్ర విస్తృతిన్
గొలిచినఁ భూరిమూర్తిఁ గనుఁగొంటివి నీవిది యేమిచోద్యమో
తలపని భాగ్యమై మనస! తారొకని వచ్చి ఫలించెఁ గార్యముల్ ॥ 95

మ॥ ఇదె! నీకుంగడమాట యో, మనస! నీ వీ చందమై యున్నదా
స దయాంభోనిధి తల్లిఁదండ్రులటు వాత్సల్యంబుఁ గావించు న
భ్యుదయంబందె ననేక రూపముల నీయుర్విన్సలిన్ వైవ మం
బుద వర్ణుండు మదీయనాథుఁడొక ముప్పన్నీకు రాసిచ్చునే?॥ 96

శా॥ మాకున్ దండ్రియు దైవమంచు దివిజుల్ మన్నించి ధ్యానించు సు
శ్లోకున్ లోకపవిత్రు నీశ్వరుని నాలో సిగ్గుఁ బోనాడుచున్
'నాకున్ దండ్రియు దైవమ'ంచు మిగులన్ మన్నించి చింతించి నే
నే కీర్తింతును దుష్టశబ్దములచే నీరంధ్ర పాపాత్ముఁడన్॥ 97

శా॥ కన్నుందమ్ముల నుండి సముద్రమునన్ గన్నీరునుంగారు శ్రీ
మన్నారాయణ దివ్యనామ మది యేమాత్రంబు విన్పించినన్
మన్నాథున్ దరిసించి చేరునెడ ప్రేమాజేర్చి రేయింబవల్
నన్నున్మన్ననఁజేయు నమ్మి విడచే నాఁడేమి యాశ్చర్యమో॥ 98

ఉ॥ భారత భూమి దక్షిణపునైపున నున్న "తిరుకుఱుంగుడిన్"
భూరి సమృద్ధిఁగన్న శుభమూర్తి పదారవ వన్నె మేల్మి బం
గారపునిగ్గు విగ్రహము గ్రాలెడువాఁడు సమస్తదేవతా
ధారుఁడు నావిభుండతని, దాసవరున్, మఱువంగ నేర్తునే?॥ 99

చ॥ మఱపన, జ్ఞప్తి నాకెఱుఁగ మందుడ నన్ గృపఁజేసి యెట్టితా
మఱ కనుదోయితో, నలుపు మానికపుంజిగి నీను మేనితో
నఱమఱ, లేక నామనసునందు దిరంబయి యున్నసామి నే
మఱువగనౌనె? నన్నునొక మాఱునుఁబాయని దివ్యసుందరున్॥ 100

—◆ఫలశ్రుతి◆—

చ॥ రతనపురంగువాఁడును సురప్రకరంబుల ఱేడు నీడులే
డతని కొకండు వానిఁ 'గురుకా'ఖ్యపురిన్ శఠకోప సూరి సం
స్తుతిఁ గొనజెప్ప వేయిఁటనుఁ బొప్పడు నిప్పదియు బఠించి స
మ్మతియును శ్రద్ధయుంగనిన మాయు నవిద్య, లభించు జ్ఞానమున్॥





# శఠకోపగీతామృతము.

## రెండవశతకము

—♦మొదటి పది♦—

ఉ॥ 'భోర'ని యూర్మికల్ పొరలు భూరి సముద్రతటంబునందు నో
సారసపక్షి! బెగ్గిలి ప్రచారముఁజేసెదు నిద్రఁజేయ వా
కార వివర్ణతన్ హృదయ కార్శ్యముఁ గంటిమి మమ్మువోలె నీ
వా రమణీయమూర్తి హరి యందున డెందముఁ గోలుపోతివో॥ 101

చ॥ బెడిదపుఁ గూతఁ బెట్టుచును వేగుచుఁ గంటికిఁ గూర్కులేక పెన్
బొడవగు రేయిజాములనుఁ బుచ్చుచు నుంటివి గోరువంక! మా
వడి, నహిరాజతల్పుపయి స్వాంతము పోయెనొ? నీకుఁగూడ నా
యడుగులఁ జల్లనౌ తులసి యందలి పొందుల కాసబుట్టెనో?॥ 102

ఉ॥ కోరిన కూర్మి కానుకనుఁ గోల్పడినట్లు దివంబు రేయి దుః
ఖారవకారివై నిదురనందవు నీవును మమ్మువోలె నో
వారిధి! వార్ధివేష్ట్య పురభంజను పాదము నాసఁజేయఁ జే
కూఱదొ? యేమిచిత్రమిది? కోర్కె ఫలింపకపోవ దోపునీ॥ 103

మ॥ మెయికిన్ గూరుకురాక రేఁబవలు సామిన్ జక్రి గామించి త
గ్గయకున్ దవ్వయి శీతలానిలమ! సంతాపింతు వెక్కాలమున్
వియదంభోధిధరా ధరాధరము, లన్వేషించి సేవించ లే
కయయో! మావలె నీవు నున్ విరహ దుఃఖావాప్తి శోషింతువే?॥ 104

మ॥ ప్రతికల్పంబు జగాల తోయమును ముంపన్ దోయము
ద్ధృతి వర్షించెడు కాలమేఘ! మధుహంతృప్రాభవ భ్రాంతవై
మతి నీకున్ దడఁబాటుఁబొంద నతనిన్ మాయట్ల యాసించి డ
స్సితివో? యార్ద్రుఁడవైతి చింతిలకుమీ చేకూఱు నీకోరికల్॥ 105

ఉ॥ కాటుక చీకటిన్ దటిమి క్రాలెదు మిన్నున చిన్నిచంద్ర! నే
డేటికి నీవు నీటువెలయింపవు? మావలె నీకు మేని సొం
పేటికి తగ్గె? శేషశయుఁ డీశుడు చక్రధరుండు చాటు నా
మాటల నాలకించి నిజ మానసమందున నాసఁగొంటివో?॥ 106

ఉ॥ ఓయిరులార! మా యరుల నొప్పనవేతురె? మామనస్సు నా
రాయణు పాలుఁజేసి విరహార్తుల మేమును నేము బాసలం
జేయుచు నేడ్వ మానడుమఁ జేరి చరింతురె? క్రూరబుద్ధులా
ఢా! యిల హింసఁజేయుటకె కాదొకొ? మీరనయంబు నుండుటల్॥

ఉ॥ చీకటి వన్నెనీళ్ళఁ గడుజిక్కఁగఁ బాఱెద వుప్పుకాల్వ! ధీ
లేక, యహర్నిశల్ నిదురలేక చరించెద వేమివచ్చె? తన్
డీకొను బండి రక్కసుని డీల్పడఁ దన్నిన చిన్నికృష్ణు న
స్తోకకృపా ప్రభావమునుఁ జూచి వరించి నిరస్తవైతివో?॥ 108

ఉ॥ ఆరక యొక్క ఫక్కి వెలుఁగార వెలింగెదు దివ్వె! ఆసచ
ల్లారకయున్న ప్రాణమును నట్లనె నిల్వదె? యక్కటక్కటా!
నీరజపత్రనేత్రుఁడు వినిర్మల బింబపలాధరుండు ల
క్ష్మీరమణుండు వానికృపఁ జేకొను నాసలు నీకుఁ గల్గునో?॥ 109

మ॥ జ్వలదగ్ని ప్రతిమాశలంగనలి నాస్వాంతంబు చింతించె నీ
వలనన్ జిక్కిన ప్రేమ రేఁబవలునున్ బైఁబోదు నన్ వీడి; మ
ద్దుల మధ్యం జనగంటి కేళి మొగమున్ ద్రుంపంగఁ గన్గొంటి న
గ్గుల నేలన్ గొలువంగఁ గంటి నిక నాకుంజిక్కవోరా! యువా!॥ 110

—♦ఫలశ్రుతి♦—

చ॥ ఒకటియు దక్కకన్నిటికి నొక్కఁడ కాఁగాఁడి, సముజ్జ్వలుఁడు నా
నికి నయి యాసఁ జేసి మహనీయ సహస్రముగా శఠారి గీ
తికలను జెప్పెనందులఁ బదిన్ బయివానిఁ బఠించువారు త
ప్పక హరిధామమున్ బొరయువారు యథార్థము దీనినమ్ముఁడీ!॥

## —♦రెండవ పది♦—

గీ॥ ముక్తిముఖ సర్వ పురుషార్థముల నొసంగు । సకల కల్యాణగుణుఁడు
నాసామి భూమి
నింగి, నంతయు నొక తృటిమ్రింగు కృష్ణు । డొక్కఁడే రక్షకుండు వే
ఱొకఁడు కాఁడు॥ 111

గీ॥ బిచ్చమిచ్చి కపాల భృద్వితతపాప । ముడిపు యదువంశ హర్యక్షుఁడొ
కఁడ కాక
లోకకలుషార్తిఁ దొలగించి సాక, పరుఁడు । గలఁడె? యిదియు నిరూపింప
వలెనె? యకట!॥ 112

గీ॥ సమత, వృషభేంద్రవాహను, గమలజన్ము । గమలగేహినిఁ దనయంద
యమరఁ జేర్చి
యమరసేవ్యాకృతిని మిన్ను నవని నాక్ర । మించ మేన్పెంచు హరికన్న
మిన్న కలఁడె?॥ 113

గీ॥ దివిజులాదిగ సకలవస్తువుల సృష్టి । జేయఁ దనబొడ్డుఁ దమ్మి సృజించె
నలువ
నట్టిదైవమె నాసామి యగ్ర్యుఁడగును । పూవులకుఁ బూజలకుఁ బాత్రి
భూతులొరులె?॥ 114

గీ॥ ఉచిత గుణుఁడయి తాఁదన యుల్లమందు । దలచి వేల్పుల జగములఁ
గలుగఁజేసె
సుందరాబ్జాక్షుఁ డాపరంజ్యోతికన్న । మిన్న వేఱున్నదని కనుఁగొన్న
డెవరు?॥ 115

గీ॥ అందఱను నన్నిఁటినిఁ దనయంద యిఱుకు । లేక యడగించి నిల్పి య
స్తోకదీప్త
మూర్తి, సర్వజ్ఞుఁగు, మనసముద్రమందు । భవ్య శేషాహి శయ్యపై బ
వ్వళించు॥ 116

గీ॥ సప్తలోకాశ్రయైక విశాల భూరి । గర్భుఁడును, వటదళశాయి, ఘనుఁ
డు వాని
యద్భుతంబు నగోచరమైన యట్టి । దివ్య సంకల్ప మెవ్వాఁడుఁ దెలియ
నోపు?॥ 117

గీ॥ తలపుచే వేల్పులాదిగఁ గలుగుసృష్టి । సలిపి ముల్లోకముల శాంతి
నిలిపి దిద్ది
తీర్చి పాలించి తనయందఁ గూర్చు మాయ । పరమ పురుషునకే కాక
పరున కేది?॥ 118

గీ॥ భువనముల లయ మొనరించి బొడ్డుఁదమ్మి । యందు బ్రహ్మను నిందాది
దులైన సురల
దివ్యలోకముల, సృజించు దేవుఁడతఁడ । కృష్ణుఁడయి రక్షకుండగు
నీశ్వరుండు॥ 119

గీ॥ బ్రహ్మ రుద్రేంద్రముఖ సురల్ పతగయాను । పదము సేవించి సద్భక్తి
బలుకుదురట!
“స్వీయసంకల్ప కృతలోక! మాయదారి! । మమ్ముఁ గన్నయ్య! మా
సామి! మాన్య! యనుచు॥ 120

—♦ఫలశ్రుతి♦—

గీ॥ వినుతముగ నేడు లోకాల విక్రమించు । సుందరుని గూర్చి శఠకోప సూరి పలుకు
వేయుఁ బాశురములఁ బది వీనిఁ జదివి । హరివినుతి జేయువారికిఁ గొఱంతరాదు॥

## —♦మూడవ పది♦—

ఉ॥ తేనియ, పాలు, నేయి, సుధ, తీయని చక్కెర మేళవించుచున్
బానముఁ జేసినట్లనుభవంబగు నామధుసూదనుంఘునున్
నేనునుఁ గూడి కూడి కమనీయరసంబులఁ దేలి యాడ నో
మానసమా! శరీరమున మంచితనంబున నీవు నిల్చుటన్॥ 121

ఉ॥ ఎల్లజగాల నీకు సరి యెవ్వఁడు? మిన్న యెవండు? మాయ సం
ధిల్ల ననేక రూపముల నీవుదయింతువు ప్రాకృతాకృతిన్
దల్లియుఁ దండ్రియున్ గురువు దైవము నీవయి కూర్తు దాసుదన్
దెల్లముఁ గాదు నీయుపకృతి ప్రతిఁ జేయుట నాకు మత్పతీ॥ 122

చ॥ "ఇల! బలి! మూడె యడ్గు"లని యేర్పడ నాడి యెఱుంగఁ గాని రూ
పొలసి వటుండవై గురుని యోగము విస్పడకుండఁ జేసి తో
యలఘు గుణాఢ్య! నన్ గలసి యాదరణన్, భవమాయలోనఁ జి
క్కులువడు నన్ను దాసుఁగడుఁ గూర్మి భవత్పద సేవ నిల్పితే?॥ 123

మ॥ భువనాహార! మదాత్మలోఁ గలసితీ భోగ్యోపకారంబు మా
అవురా! యేమొనరింతు? నోడక మదీయాత్మార్పణం జేతునో?
యెవడన్ నేను? మదాత్మ యెవ్వరిది? నీవే నన్నుఁ గన్నట్టి తం
డ్రివి నాయాత్మకు నీవ యాత్మవగుటన్ జేకొందు నీవే ప్రభూ॥ 124

ఉ॥ ఎంతటి జ్ఞానవంతులకు నేర్పడఁ దెల్లము కావు ముక్తి సం
ధింతువు భక్తకోటి కుదధిస్థను కాని సుధారసంబ వ

శాంత సుఖమ్ము నిచ్చెదవు సప్తజగాలు వరాహమూర్తివై
దంతముతోడ నెత్తితివి త్వత్పద పద్మము లింకఁ జేరితిన్॥ 125

మ॥ మునుమున్నె నిను నాశ్రయించితిని రామున్ దాసభూతుండ శూ
ర్పనఖా శ్రోత్రవికర్తనా! శ్రితుల క్రూరంబైన పాపంబు మా
పిన దుర్వార విషంబ వుజ్వలుఁడవున్ బ్రీతిన్ నినుఁగొంచు భ
క్తునకున్ జ్ఞానము నిచ్చి చొచ్చి యనురక్తున్ జేతువీవాత్మవై॥ 126

సీ॥ శుభ లక్షణాభ్యాస శుద్ధి నాలాపించు ప్రౌఢవీణా గాన పాకమ్ముల
భోగ్యభూతుండవు బుధుల జ్ఞానానుభవమ్మెంత నీమహిమమ్మెఱుంగు?
పరమ పావన! మాకు జెఱుకు పానకమవు, నమృతంబవౌదు వర్షార్ద్ర వర్ణ
పతితుండ నాపాపభారంబు వారించి, నన్నేలి కొనవేమి? నా సామి

గీ॥ కృష్ణ! నిముసముఁ గూడ నిన్నెడముఁ జేసి బ్రతుక, గాజాల నినుగాక
పగి మెఱుఁగ
నట్టినాయందు నీవుఁ గృపార్ద్రదృష్టిఁ బెట్టి చేపట్టి విడనాడ కెట్టి యెడల

ఉ॥ ఉట్టిన యున్న వెన్న, పయి, మొక్కెడ డాగి హరించు సామి ము
న్నెట్టి యుపాయమున్ దెలిపె నేనది చేకొని జన్మరక్షఁ బో
నెట్టితి జ్ఞానమున్ దపము, నిష్ఠలు సేయలభించు సత్ఫలం
బిట్టె తదీయ సత్కృపనె, యేను గడించితి నీభవంబునన్॥ 128

చ॥ సురలకు సామి తేనియలు చొప్పిలు చల్లని పూలమాలఁ బే
రురమునఁ గ్రాలు పావనుఁడు వ్యోమమునన్ సరిలేని వాఁడఘ
జ్వరము హరించు శ్రీహరి శుభంకర శీలము నాశ యిచ్చుచున్
దరిసియుఁ జొచ్చియున్ననిగి దప్పిలి త్రావితిఁ దుష్టిఁ బొందితిన్॥ 129

చ॥ భవ కృత సౌఖ్య దుఃఖములఁ బాపి జరా మృతులం జయించి ది
వ్య వపువుఁ గాంచి యేనెపుడు భాసుర తేజుని శంఖహస్తు మా

ధవు భువనైక రక్షకుని దాసుల భాగవతాళి, గోష్ఠి నై
భవమునుఁ బొందువాఁడనయి భవ్య సుఖానుభవంబుఁ గాంతునో?॥130

—♦ఫలశ్రుతి♦—

గీ॥ సపరివారము రావణాధిపు కులంబు । జెడగఁ గోపించు శ్రీరాము శీల మరసి
కురుక శఠవైరి చెప్ప సుందరసహస్ర । మందు నిప్పది జదువ నానంద మెసగు॥

## —♦నాల్గవ పది♦—

గీ॥ అబ్జముఖి యీపె భక్తి చేనాడి యాడి । భావము కరగ నీకతల్ పాడి పాడి
కంటఁ దడిఁ బెట్టి నల్దెసల్ గాంచి కాంచి । నారసింహా! యటంచుఁ బల్కాఱుఁ బిల్చు॥ 131

గీ॥ కామ్యముఖి, ముగ్ధ నీసేవఁ గాంక్షఁ జేసి । వాడి వనరుచునున్నది బాణభుజ, స
హస్ర విచ్ఛేది! నీసేవ యాపెకొల్లు । కూడు? నక్కటికమె లేని వాఁడ వీవు॥ 132

గీ॥ లక్కయును మైనమును నగ్గి ప్రక్కనున్న । కరణి ఖిన్నమనస్సునఁ గరగె నీమె
కరుణఁ జేయవు రావణాసుర పురారి! । యేమిసాధన మిక నేను నేమిఁ జేతు?॥ 133

గీ॥ ఈకుమారిక "లంకాపురైకనాశ! । దృఢ గరుడ కేతనా! యని హృదయ ముఁను
వేడి నిట్టూర్పు విడిచెడి విడుచు నశ్రు । జలము, వ్యాకులపడి కేలుఁ జాచి మ్రొక్కు॥ 134

గీ॥ వేగి, యీబాల, రేఁబవల్ వాగి సొబగు । కనులఁ వేడిగఁ గన్నీరుఁ
గార్చు మీరు
నళులు నలిరేగు మీసొంపు తులసీమాల । నీయ రమలురు మీకృప
యింతె యేమొ?॥ 135

గీ॥ ఉల్లమడగంగఁ గరగి "రావో? దయాళు! । నను మివ్వుల యాసపెట్టిన
ఘనుఁడ!" యనును
"నాదు జీవాత్మ కమృతమైనావు నీవ" । యనుచు నుండును, నీమె
యిట్ల నయముండు॥ 136

గీ॥ 'శౌర! పరమోపకారి! కృష్ణా! పయోధి । శయన!' యని పల్కి యి
క్కల్కి స్వాంతమంద
తనకుఁ దక్కిన దుఃఖము దాచి దాచి । నాడు నాటికి లోలోన వాడి
పోవు॥ 137

గీ॥ కృష్ణ! వంచక! యని పిల్చి కేలుమోడ్చు । నుల్లము దహింప వేడి
నిట్టూర్పుఁ బుచ్చు
కంస విధ్వంస! నీవె రక్షకుఁడవంచు । నమ్మి యెంతలు వంతలీ కొమ్మ
పడునొ?॥ 138

గీ॥ ఇంతి యుదయాస్తమానంబు లెఱుక విడిచి । సురభి మధుపూర తులసి
కా శోభిత! యని
తీక్ష్ణధారా సుదర్శన దీప్త! యనియు । వగచు నీ చపలను నేమి పగిదిఁ
బ్రోతో?॥ 139

గీ॥ చపలబాలిక! యీపె విశాలలోల । నేత్రములనుండి బొట బొట నీరు
కారు
నిహతలంకేశ! యీయేణనేత్రకింక । దృష్టి సౌందర్యమును వాడ నీ
యకయ్య॥ 140

—♦ఫలశ్రుతి♦—

గీ॥ అమలగుణు వామను గుతించి యధికభక్తి । కురుక శరకోపయోగి వాకొనిన గీతి
కా, సహస్రమునందున గలుగు వీని । పదిఁపఠించి విరుల, హరిపదముఁ గొలుఁడు॥

## —♦ఐదవ పది♦—

మ॥ పరమవ్యోమము నట్ల నామదిని సంభావించి విచ్చేయు శ్రీ
హరికిన్, మాలయుఁ, మాళి, హారచయమున్, యజ్ఞోపవీతంబు, సుం
దరమా శంఖముఁ జక్రముష్వలయు, నేత్ర. మోష్ఠమున్, హస్తమున్
జరణమ్మెట్టని తమ్ములట్టివ, యొడల్ జంకించు హేమద్యుతిన్॥ 141

మ॥ స్ఫురదబ్జాక్షుఁడు నబ్జహస్తుఁడును సంపూర్ణాంగ సంశోభియై
హరినా చిత్తముఁ జొచ్చె వాని యురమందా, లచ్చియున్ బొడ్డునన్
దిరమై బమ్మయు వేఱుచోట శివుడున్ దీపిల్లఁ గన్గొంటి నే
నరుదా భాగ్యముఁ గంటి నావిభుని ప్రేమాపాంగ పాత్రుండనై॥ 142

మ॥ కరుణన్ నాహృదయంబులో వెలయు నీకాంతిక్షమాభృత్తు క
న్నరుణాబ్జాభము, నోష్ఠ, మెట్టనిది హస్తాంఘ్రుల్ నవీనాబ్జసుం
దరముల్ లోకములేడుఁ బూర్ణముగ తద్గర్భంబునన్ గంటి నా
హరి సంబంధము లేని వస్తువయి యన్యంబేది లేదొక్కఁడున్॥ 143

ఉ॥ అన్నిక్షణాలు, నాళ్లు, నెల లన్ని సమంబులు, నన్ని కల్పముల్
నన్నమృతాను భోగకలనంబున నెప్పటి కప్డె తేల్చె తా
నన్నిట నిల్చె నా, మరకతాచలమూర్తికిఁ జిత్తవర్తికిన్
గన్నులుఁ జేతులున్ బదయుగమ్ము వికస్వర పద్మసామ్యముల్॥ 144

సీ॥ తనివి తీరని యమృతంబట్ల భోగ్యుడై కారెడు నేలిక, శీలహీను
నన్నును మన్నించి నాచిత్తమునఁ దానుఁ గలిసి యున్నాడిదె కాలమేఘ

వర్ణుఁడు శ్రీకృష్ణ భవ్యరూపంబున బహువిధ భూషణ భాసితుండు
వాని కెమ్మోవికిఁ బ్రతి సేయఁగారాదు పవడంబు వాని శ్రీపాదయుగము

గీ॥ గరములునుఁ గన్నులును నెఱ్ఱకమలములును । మించి యున్నవి రత్న సమంచితంబు
మౌళి తలపైనున్నది మహిత వక్ష । మందుఁ గన్పట్టెడిని మణిహార సమితి॥

మ॥ తలపన్ జోద్యము శేషతల్పుని విచిత్ర ప్రాభవం బెంతయున్
బలు సొమ్ముల్, పలురూపు, లాఖ్యలును నొప్పన్, వాని యత్నించి క
న్నులఁ గన్నన్ జవిఁ గొన్నఁ దాకినను వీనుందోయితో విన్నఁ బె
క్కులు భోగంబులు, జ్ఞానముల్ గలుఁగు మీకున్ భిన్న భావంబులన్॥

చ॥ చెలువయి చల్లనైన తులసీదళ మాలిక మౌళిఁ దాల్చు నీ
బలమగు లోకవంద్య వృషభం బెకదా! యహిశయ్యపై పయో
జలధిఁ బరుండె చెండెఁ బ్రథుశాఖల విచ్చిన సప్తసాలముల్
బలిమిన యీడ్చె సప్తవృషభంబుల నాగ్నజితీ స్వయంవృతిన్॥ 147

ఉ॥ గొప్ప చతుర్భుజంబులు నకుంఠిత తేజము నొప్పు మౌళిపై
జొప్పిలు దివ్యమాలఁ గల సుందరుఁ డచ్యుతుఁ డెట్టి వాఁడొకో!
తప్పుల సైచి నన్ గలసె తత్కరుణాది మహాగుణంబులన్
జెప్పి ముగించు చొప్పెఱుఁగ చెప్పుఁడి మీరెవరే నెఱింగినన్॥ 148

చ॥ అనవధి శీలు, మత్పతి మదాత్మకు నాత్మయునైన వాని నా
కనులకు నింద్రనీల మణి కాంతులఁ దోఁచెడు వేలుపున్ సుధా
త్ముని సరసీజవాసనుని దుర్లభ మోక్షదు, నన్య పూరుషాం
గనలటుఁ గాని వాని, సిరికాంతుని, గూడిచి నాకుఁ జెప్పుఁడీ॥ 149

చ॥ పొలఁతియొ? పూరుషుండొకొ? నపుంసకుఁడో తెలియంగరాదు చూ
పులఁ బడకుండి 'యస్తి' యను పోడలకుండును నాస్తికాళికిన్

గలుఁగడు స్వాశ్రితాదరణ కల్పిత విగ్రహుఁడయ్యు విగ్రహా
జ్వలితుఁడు గాడు నన్యులకు వాని మదీశుని నెట్లు చెప్పుదున్॥ 150

## —ఫలశ్రుతి—

చ॥ ఒకపరి జెప్పి నన్మఱగియకుండని శీలమువానిఁ గుంభన
ర్తకు నుతియింపఁ బూని కురుకన్ శఠకోపుఁడు బల్కినట్టి వై
విక రచనా సహస్రమున వేడుక నీపది పాశురంబు లు
త్సుకతఁ బఠించు భావితమతుల్ హరిలోకముఁ గాంత్రు ముక్తులై॥

## —ఆరవ పది—

శా॥ వైకుంఠా! మణివర్ణ! యప్రకటరూపా! వామనా! దేవతా
నీకాధీశ్వర! నేటికాలమున నీనిండారు భోగామృతం
బేకప్రక్రియ నాయెడన్ గలిగె నిన్నే యాశ్రయింతున్ శ్రితా
ఘూంకారాంతక! శుద్ధికారి! శ్రితపాపాక్రాంత దుష్టవ్రజా॥ 151

చ॥ ఒకయెడ పీడకెల్ల జగమొక్కెడ చక్కఁగఁ దేర్చుచున్ ద్యజిం
చక ననుఁ జొచ్చె చొచ్చి తన జ్ఞానమయోజ్జ్వలమూర్తి జూపి యే
గక యమృతమ్మనట్టిడయి కంజదళాక్షుఁడు నోరచూపు నే
రక స్థిరుఁడై ననుం గలసి రమ్య మహానుభవంబుఁ గూర్చెఁడున్॥ 152

చ॥ తలఁ దులసీ సుమాదికృత దామముఁ దాల్చిన వానిఁ దమ్మిక
న్నులుఁ గలవాని, వేల్పుదొరను న్మన బంగరుకొండఁ జేరి యిం
పొలయ భజించి, మెచ్చి, రతియొప్ప, నటించ ఘటించునట్టి పా
టలను మదీయ జిహ్వక కొడంబడఁ జేసెఁ గృపాళుఁ డాప్తుఁడై॥ 153

మ॥ పరమోదార! మదీయరత్నగిరి! మత్ స్వామీ! మధుద్వేషి! నన్
బారయన్ జేసితి వన్యవస్తువులపైఁ బోనీవు నాబుద్ధి నీ
స్థిర కల్యాణ గుణాబ్ధిఁ జొచ్చి కడుఁ బ్రీతిన్ బాడియున్ నాడి దు
ర్భర సంసారముఁ ద్రోసి పొంగెదను నిన్ బాయంగ నాసాధ్యమే?॥154

శా॥ క్షీరాంభోనిధిఁ బంచభోగయుతమా శేషాహిపై ఠీవియొ
ప్పారన్ బండుక యోగనిద్రకయి ధ్యానైకాగ్రతన్ బొందు సా
మీ! రేయున్ బవలేను నిన్ గని భవామేయాగ్ని తుల్యాఘ సం
భారంబున్విడి నీయనంతపద సేవన్ గంటిఁ బాయన్నినున్॥ 155

మ॥ నినుధ్యానించి భవత్కథా మధురవాణిన్ గూర్చి రాగాది క
ల్పనలన్ బాడుచు నాడి పూర్వకృత పాపంబెల్లఁ జెల్లించితిన్
నినుఁ గైకోని హిరణ్యరాక్షసు నెదన్ ఛేదించి నాముందు ని
ల్చిన తేజోమయ! నారసింహా! యికనాచేఁ గాని పాటుండునే?॥ 156

ఉ॥ ఎల్ల జగాలనేలు పరమేశుఁడె నాయెడఁ బ్రీతిఁ జేసి నా
యుల్లముఁ జొచ్చె నింక విడనోపునె? నాతొలి యేడు జన్మలన్
జెల్లిన నాదు చుట్టములె చేసిన పాపముపోయి నారకం
బెల్లెడఁ దప్పియుండ, కలదే? యిక నాకు నసాధ్యమెద్దియున్॥ 157

మ॥ పలు జన్మంబులు మాఱి పుట్టి కడకిప్పట్టన్ భవద్భాసురాం
ఘ్రులఁజేపట్టితి నుల్లమున్ దనరె సంతోషాబ్ధి నోలాడితిన్
ఖలరక్షోజన సైన్య దైన్యకరుఁడై క్రాలన్ గరుత్మంతుపై
ఁగొలువై ఠీవిగ నున్న సామి! యిక నీకున్ గాదు నన్ బాయగన్॥158

మ॥ అనఘా! శీతల వేంకటాచల నివాసా! యీశ! లంకేశ నా
శన! ఆమూల విశాల సప్తదధివృక్షచ్ఛేద కైకాస్త్ర మో
క్షణ సన్నద్ధధనుర్ ధురీణ దృఢ హస్తా! శస్త్రమాలాధరా!
నిను నాలోపల జాణవై చొనిపి యెందే నింకఁ బోనేర్తువే?॥ 159

ఉ॥ పోయెడు కాలమున్, గడచి పోయినకాలము, వచ్చుకాలమున్
నాయెడఁ దల్లిఁ దండ్రివయి నాదగునాత్మవయాదు సామి! లో
కాయతకీర్తి! సౌరభ సమంచితదామ విలాసమూర్తి! నిన్
బాయఁగ నెట్టులోర్తు? భువనత్రయ రక్షక! భక్తరంజకా॥ 160

—♦ఫలశ్రుతి♦—

మ॥ తులసీ స్స్యూత సుశీతదామ మకుటున్ దుంగాబ్జ పత్రేక్షణున్
బలునాళ్లొందిన "మాఱ" నాఖ్య శఠకోపస్వామి దైవేచ్ఛచే
బలుకంజెల్లిన వేయి పద్యముల నీపైనున్న రెండైదు లిం
పులుఁ గుల్కన్ గనుఁ బాడువాడు హరి బ్రాపున్ భక్తుఁడై కాంచెడున్॥

## —♦ఏడవ పది♦—

మ॥ హరి నీలాంబుని కేశవు న్వపుల రక్తాక్షున్ జగన్నాథు శ్రీ
కరు, నారాయణు, నేనుగొల్వ భువి, నాకంబందు మా బాంధవో
త్కరముల్ పెక్కు తరాలవారు భగవద్ భక్తిన్ గొనంగూడె పె
ల్లరుదై యున్నది వైష్ణవాతిశయ నిత్యవ్యాప్తి మాయందునన్॥ 161

మ॥ పరిపూర్ణాఖిల లోకనేత, శ్రుతి విద్వద్వేద్యు, న్నారాయణున్
గరణంబర్థము కర్త కర్మఫలమున్ గానున్న వానిన్ మునీ
శ్వర దివ్యస్తుతు నాశ్రయించెదను నాస్వామిన్ జగద్రక్షణా
దరణున్, గంసనరేంద్ర వారణ లసద్దంత ప్రదారిన్ హరిన్॥ 162

ఉ॥ "నాకిక నీవ యేడుగడ; నాకొఱకేకద! మాధవా" యనన్
గైకొని నన్నుఁ జొచ్చి యిలుఁ గట్టితి నామది నాదు కల్మషా
నీకముఁ బాపి నీయమృత నిత్య సుఖానుభవంబుఁ గూర్తు నా
ళీకనిభాక్ష! నిమ్నలుపలీల! శ్రితాశ్రయ! శక్రరాప్రియా!॥ 163

మ॥ "పరుఁడా! వెన్నుఁడ! నామనోహరుఁడ! గోపాలుండ! గోవిందుఁడా!
హరి! కుంభాదిక నృత్యవేత్త!" యని నాట్యంబేనుఁ గావించి త
త్పరతన్ నిన్ గొనియాడ నేడుతరముల్ వంశీయులున్ నేను దు
స్తర పాపార్తిని దాటి దేవ నినుఁ బొందన్ గూడె నీచింతనన్॥ 164

మ॥ వితతద్యోతకిరీటు రత్నకమణిన్ విష్ణున్ గనుంగొంటి వి
స్తృత కంజాతములట్లు వెల్గెడును తచ్ఛ్రీ పాదహస్తాక్షు లా

కృతి నీలాచలలీల వెల్గె శశిఫక్కిన్ వెల్గె శంఖంబు న
ద్భుతరీతిన్ గొని వెల్గె చక్రమును సద్యోజాత భానుద్యుతిన్॥ 165

మ॥ నను గల్పాంతర జన్మ జన్మముల జ్ఞానప్రాప్తిఁ గావింప వ
చ్చిన సర్వేశ్వరు కూర్మి క్రిమ్మికొని వచ్చెన్ నాయెడన్ నేడు ది
క్కన లేదా మధుసూదనాత్పరము, నన్యార్థంబు లేదంచుఁ గ
న్గొనవయ్యెన్ భగవత్కథా 'మధురవాకుల్ బాడి క్రీడించెదన్॥ 166

చ॥ పరమసమర్థ! వామన! శుభంకరనేత్ర! భవన్మనోహరా
ధర ఫలపాక రాగరుచిఁ దార్కొనునీ శుచి దంత కాంతికిన్
గరగి, నుతించి, మ్రొక్కి కలకాలము నీపదసేవఁ జేయఁ గా
మఱగిన డెంద మిచ్చితివి మాకు దయాబ్ధి! త్రివిక్రమాహ్వయా!॥

ఉ॥ వామన! రత్నవర్ణ! నవవారిజనేత్ర! మనోజతాత! సు
శ్రీమహితాత్మ! యంచు నుతిఁ జేసి పదాలకు మ్రొక్కి బుద్ధి ని
త్యామలతన్ వహించి విషయార్తి నడంచి సుఖించుటెల్ల నా
కీమెయిఁ గల్గె శ్రీధరుఁడ! యేనిఁక నీఋణమెట్టు లీగుదున్?॥ 168

ఉ॥ ఆశలఁ బెంచి, కన్నుల నవాశ్రుకణంబుల నించి యో! హృషీ
కేశ! రమేశ! రక్తజలజేక్షణ! యంచును రేఁ బవల్ ముదా
వేశత నార్చి యూర్పువిడి వేదనలేని సుగంబుఁ గంటి స
ర్వేశ! సదా, మదీయహృది నెప్పుడు వీడక నీవు గూడుటన్॥ 169

మ॥ మనసా! ఇంద్రియ పంచకేశుని, జగన్మందారు, లంకేశ్వరా
డి, నిశాటాంతకు దేవ దేవుఁ గరమర్థిన్ గొల్చి చేఁబట్టు తి
న్నన వానిన్ దెలియంగఁ బూను మెఱుకన్ గర్వింప కప్పద్మనా
భుని, నీ, కత్యుపకారకు న్విడకుమీ! బోధాప్తి నీకుండినన్॥ 170

మ॥ అతులాధిక్య పరాక్రమక్రముఁడు కల్పాభుండు నబ్జోదరుం
టతఁడే, మక్కువ, నాకుఁ దన్నొసఁగెఁ దానై యాసుధాభోగ్యు నా

§ తత వర్షాబ్దనిభాంగు, నిర్జర విభున్ దామోదరున్ వేంకట
క్షితి భృద్వాసుని సేవకుండనయి సంసేవింతు నాతేనిఁ గన్॥ 171

మ॥ జగతీ సంహారణైక కారణుని విశ్వప్రాణు దామోదరున్
దగివేఱెవ్వ రెఱుంగ నేర రని తద్దామోదరాంగంబు లే
§ యగు బ్రహ్మేశ్వరు లాశ్రయించి హరిమాయల్ దాఁటుదుస్తరరా
భగవానుం డగుపించె నాకనులకున్ బాధోధి వర్ణాకృతిన్॥ 172

—♦ఫలశ్రుతి♦—

శా॥ వర్ణోదీర్ణ మణిప్రకాశు సురనిర్వాహున్ శ్రితప్రీతి సం
పూర్ణున్ గూర్చి శఠారియోగి ద్రవిడా పూర్వోక్తి సందర్భమున్
గర్ణానందముగా నొసర్చె జలదాంగ ద్వాదశాఖ్యాది సం
కీర్ణంబీ దశకంబు దీనిఁ జదువన్ సిద్ధించు శ్రీశాంఘ్రులున్॥

## —♦ఎనిమిదవ పది♦—

ఉ॥ చేరు నహీశ తల్పమున శ్రీసతి కౌగిటఁ దేరు రెంటికిన్
గారకుడున్ స్వయంభవుఁ డనంత పదార్థ నిరంతరస్థుఁ డా
ధారుఁడు ముక్తికిన్ బహు విధప్రబలాఘ జలౌఘ ఘూర్ణ సం
సార పయోధి సంతరణ సాధన తారఁణు గొల్వుఁ డాహరిన్॥ 171

చ॥ అలరులు చల్లనీరు పొలుపారు కొలంకునఁ జిక్కి గ్రుక్కి నే
స్తల దొర తెచ్చువాపె నను సాకిన యేకవిభున్ హరిప్రియా
దళ శుభమాలికా ధరుని,ఁ దల్చి భజించిన జన్మ జన్మలన్
బలిసిన పాపమున్ వెడలవైచి యొసంగును మీకు ముక్తియున్॥ 172

మ॥ తన పుట్టిల్లయి యున్న పంకరుహమున్ దానున్ రమేశాంగ మం
దున నుండంగ సృజించు బ్రహ్మ జగమున్, ద్రుంగించు రుద్రుండు పే
రిని సృష్టించి తదంతరాత్ముఁ డగు నీశ్రీవత్సు వ్యాపార వ
ర్తనముల్ సప్త జగత్ప్రసిద్ధములు స్వాతంత్ర్య ప్రకల్ప్యంబులున్॥ 173

చ॥ పరపద కాముకుల్ విషయపంచక మందుఁ జరించు నింద్రియో
త్కరము జయించి నిత్యసదఖండ ముదంబునుఁ గోరుచో నిశా
చర హరు ముందుఁ గొల్చి ఫలసాధనమైన తదీయ శీలమున్
వెరవునఁ జొచ్చి తామనుభవింతురు సంతత శాంతి భోగమున్॥ 174

చ॥ భవ గత పాప పుణ్య మయ బంధము లన్నిటి కేక కారణం
బవనము ముజ్జగాలకు, నజాదుల కీశుఁడు శుద్ధుఁడయ్యు వి
ష్ణువు; హయకంధరుండు, వనసూకరుఁడై కమరంబు మత్స్యమై
భవమునుఁ బొందె మానవ భవంబునుఁ బొందె శ్రితప్రమోదియై॥ 175

చ॥ అనఘుఁడుఁ దీర్ఘపాదుఁడును నా హరి యొక్క జగత్త్రయంబుఁ గొ
ల్చిన పదమందునన్ నరుఁడు చెందొగ మాల నమర్చి పార్వతీ
శుని శిరమందు దానిఁ గని చోద్యమునంది రమేశు మాయ మె
చ్చెనట! పరుండు సంశయముఁ జెందగ లేశము సందుఁ గల్గునే?। 176

చ॥ పడుకొని, యుండి, నిల్చి కిటి పక్కినిఁ గ్రిందకు దూఱి వెల్లిపై
వెడలఁగఁ దీసి, లోనిలిపి వెల్వడఁ జేసి విశాల దోస్థలిన్
గడు బిగిఁ గౌగిలించి క్షితికాంతకు శ్రీహరి చేసినట్టి బో
లెడు మరియాదలన్ దెలియలేరుకదా యెటువంటివారలున్॥ 177

చ॥ తెలియఁగఁ జాలువారెవర? ధీశుని కృష్ణుని వానిమాయలన్
దెలిపెడు నట్టిదేది? జగతీ నివహంబొక ముద్దఁ గాగ లో
పలఁ గొను ప్రోడ వాఁడె శుభవన్నిజ ముక్త పదస్థ నిత్య జీ
వులనుఁ దదన్య వస్తువులఁ బోవిడ కంతట నిండియుండెడున్॥ 178

మ॥ కలఁడెచ్చో హరి యన్న పిన్న నుడువున్ ఖండించి యిచ్చోటనున్
గలఁడా? యంచునుఁ గంబమున్ విరువ నక్కంబంబునం బుట్టి ని
స్తుల రోషాప్తి హిరణ్యుఁ జక్కడఁచె తోడ్తో మానృసింహుండు త
ద్బల మాహాత్మ్యములెన్న కాదనుచు వాదా? యెంత హాస్యంబగున్॥

చ॥ నలి యగు ముక్తియో? దివియొ? నారకమో? తుదిగాగ మధ్య ది
వ్యులడర, నుండు వస్తువుల కొక్కఁడ విత్తును, వేఱు, మాౕనునై
వెలసి విలక్షణుండయిన విశ్వపతిన్, నను నేలువానిఁ బు
ష్కల జలదాభ నీలతనుఁ, గంటిని నాకనులున్ ఫలింపగన్॥ 180

—♦ఫలశ్రుతి♦—

చ॥ నలువగు పెద్దకన్నులును నల్లనిమేనుఁ గల్గి సామికై
యళిరవ నిష్కుటాఢ్య కురుకాఖ్యపురిన్ శరకోప సూరి పా
టల నొకవేయిఁ జెప్పె ద్రవిడంబున నందలి యీపదిన్ విని
శ్చలతఁ బఠించువారు హరి సన్నిధి గాంతురు పాపముక్తులై॥

## —♦తొమ్మిదవ పది♦—

గీ॥ ఎట్టి మోక్షమ్ము నిమ్మన నీశ నిన్ను । తావకారుణ చరణపద్మముల నాదు
తలనుఁ జేర్పుము గజరాజ తాపహరణ । దాసునకుఁ గోర్కె యిదియ నాతండ్రి! పరుఁడ॥ 181

గీ॥ నాకుఁ గాటుకజిగి రతనంపుచాయ । దోచు నాసామి నీయడ్డ దుర్లభంబు
నాకుఁ గూర్చుము కేలిచ్చి స్వీకరింపు । జాగుఁ జేయకు నాకోర్కె సతము నిదియె॥ 182

గీ॥ నను నఘము లొందనట్టు సంకల్పమూను । పరుఁడ! కృష్ణ! సుదర్శన కరుఁడ! కఫము
గళము నొక్కెడు నెడశ్రమఁ గనక నీప । దనుతిఁ జేయగ నాకునొక్కనికిఁ గూర్పు॥ 183

గీ॥ తననె, నే, నిచ్చ సేవింపఁ దలపు జేసి । మనసులోఁ జొచ్చి విడకుండి తనకె నన్ను
శేషభూతునిగాఁ గొనె శ్రీనిలయుడు । నేను నాసించి యడిగిన దాన మిదియె॥ 184

గీ॥ చావొదవువేళ మోక్షమొ స్వర్గపదమొ, । నరకమో, పొంద సరియె పొందమియు సరియె
జనన హేతువు లేకయు జననమందు । హరిన యేమఱకేనెపు డను భవింతు॥ 185

గీ॥ అలరు సురలునుఁ జతనులల యచేత । నములు జ్యోతులు సృజియించు నాథు నిన్ను
నలరు చిత్తము వాకు, చేతులునుఁ బూని । యలరుతో నాశ్రయింతు నిచ్చలును రావె?॥ 186

గీ॥ ఉల్లమున నిచ్చ నీవుండకుంట నైప । నిచ్చ లెల్లెడ నీరమణీయ కుసుమ
పేశలాంఘ్రిల యడుగుల విడక నేన । వచ్చి సేవింప తఱి యీయ వలయు రావె?॥ 187

గీ॥ వితత విధి సూత్ర విధులభావితుఁడవయ్యు । నాకు ఫల శర్కరల వంటి నాయకుఁడవు
అనయమును నాహృదయ మంద యధి వసింపు । నిన్నుగాక పరంబును నేనుఁ గోర॥ 188

గీ॥ నిత్యపతి! నిత్యనుత! నన్ను నేనెఱుఁగక । నేననియు, నాది యనియుఁ జింతించు చుంటి
నేనె నీవాడ నయి యుంటి నిక్కమరయ । నాది యను వస్తుచయమెల్ల నీది కాదె?॥ 189

గీ॥ ఏడుకోడెల నోడిచితి వెసఁగు లంక । నివురుఁ జేసితి వతిరమణీయ రూప!
నన్ను, బాధ్యునిఁ జేయక చెన్నుఁగల భ । వత్పదముఁ జేర్చి పోనీక
వదల కెపుడు॥ 190

—♦ఫలశ్రుతి♦—

గీ॥ విడక చక్రముగొను సామి విశ్వసించి । విడక కురుకాపుర శఠారి
నుడువు వేయి
కీడు రానీని పాటల గూడువీని । బదిఁ బఠించినఁ గీడేఁది వరలు ముక్తి॥

## —♦పదియవ పది♦—

చ॥ పెరిగెడి మోజ రాజిలెడి పిన్నతనం బఱి వోక ముందటే
పెరిగెడి మోజ, మాయ, గల వెన్నునకున్ దిరమైన కోయిలై
పెరిగెడు లేత తోటలకుఁ బేర్వడు నా "*తిరుమాలిరుంజోలై"
గిరిఁ ద్వర నాశ్రయించి వెతఁ గెంటుఁడు మీపురుషార్థమున్ గనన్॥
చ॥ తరుణుల సుందరాంగనలఁ దత్ప్రణయంబుల నెంచ కేగి దు
ర్భరదర ఘోషతో "అజకర ప్రభు కోయిలమై నిశా
కరకర ధాత గోపుర ముఖంబగునా "తిరుమాలిరుంజోల"న్
బరమ పవిత్ర దేశమునుఁ బ్రస్తుతిఁ జేసి సుఖింప నెంచుఁడీ॥ 192
ఉ॥ బేలమనస్సు! కర్మలనుఁ బెల్లుగఁ జేయుట పొల్లు వాన, మే
ఘాల వినీలకాంతి ♦"నజకర్పతి" తాల్చి వసించు కోయిలై
చాలగ మోహమున్ గొలుపఁ జాలెడు తోటలు ప్రాలు "మాలిరుం
జో"లకుఁ బ్రిక్కనున్న మలఁ జొచ్చి సుఖించుటె కార్యమయ్యెడున్॥
చ॥ మన, ఘన కర్మబంధముల మాపి సుగంబునఁ దేలునట్లుగా
మనుపఁగ దొడ్డ భూధరమ మానుష శక్తి ధరించు కృష్ణుఁడే
తన, మహిమల్ బయల్ పఱుపఁ దావెలసెన్ "తిరుమాలిరుంజోల"న్
వనములు మిన్ను ముట్టు నలపర్వతమున్ బనిఁ బూని చేరుఁడీ॥ 194

*గ్రామ నామము ♦దేవుని పేరు

చ॥ బలమగు ఘోర పాతకపు బంధములన్ విడఁగొట్టు ధర్మమున్
దలకొను చక్రి కోయిలయి తద్దయు నిర్మల సుందరంబుతా
జలలు సతంబు వ్యాప్తమయి జానగు నా "తిరుమాలిరుంజొలన్॥
గల గిరిఁబొంద నేగుటయెగా సదుపాయము భక్తకోటికిన్॥ 195

ఉ॥ లోలత మానుఁ డుట్టివల లోపలివెన్న హరించు కృష్ణుదే
వాలయమై మృగాలు నెలపాయపుఁ బిల్లలతోఁ జరింప శో
భాలలితంబునైన గిరి వర్ధిలు నా "తిరుమాలిరుంజొలన్"
నేలకుఁ బోవుతోఁ వ మరి నిల్పుటె మీకు నుపాయమయ్యెడున్॥ 196

చ॥ నరకము నందుఁ గూలకుఁ డనంతను నెత్తు వరాహదేవుఁడున్
దిరమయి యున్న స్థానమయి దివ్యసుధాకర బింబ మండలం
బొరసెడు 'మాలిరుంజొల' మహోజ్వలితాద్రి, విధి ప్రకార సు
స్థిరులయి చేరి నిల్చుటయె శ్రేయముపాయము భక్తకోటికిన్॥ 197

చ॥ బలమునుఁ గూర్చి సంతతభవంబున నా బలమెల్లఁ గోలు పో
దలపక; మాయకృష్ణుఁడె ప్రదక్షిణ మిచ్చి వసించు చోటు, ది
వ్యులకుఁ బ్రదక్షిణస్థలముఁ బూతమునౌ 'తిరుమాలిరుంజొలన్'
దలపడి నాడు నాడునుఁ ప్రదక్షిణమున్ బొనరింపుఁడెల్లయున్॥ 198

శా॥ క్రూరాఘంబులఁ గ్రుంగి పోవకుఁడి! భక్తుల్! పుతనా శిక్షకా
గారంబై యెల యేన్గు గుంపులు చెలంగన్ బెంపు సొంపారు సాం
ద్రారామంబుల దట్టమై రుచిరమా నా"మాలిరుంజోలకున్"
జేరన్ దల్చిన మాత్ర మీకు జయమా శ్రేయంబు ధర్మంబగున్॥ 199

ఉ॥ జూదమొ? చౌర్యమో? జరుపుచున్ ధనమేటికి కూర్తు రకట్టా!
వేద వికాసుఁడాసఁ గొని ప్రీతివసించు నివాసమై మయూ
రాది పతంగ సంఘ చరితాటవులన్ "తిరుమాలిరుంజొలై
మోదముఁ గూర్చు నచ్చటికిఁ బోవుటె మీ పురుషార్థమయ్యెడిన్॥ 200

—♦ఫలశ్రుతి♦—

చ॥ పని వడునంచు నీజగము వాఁడె యొనర్చెను వాని చెల్వొఱుం
గని యవివేక మూడ్చి కురుకాపురిలో శఠకోప సూరి స
జ్జనులకు తత్వమేర్పడగఁ చారుగతిన్ బలికెన్ సహస్ర మం
దున గల యిప్పదిం జదువు ధూతభవుల్ వడిగాంత్రు మాధవున్॥





# శఠకోపగీతామృతము.

## మూడవశతకము

—♦మొదటి పది♦—

ఉ॥ నీముఖకాంతి వాళిపయి నిండెనో? నీపదకాంతి పీట కెం
దామర మీదఁ బాఁకెనో? మనస్సు హరించెను నీకటీ తటీ
ధామము నైజ తేజమునఁ దారెడు పచ్చని చేలమందు శో
భామయ దివ్యభూషణముపైఁ బ్రసరించెనో? చెప్పు శ్రీహరీ!॥ 201

ఉ॥ ఆరయఁ దమ్మి నీకనుల కన్నులకున్ సరియే? పుటాలచేఁ
దేరిన మేల్మిపైడి భవదీయ తనుద్యుతి కీడె? లోకులీ
తీరునఁ దోచినట్లు సరిఁ దెల్పుచు నీమహనీయ సుందరా
కార విధంబుఁ జేర్కొనుట కాని పనే కద! దివ్యశోభనా॥ 202

ఉ॥ ఏతటి వేఱుజ్యోతి యొకడీడయి యుండమి నిన్నెగా, పరం
జ్యోతి యటందురో పరుఁడ! జ్యోతుల కెల్లను మిన్నవౌ పరం
జ్యోతివి నీవ నీతలఁపు చొప్పున లోకముఁ జేతు, మత్పరం
జ్యోతి! శ్రితావనా! తగి నిను న్వినుతించుట నాకు శక్యమే?॥ 203

చ॥ కమలము నందు పుట్టిన యఖండ జగన్నివహంబు నీనిధా
నములయి యుండి పుష్పమృదు నవ్యము నీతనుశోభ యుల్లమూ
దమ రుపలేక యుండ పలు వ్యర్థమతంబుల వానిఁ జొన్పి చి
త్తము వనమాలపై నిడెదు ధర్మమె? లోకము జాలిఁ బొందదే?॥ 204

చ॥ శ్రీమరహిత ప్రకాశమున రాజిలు దివ్యశరీరకాంతి న
శ్రీమమగు జ్ఞానమున్ గొని నిరంతర సర్వపదార్థయామి వై
సమముగ మూడుకాలములు సాకెను లోకము నేతవై యొకే
క్రమమున నీగొనంబుల నెకా యెకిఁ జెప్పఁ దరంబె? యెక్కడన్?॥ 205

ఉ॥ ఈపృథు సప్తలోకముల నెన్ని విధంబుల చెన్నుఁ గన్న య
ధ్యాపకులైన వారి శ్రుతులన్నియు నీశుభశీల జాలమున్
బైపయిఁ దాకు నింతె వని వర్ధిలుమై వనమాల వక్షాళిపై
దోప, నురంబుపైఁ గమల తోఁచెడు నీప్రభ నేమి చెప్పుదున్?॥ 206

చ॥ పలువురు నిన్నుఁ గూరిచి స్తవంబులఁ జేతురుగాక! నీటిలో
నిలచు జగాల సృష్టికయి నీవ విరించి సృజించి తట్టి, నిన్
దెలివిఁ గలట్టి రుద్రముఖ దేవత లందఱు నొక్కపెట్టుఁ గా
దెలిపి నుతించిరేని భవదీయ గుణంబులు తక్కువై చెడున్॥ 207

చ॥ అమల సుహూప దీక్షా భరితా! హరి! వృద్ధి వినాశ హీన శు
ద్ధ మహిత సత్వతత్వ! వితత ప్రతి వస్తు శరీర! నేత! అ
త్యమల వివేకవంతుఁడగు నయ్యజుడుం గొనియాడి చూడఁగా
విమల భవత్పదాబ్జ రుచి వెల్గఁ జెప్పెటు కాదె? శ్రీహరీ॥ 208

చ॥ మొన మొఱచోని చక్రమును పొల్పగు నీకుడిచేతఁ బూని పు
గ్గాను నడిపించి వచ్చితివి, కొల్వున కాసిలియున్న యా గజేం
ద్రునిఁ దనుపంగ బొజ్జపయిఁ దోచు జగంబుల భక్తులందు మ
త్వని తెలివే వహించి జరుపన్ భవ దుజ్వలకీర్తి మాయదే?॥ 209

ఉ॥ వేద రహస్య వేద్య! ద్యుతివృత్త! లతాంత నితాంతభోగ్య! నీ
వాది క్షితిన్ సృజించి విడునట్లుగఁ దీసి గ్రసించి యుమ్మి నీ
పాదము తోడఁ గొల్చితివి బ్రహ్మయుఁ జంద్రధరుండు నింద్రుఁడున్
సీదయి తత్వమున్ దెలిసి నిన్ను స్తుతించుదురన్న స్వబ్రమే?॥ 210

—♦ఫలశ్రుతి♦—

ఉ॥ వింతయి వింతలేని శ్రుతివేద్యునకై, జయలబ్ధ సద్యశో
వంతుల వాడయౌ 'కురుక' పట్టణమందు శఠారి, సంశయ
భ్రాంతుల వీడి కొల్చి నుడువంగల వేయిఁట నీపదిన్ బఠిం
పింతురయేని వార్ధివృత పృధ్వి జనిం గనరెట్టి వారలున్॥

—♦రెండవ పదు♦—

శా॥ మున్నీరుల్ గల నేలఁ జేసిన మదంభోదాంగ! యీనాడు ప్రీ
తిన్ నీవిచ్చిన మేనులోనఁ బడి భ్రాంతిన్ దిర్గుచున్నాడ, నా
పన్నాలయ్యె దినాలు నాయఘము దుంపన్ ద్రెంపి మాయింపుమో
యన్నా! నిన్విడనోప నింక నిను నాకందింతు వేనాటికో?॥ 211

మ॥ బలవద్విస్తృత భూతలాక్రమణ! దేవా! వామనాకార! నీ
పలు దివ్యావ్యయ మాయలన్ ధరణిపై బల్పాట్లుపుల్ బుట్టు నే
బలవత్పాప విశృంఖ లావళులఁ ద్రెంపన్ గాంచి నీశ్లాఘ్య మం
జుల పాదమ్ముల పొంతఁ జేరి బ్రిదుకున్ బోఁబుచ్చు టేనాటికో?॥ 212

మ॥ చెనకన్ జాలని ముల్లుకోలనె కురుక్షేత్రంబునన్ యుద్ధ సా
ధన శస్త్రంబు నొనర్చి కౌరవ చమూధ్వంసంబుఁ గావించి తో
జనకా! దైహిక ఘోర పాశములఁ ద్రుంచన్ బూని వ్యర్థుండనై
తిని నేనిన్నిఁకఁ జేరు నొక్క-వెఱవున్ దెల్లంబుఁ గావింపవే!॥ 213

మ॥ వివృత జ్ఞాన వికాస భాసుర! సదా, వృద్ధి క్షుతుల్ బొందుచున్
భువనాల్ నిండెను నీదుతత్త్వము; ప్రభూ! బోధింపు నాకున్ గృపన్
భవదన్యార్థములందు నెందు వగలన్ బాయంగ; నీపాద ప
ద్మ వశీభూతుఁడనై సుఖించి నినుఁ బొందన్ గల్గు నెత్తుండినన్॥ 214

ఉ॥ వచ్చిన యట్ల వచ్చి ననుఁ బాయవ నామది చంచలంబుగా
విచ్చినఁ గూర్చి చేర్చవ ఉపేక్షయె నీకు స్వభావమయ్యెనో?

హెచ్చగు కుందతెల్లు విరియించిన పువ్వుల నిగ్గువాఁడ! నే
నెచ్చటకున్ బ్రియాణమయి యేగి నినున్ బడయంగ నేర్తునో?॥ 215

ఉ॥ చేయుదు జేయకుందునని చెప్పక పోతిని చాల నాడు ల
ల్పీయ సుఖమ్ములన్ గొసరు లీలల ముగ్గి తొలంగినా నసం
ఖ్యేయ విధాన జీవముల సృష్టి యొనర్చిన దేవ! రమ్య తే
జోయుత! తావకాంఘ్రులనుఁ జొప్పడు భాగ్యమునాకు నెప్పుడో?॥

మ॥ కల కాలంబును నుండి యుండి మనసా! గాసిల్లి తత్త్వార్థమున్
దెలియన్ లేక, యనేక పాపముల వృద్ధిన్ గూర్చు జన్మాలలో
పలఁ జిక్కిం గొనినట్టి మాకు, సకల ప్రాంతమ్ములందెప్డు దే
వ్వలనన్ నిండిన కృష్ణు జ్ఞానమయు సేవన్ బొందగా వచ్చునే?॥ 217

ఉ॥ హేతువు సర్వదుఃఖముల కీకలుషంబుఁ దొలంగనైతి నా
కూతగ నెప్డు నీపదము లోర్పునఁ బట్టకపోతి మత్సరం
జ్యోతి! యనాదిశీల! హరి! చూచెద రమ్మని పిల్తు కృష్ణ! ని
న్నేతల మందు నుంటివని యిప్పుడు పిల్చుచు నుంటి నక్కటా!॥ 218

చ॥ కలుష చయంబు నాఁబడెడు కానలలోఁ జిరకాల ముండియున్
బిలిచియుఁ బిల్చి దారివిడి పెక్కు వితాల భ్రమించు పాపినై
యల యెడ గొల్లఁడై, జగము లన్నియుఁ గొల్చిన వాడుఁనైన ని
ర్మలు నీక నేడ నుండునని ప్రార్థనఁ జేసి లభింతు నక్కటా!॥ 219

మ॥ యమదూతల్ దరినున్న వేళ నగు ఘోరాయాస మట్లున్న దుః
ఖ మదెల్లన్ విడిపోవ వేద విదితున్ గంభీరు నాకృష్ణుఁ జి
త్తము సేవించి స్థిరత్వమున్ బడసె నిత్యత్వంబు నాయాత్మకున్
నమరెన్ నైవ కృపా కటాక్షముల కిన్హాంబయ్యె నాదేహమున్॥ 220

—♦ఫలశ్రుతి♦—

చ॥ భువనము లెల్ల ప్రాణులును బొందిన శ్రీపతి గూర్చి, కోకిలా
రవ వన శోభితంబగు పురంబున న"కుర్కక"న్ శఠారి దో

ష వికతి రాగయుక్త మృదుశబ్దపు గీతల వేయి జేసె నం
దివి పది వీని నారసిన నీతనుబంధము నాత్మ తొల్గెడిన్॥

## —మూడవ పది—

చ॥ పలు సెలయేళ్ల పాఱుదల బంధురమై ధ్వనియించు వేంకటా
చలమున సుందరంబును, బ్రశస్త వికాసమునైన మూర్తితో
నిలచిన వాని, నాజనకు నిన్, మఱి తాతనుఁ దాత తండ్రినిన్
గలుగఁగఁ జేయువాని కల కాలము నెయ్యెడఁ గొల్తుమంతటన్॥ 221

చ॥ తలపగ నాకు నన్ గనిన తండ్రికి, తాతకు దాత, తండ్రికిన్
గొలమున కెల్ల నాదియయి గొప్ప గొనంబుల నొప్పె; వేంకటా
చలమునఁ గారు మబ్బుజిగి చాలఁగ గ్రాలఁగ సర్వనిత్య సూ
రులుఁ దదధీశుఁ డిచ్చెడు విరుల్ నెఱిఁ దావులఁ జిమ్మ సామియై॥ 222

మ॥ తెలినీళ్లన్ సెలయేళ్లు నిండికొని సందీపించు శ్రీవేంకటా
చల సీమన్ మన సామి, మాయుఁ డరుణచ్ఛాయా ఫలోష్ఠుండు మం
జుల రక్తాంబుజ పత్రనేత్రుఁడు, కడున్ శోభిల్లు నీలాభుఁడు
జ్వల కల్యాణ పురాణశీలుఁడు సురార్చ్య స్వాంఘ్రి రాజీవుఁడై॥ 223

చ॥ అమరుల కీశుఁ డంటి నటులంటకు నీర్ష్యయె కారణంబు ప్రే
మము మును గాఁగఁ జెప్పఁబడు మంచి గుణాల నొకండు లేని నా
కమరి వశుండ వైన పరమాద్భుత తేజుని వేంకటేశు నా
యమరుల కీశుఁడన్న నది యాతని భూతినిఁ బెంపుఁ జేయునే?॥ 224

చ॥ శ్రుతిచణభావిత శ్రుతులె స్తోత్రము జేసెడు నట్టి భోగ్యుఁడే
వితమగు దోసమున్ గనని విశ్వ సమాశ్రయుఁ డాది మూర్తి శ్రీ
పతి మన వేంకటాచల నివాసుఁ డధీశుఁడు లోక మోహన
ద్యుతి యుతుఁ డన్నచో, నతిశయోక్తియె? ధీయుతు లెంచి చూడుఁడు॥

ఉ॥ ఎందును "వేంకటాద్రి పత యేనమ" యంటకు నోపువారికిన్
ముందటి పాపముల్ తొలఁగి పోవును భావిని వచ్చు పాపముల్
పొందకఁ దప్పిపోవు నివి బూకలుఁ గావు నిజమ్ము లిట్లు చె
ప్పందగు వారు వారికె శుభంబుల గూర్చి కొనంగ గల్గరే?॥ 226

చ॥ అలరులు, నీరు, దీపమును, నచ్చపు ధూపముఁ దెచ్చి వచ్చి దా
సులమని నిత్యసూరు, లల సూరులపై నొడయండు వేంకటా
చల సువిశాల సీమకయి సాగిలి వందన మాచరింతు ర
వ్వలన నొసంగెడున్ మనకు వాని సమానతఁ గన్న ముక్తియున్॥ 227

మ॥ కుధరంబెత్తి ధరించి వాన వలనన్ గోగోపులన్ గాచె నా
డు ధరామండల మద్ధునన్ గొలిచి యద్దుల్ గ్రిందుగాఁ ద్రోచె ధీ
నిధి సర్వేశ్వరుఁ డేగి చేరె సిరులన్ జెన్నారు శ్రీవేంకటాం
క ధరా భృద్వరమందు అందు నిలువన్ గాలుష్య నాశంబగున్॥ 228

చ॥ తన వినతాళి వ్యాధుల వదల్చుటకై దయచేసి వేంకటా
ద్రినిఁ గొలువున్న కృష్ణు, నవ దివ్యలతా సుమసామ్య పాదముల్
మనసున వాకునన్ నిలుపు మానవకోటికి, జన్మజన్మ బం
ధనము, జరానుబంధ పరితాపము మృత్యువుఁ గల్గ వింకటన్॥ 229

ఉ॥ ఇచ్చిన యాయువంతిమపు టెల్లలఁ జేరికొనంగ, మీమెడల్
విచ్చి మనస్సు ఖేదమున వెక్కసమై చెడకుండ మున్న నే,
విచ్చిన పాముపాన్పుఁ గల వెన్నున కిక్కగు వేంకటాద్రినిన్
జొచ్చి తదీయ సూనవన సుందర దేశము నాశ్రయించుఁడీ॥ 230

—♦ఫలశ్రుతి♦—

కం॥ చరణమున ధరణిఁ గొలిచిన । పరుగూర్చి శఠారి వనుల వర్ధిలు కురుకా
పురి జెప్పు వేయిఁటం బది । నరసి సిరియునసముఁ బొరసి యలరుఁడు
భక్తుల్

## —•నాల్గవ పది•—

మ॥ వినుతానంద గుణాత్ముఁ డొక్కడనియో? వృద్ధక్షమన్ బొల్చు తన్మా
యనియో? నిర్మల శీతలాంబువనియో? యాకాశము, న్నగ్ని, గా
డ్పనియో? సూర్యుఁడు చంద్రుఁ డంచుననియో? యావత్తు వీఁడేకదా!
యనియో? యద్భుతరూప; నిన్ను నెటు కృష్ణా! నేనుగీర్తించెదన్?॥231

సీ॥ "సకల కులాచలాత్మక రూప" యందునో? "యాశాస్య నైత్య శీలా! పయోద!"
యందునో? "యభ్ర పథాంచిత తారకావళి!" యందునో? నాదు చలిత జిహ్వ
గల కల లాడెడు కళల గుంపందునో? "సుజ్ఞాన సర్వస్వ సుందరాంగ
భంగి నొప్పారు శబ్దంబ;" యంచందునో? పరమ విఖ్యాత సౌభాగ్య శాలి 232

గీ॥ బరమ సులభుని మాస్వామిఁ బంకజాత
పత్ర నేత్రునిఁ గృష్ణు దివ్యప్రభావు
నఖిల వస్త్వంత రాత్మకు నాది దేవు
నేవిధము పిల్వవలయునో యెఱుఁగనైతి॥

చ॥ 'వనరుహ నేత్ర' యందునో? 'ప్రవాళ కళాధర' యందునో? 'నవాం
జన తనువర్ణ యందునొకొ? 'సారసపాద' యటందునో? 'నవా
రుణ మణిమాళి' యందునో? 'యురోవిలసత్క మలాంక లాంఛనా
యనెదనో? 'శంఖ చక్రధర' యందునో? జాతిమణి ప్రభానిధీ॥ 233

ఉ॥ అందునో? 'జాతిమానికమ, యంచును మేల్మిపసిండి! ముత్తెమా
యందునో? 'జాతివజ్రఖని' 'యారని దీపమ' యందునో? 'మహా
సుందర తేజ! ఆదిగుణ శోభిత పూరుష!' యందునో? చిదా
నందుని నచ్యుతు స్స్వామలు నాకు ననాది సహాయు, నాథునిన్॥ 234

చ॥ 'అమలుఁడ! అచ్యుతా! శ్రితజనార్తి హరాపధరాజ!' యందునో
సుమధుర సాగరామృతమ! చొక్కపు చక్కెర! షడ్రస ప్రసా
దమ! యని యందునో? 'నవ ఘృతంబ! చవుల్ గల తేనె! యందునో?
'క్రమపరిపక్వ సత్ఫలమ! కమ్మనిక్షీరమ! యందునో? నినున్॥ 235

చ॥ అమరుల కాదివౌ నిను పయంబని యందునో? "సర్వవేద సా
రమ! శ్రుతి ధర్మ శాస్త్ర నిధి! శ్రావ్యమనోహరరాగ!" యందునో
"క్రమమున వీని మించు నొక రమ్యపదార్థమ! సాధనంబు క
న్న మిగులు తత్ఫలంబ! కరుణామయ! మాయుడ! కృష్ణ!" యందునో॥

ఉ॥ 'వేలుపు పెద్ద'! యందునో కో? వేల్పుల వేల్పగు భోగ్యుఁడందునో?
"వేలుపు చుట్టము"ందునో కో? "విక్షితిఁ బొందని చెల్వ" మందునో?
"యీలుగకుండు స్వర్గమ"ని యేర్పడ నందునో? "హైన్యమున్ బడన్
జాలని మోక్షమందునో? ప్రశస్త మహోజ్వల రత్న వర్ణునిన్॥ 237

ఉ॥ పాలన లోలతన్ భువనపంక్తి సృజించి త్రిలోక సన్నుతిన్
గ్రాలిన వాని తేనియలు కాఱు హరి ప్రియమాల వాని మా
యా లలితున్, లసన్మణి నిభాంగుని నాథునిఁ గృష్ణుఁ డందునో?
తాలిమి బ్రహ్మ! యంచు హిమధామ జటాధరుఁడంచు నందునో?॥

మ॥ జలధిన్ దచ్చి సుధారసంబు నిడు శ్రీస్వామిన్ సదానందు మా
యలవానిన్, యదు కృష్ణు, నచ్యుతుని సర్వాధీశుపై నోలగం
బొలయన్ బండిన వాని, భూమిఁగొని పై నుమ్మేయు మాలాధరున్
దెలియన్ జాల 'నచిత్తు'ఁ 'జిత్తు' నననేదే వాని మేనే కదా!॥ 239

మ॥ చిదచిదూప్రుఁడ యయ్యు జీవుల శ్రమల్ చీకాకులున్ లేక జ్ఞా
న దృఢాంగుండయి, యింద్రియంబుల కెఱుంగన్ రాడు "నెమ్మనిలో
నిదయా నాత్మకవస్థ యేదియును రానే రాదుగా" యంచు నె
మ్మది భావించిర యేని వాని, హరి, సంభావించి చేరన్ దగున్॥ 240

—♦ఫలశ్రుతి♦—

గీ॥ అళికులా రావ శీతల తులసిమాల
వాని జలదాంశు గూరిచి వనుల దనరు
'కురక' శఠకోప సూరి వాకొనిన వేయి
పాటలందివి పది పరపద మొసంగు॥

## —♦ఐదవ పది♦—

మ॥ తతసూనో పవన హ్రదస్థ మకరేంద్ర త్రస్త హస్తిన్ గృపా
దృతి రక్షించిన నీలమేఘ నిభునిన్ గృష్ణున్ మదీయేశు, సం
స్తుతిఁ గావించుచు లేచుచున్ బఱచుచున్ జోద్యంబుగానాడఁ గా
రతి లేకున్న జనంబదేల? జనులారా! వార్ధి వృక్షోర్వులై॥ 241

ఉ॥ చల్లని వెల్లిచుట్టు ధర, సాధుల బాధలఁ బెట్టి మ్రింగుచున్
గాళ్లకు నందెఁ గట్టికొను గాటపు రక్కసి మూకఁ గూల్చు శ్రీ
వల్లభు పాటలన్ గరముఁ బాడి చెలంగుచు నాడనట్టి వా
రెల్లఱుఁ బాపముల్పెఱుఁగ నీయిల జన్మలఁ బొందకుందు రే?॥ 242

మ॥ మలఁ బైకెత్తుచు ఆళ్వాన వలన న్మంద ల్వినాశంబు హా
త్తిలకుండం గృపఁ జేయు నప్పరుని బత్తిన్ నిచ్చలగ్గించి యా
ందల సేలంటగ వ్రాలి మొక్కికొను సద్భావంబు లేకున్న వా
రలలన్ గొట్టెడు నారకాబ్ధిఁ బడి పోరా? ఖిన్నులై వ్యర్థులై॥ 243

చ॥ పరిమళ పుష్పదామ కచబంధనుఁ బొందుట కేడు కోడెలన్
బోరిఁ గొను శ్రీధరున్, బగడపుం జిగి వాతెఱ వాని శాశ్వత
స్థిర యశమెంచి పాడి, నతిఁ జేసి; నటించి, శరీర విస్మృతిన్
దిరుగని వారి జన్మలు సుధీజన మధ్యమునందు వ్యర్థముల్॥ 244

ఉ॥ సాధువిరోధుఁ గంసవిభు జంపగ నందలి యాది దివ్యతే
జోధికమూర్తిఁ దాల్చి తనరారియు నిందలి జన్మనొందు వే

దాధిపు వీధులం బొగడి యాడని వారు మనుష్యులొకో? వి
ద్యాధనులైన జ్ఞానులనుఁ దార్కొని నోరు మెదల్ప నేర్తురే?॥ 245

చ॥ మనుజులు, జేజెలున్, బసులు, మాయభవంబులఁ బుట్టు నద్వితీ
యుని, భవహీను, విస్తృతపయోధి శయాను, శ్రితోపకారుఁ బం
డని, చెఱుకంచు, దేనియ నవామృత మంచని, కండపంచదా
రని, యనసూయులై కొలిచి నంత వివేకముఁ గాంతు రందఱున్॥ 246

చ॥ అదయుల నూఱ్వురన్ జెఱిచి యైదువురన్ గృపజేసి నేలపైఁ
బొదలిన సేనఁ గూల్చిన ప్రభున్ బరమద్యుతు నెంచి యాడి స
మ్మదమున నశ్రువుల్ కనులఁ బూనని పోతులు కండపుష్టి చే
నెదిగిన మేనుఁ బెట్టికొని యేమొనరింతురు సాధుకోటిలోన్?॥ 247

మ॥ ప్రవహత్సుందర నీర శీతల ఝరీరమ్యంబు శ్రీవేంకటా
ద్రి వినోదించెడు సామి నామముల భక్తిన్ బల్కి యున్మత్తులం
చ వివేకుల్ మఱి లౌక్యులున్నదర నీయా యూళ్ళఁ గాలూది తాం
డవమున్ జేసి ప్రతిష్ఠ నిల్పికొను దిట్టల్ దేవతా భావితుల్॥ 248

మ॥ మది హర్షించుచు యోగదార్ఢ్యమున బ్రహ్మత్వం బపేక్షించు వా
రొనఁగన్, దక్కఁ గలట్టి యెల్లఱును లోకోద్ధారకున్ శ్రీనివా
సు. దయావారిధిఁ నిత్యసూరి జనపోషున్, ధ్యానమున్ జేసి శ్రీ
ప్రదులై లేచి స్తుతించి యాడుటయె కర్తవ్యంబు ముముక్షుటికిన్॥ 249

చ॥ గతి యయి కర్మ, కర్మ ఫలకారకుఁడై సకలాదిహేతువౌ
ద్యుతి యుత నీలవర్ణు, దయ యొలికెడు నెత్తినికంటివాని, దే
వతల పతిన్, దదేకమతి భావముఁ జేర్చి తలంచి యాడు దు
ష్కృతియును, సిగ్గు, నజ్ఞతయుఁ దక్కి స్తుతింపఁ డపేత కాముఁడై॥ 250

## —♦ఫలశ్రుతి♦—

చ॥ స్థిరులగు దాసవర్గముల దిద్ది పనుల్గొనువానిఁ గీర్తి సం
భరితుని నచ్యుతుం దివిజభర్తను జేరుచు సస్యపూర్ణమౌ
'కురుక' వసించు నట్టి శఠకోపుడు జెప్పిన యొక్క వేయి పా
శురముల నీపదిం జదువ చూర్ణములై చెడు పాపపుంజముల్॥

## —♦ఆరవ పది♦—

మ॥ అతితేజోమయ శీలుఁ డొక్కఁడుఁ ద్రిమూర్త్యాత్మ స్వరూపుండు నీ
క్షితి, నా, మిన్నున నున్న మానవులు జేజేల్ పక్షి పశ్వాదు లా
తత భూతంబులుఁ బుట్టు హేతువయి, భూతవ్యాప్తుఁడై జ్ఞానియై
యితఁడే లోకము లేడు మ్రింగును సుమండీ! మంజు కంజాక్షుఁడే॥ 251

ఉ॥ మూవురి మూర్తియై మొదటి మూవురకున్ మొదలై తదీయ దుః
ఖావళి మాపె దేవవిభుఁ డబ్ధిశయానుఁడు రాముఁడౌచు లం
కా విభవంబుఁ గాల్చె తన కాండమునన్ శ్రిత పాప మోక్షు, రా
జీవ శుభాక్షు నెంచికొని సేవలొనర్చి నుతించు చుండుడీ॥ 252

మ॥ సుర సంస్తుత్య మహత్వ తత్వముఁ బరంజ్యోతి స్వరూపంబు భా
సుర రాసాఖ్య వినోదమున్ బడయు కృష్ణున్ గుంభ నృత్య ప్రియున్
హరి, దుగ్ధాబ్ధి ఫణీంద్ర తల్ప తల నిద్రాయత్తు, స్వామిన్ స దా
పరికీర్తింప మనస్సు రేఁబవలుఁ గూర్పం బూనుఁ డయ్యా! నరుల్॥ 253

చ॥ మనసున బెట్టుఁడీ! యనుచు మాయుని శీలము మేము చెప్పి నా
మను టది యట్టులుండ దివిజాధిపుఁడు న్విధియున్ జటాధరుం
డనఁ బొగడొందు రుద్రుఁడును నాతని పాద సరోజముల్ దినం
బును స్మరియించి సన్నుతులఁ బొల్పుగఁ జేసి చరింత్రు **మక్కువన్**॥254

మ॥ హరి నీలాంగుని, నంబుజాక్షుఁ గుటిల వ్యాప్తాలకోపేతు, భా
స్వర కోటీరునిఁ గృష్ణు; దేవవిభు, నంచద్రూపముల్ కావె? యీ

ధరయు, న్నీరును, నగ్నినాఁ బరగు ద్వంద్వంబైన తేజస్సు, నం
బరమున్ గాలియు, దేవ, మర్త్య పశురూప ప్రాప్త సర్వార్థముల్॥255

మ॥ భవ నాశంబులు లేని యీశుఁడవు కోపం బూనియున్ బ్రేమఁ జే
ర్పవె? ప్రహ్లాదుని నీదుపాదము కడన్; స్పర్శంబు శబ్దంబునున్
జవియున్, రూపము, గంధమున్ గలుగు మాస్వామీ! సురస్వామి! మా
ధవ! నిన్నేను దొఱంగి కొండొకని చెంతన్ జేర నేనాటికిన్॥ 256

చ॥ అనిశము నాదు నాత్మకు మహాసుఖ మిచ్చి తదాత్మ నిండియుం
డిన, లసమానమూర్తి, మణి నిర్మలతేజునిఁ గుంభనృత్య రం
జను సురమానిభోగ్యు, ఫల శర్కర లాగున హృద్యుఁ, జిత్త సు
ద్ధిని, గొని యాశ్రయింపుఁడు గతించును మీ వెత నిల్వదింతయున్॥257

మ॥ ఇడుముల్ గూర్చెడు పాప పుణ్యములఁ దానే తార్చి తత్కర్మ వ
శ్యుఁడుఁ గాకన్నిటి మీది జ్యోతి యయి లోకౌఘంబులన్ మ్రింగి పై
వెడలన్ జిమ్మిన వాఁడు కాలభటులన్ వేఁదోలి, దాసాళిఁ బ్రో
చెడువాఁడౌ రఘురాముఁ దప్ప నితరున్ జింతింప నేనాటికిన్॥ 258

చ॥ అనుగుం జుట్టలు, తల్లిఁ దండ్రులును తానై వేలుపుం బెద్దయై
ఘనుఁడై మూపుర కాదియౌ నతని లోక భ్రాంతులై మీరు వా
డనియున్ వీడని సంశయింపకుఁడు మీస్వాంతంబునన్ ధ్యాన మె
వ్వనిఁ గావింతురో వాఁడెయై వెలయు నవ్వారాశి నీలాభుఁడున్॥ 259

ఉ॥ జేజెల నల్లమానికము, శేషశయానుఁ, బయోధికాంతి వి
భ్రాజితుఁ, గృష్ణుఁ, దొల్లి శతరాజుల సేన లడంప నేవురౌ
రాజులఁ బెంప సూతుఁడయి రంగములోఁ దిగుదేవు, కింకిణీ
కూజిత పాదముల్ కనులకున్ గనుపించునె నాకు నెన్నడే?॥ 260

## ఫలశ్రుతి

చ॥ అరయఁగఁ జిత్తగమ్యుఁడు దురాపహుఁడక్షికి లోకరక్షణ
స్థిరుఁడుఁ గృపాళుఁడౌ హరికి తేఁటుల పాటలఁ దోటలొప్పు శ్రీ
కురుక పురంబు నేలు శఠకోపుఁడు జెప్పిన వేయి పాటలన్
బరగెడు నిప్పదిం బదివి భక్తులు గాఁజగు నభ్యసింపుఁడీ॥

## ఏడవ పది

మ॥ అతి తేజోమయమూర్తి పద్మనయనుం డత్యంత భోగ్యాఖ్యుఁడా
తత దుగ్ధాబ్ధిని మాకునై యతఁడు నిద్రాముద్రతో నుండు స
న్నతులై వానినిఁ గాంచు నెవ్వరయిన స్వాజన్మ జన్మాంతర
స్థితులన్ మమ్ము దరింపఁ జేయు పరమ శ్రేయః ప్రదాతల్ సుఁడీ॥261

మ॥ పరముఙ్, బాలకు, దాసవశ్యు, సులభున్ బ్రఖ్యాత చక్రాయుధున్
హరి నీలాభుఁ జతుర్భుజుఙ్ విమలు, నిత్యాంబెవ్వ రేకైక త
త్పరతన్, గాలునుఁ జేయిఁ జేర్చికొని సేవల్ సేయుచున్నారో యా
పరమోదారులె మాదు దాస్యముఁ గొనన్ బాత్రుల్ సదా, నాథులున్

మ॥ ఇలయు న్నింగియు సన్నుతింపఁ దగు వాఁడీసుంగు శౌరభ్య భా
క్తులసీ మాలికవాఁడు, నందమగు నిగ్గుల్ బొంగు చక్రంబు వాఁ
డలఘుండా హరి యాశ్రితోత్కరము నత్యంతంబు సేవించు వా
రలె పల్పుట్టువు లందు మాకుఁ బరమప్రాప్యుల్ సదాసేవ్యులున్॥263

ఉ॥ కౌనునఁ బచ్చ బట్ట మెడఁ గంటియయున్ మొలఁ బైడిసూలునున్
జాను కడాని జందెము, పసందు కిరీటముఁ, దక్కు సొమ్ములున్
బూని సదా యెసంగు సురపూజ్యు నరాయణు దాస దాస సం
తానము జన్మ జన్మముల దాసులమై భజియింతు మెప్పుడున్॥ 264

చ॥ స్థిరులగు నిత్యసూరుల కధీశుఁడు వేల్పుల కాయకష్టముల్
తలుగ సుధారసంబొసఁగు దాత తదీయ మహాత్వగాథ లా

దరమునఁ జెప్పు ధన్యులనుఁ దద్దయుఁ గూరిమిఁ జెప్పువారె మా
ద్వారలయి యిందు నందుననుఁ దోడ్పడి సాకెడు రక్షకుల్—దా!॥ 265

మ॥ పరమత్రాత, సచక్రుఁడున్. సులభుఁడున్ భాస్వన్మణిచ్ఛాయుఁడా
హారి, మాలాధరుఁడున్ బరుండు, సురుచివ్యాప్తుండు, మాస్వామినె
వ్వారు దండంబులఁ గొల్తురా గురులె మద్భావంబు తూలంగ సు
స్థిరమున్ జేయుచు, జన్మ జన్మలకున్ జేపట్టు రక్షారతుల్॥ 266

ఉ॥ స్వామి! త్వదీయ దాసులను జన్మ పరంపర నుండి తీసి నీ
వాముచు స్వస్వరూపముల నొందుచుఁ బుట్టగఁ జేసి త్వత్పద
స్థేములఁ జేతువయ్యా! నినుఁ దెల్పెడి వారి నుతించువారె సో
ప్రేమనుఁ బ్రోతురే దినము, విశ్వసనీయులు మాకుఁ బెద్దలున్॥ 267

మ॥ మనకున్ సమ్మినసామి, లోక జనకున్, మాభర్తఁ ద్రైలోక మం
దున నెవ్వారి కెఱుంగ రాని విభునిన్ నోరారఁ గీర్తించి తృ
ప్తినిఁ భక్తిన్ గనువారలే రయిన, కుంభీ పాకమందున్న నా
జన నాంతంబు మదాశ్రయాన్వయులు మత్సం సేవ్యులున్ బ్రాప్యులున్

మ॥ కులముల్ నాల్గిఁటి కంటె హీను లవివేకుల్ చండ చండాల జా
తులవారైన సుదర్శనాంచిత భుజున్ ద్యోతేంద్ర నీలాంగు దా
సుల మంచున్ మది సమ్మికేని యలదాసుల్, వారి సేవించు దా
సులునున్ వారల దాసులు న్మనకు పూజ్యుల్ స్వాములున్ నిచ్చలున్

ఉ॥ భాసిత పాదముల్ గొలిచి వర్తిలు భూసతి నారగించి స్వ
గ్రాసముఁ జేసి యాకుపయి వ్రాలిన నిస్తులబాలు మత్పరున్
దాసతఁ గొల్చు వారలకె దాసులు గాదఁగు వారి దాసులా
దాసుల దాస దాసతతి, దాసుల దాసుల మేము నిచ్చలున్॥ 270

—♦ఫలశ్రుతి♦—

చ॥ తిరపడి శకుం మాఘ్విగ వధించుచు నేవృగ రతు సేయు శ్రీ
వరుకృతి కాగ శ్రీకురుకె వాసి రెంఁయు విష్ణు దాస్య సం

భరిత వచః ప్రచారమున బల్కు- సహస్రమునందు నిప్పుడిన్
నరయుచు నభ్యసించు జనులందఱు నందరు జన్మ చింద ఱన్॥

## —ఎనిమిదవ పది—

చ॥ కలిత కిరీట! దేవ! త్రిజగన్నుత దివ్యపదాంబుజా! పయో
జలనిధి మంథనా! జలద సన్నిభవర్ణ! ఖగేంద్ర వాహా! ఉ
జ్వల గరుడధ్వజా! కమల జన్ముఁడు మున్నయి యున్న యండమం
దలి సురలందు మిన్న! యని ధ్యానముఁ జేయుచు నామనస్సు నిన్ ॥271

ఉ॥ నానుడి నిచ్చ లిచ్చపడి "నామనసే నగరంబుఁ జేసి యం
దే, నెలవున్న యట్టి విపదేకసఖా!" యని "లంకరాయనిన్
బోనడగించు పెన్విసమ! భూమిని, వామన వేషభాషలన్
బూనివశంబుఁ జేసికొని పొల్చిన వంచక! యంచు నాకొనున్॥ 272

చ॥ నుడువు నిను న్నుతించుటకు నోచఁగఁ జేసిన దేవ దేవ! లే
బుడి బుడి వెల్గు వెల్లువలఁ బొందిన చందురు కుట్టు చెల్వనై
యడరి వెదుళ్ల కొంపలకు నర్గుచు పాలును వెన్న దొంగవై
కుడిచిన నీకునై తడుము గోకుల వత్సల! నాదు చేతులున్॥ 273

చ॥ పరుఁడ! విశాల భోగయుత పన్నగవాస! త్వదీయ రూపమున్
గరములతోడఁ బూర్ణముగఁ గౌగిలిఁ చేసియుఁ జేసి నిచ్చ నే
మఱక నిమేషము న్విడక మాయెదుటన్ గనుపట్టు నిన్ను త
త్పరతనుఁ జూచి చూచికొన తద్దయు నాకనుదోయి యాసిలున్॥ 274

చ॥ కనులకుఁ గానిపించుటకుఁగా దయసేయుదు వేమొ? సామి! నీ
వని యడియాస; భూమి వలయంబునుఁ గొల్చిన వామనుండవౌ
నిను వహియించు సంతసము నెక్కొన పాడుచు నేగు వైనతే
యుని గరుడార్భటిన్ దలఁచి యూకొన నిక్కి- యెలర్చు నాచెవుల్ ॥275

చ॥ జగతికి నీదు కీర్తినిఁ జాటు కవిత్వఫలంబు నేరుపా
రగ ననుకూల రాగ మకరందమునన్ మిళితంబుఁ జేసి వీ
నుఁగవకుఁ బూర్ణభోగముల నున్ గలిగించి యిహంబునందె ని
న్నొగిఁ గన చక్రి! భోగ్యగుణ! యువ్విళు లూరును నాదు ప్రాణముల్॥

ఉ॥ నాదగు ప్రాణమై భరిత నవ్యసుధారస మైనవాఁడ! నీ
పాద సరోజ దాసుఁడను భవ్య గరుద్గరుడాధిరోహ! చ
క్రాది సముజ్జ్వలాయుధ! అఘూర్ధిత మైన మదీయబుద్ధి పెం
పేది చిరంబు నిన్ బిలిచి యేనియు కానదు నీశుభాకృతిన్॥ 277

చ॥ సదమల పద్మనేత్ర! కడుఁ జక్కనివాఁడ! నవాంజ నాకృతీ
కదలక యుండి ప్రాణమునుఁ గాఱియ పెట్టదు బెట్టుఁ జేయుచున్
బొదలెడి కాలమున్ వెనుక పోయిన కాలము వచ్చుకాలమున్
మది నినుఁ బెట్టి కొల్చుటను మాన నొకా నొకనాఁడు మాధవా॥ 278

చ॥ "అడిగిన మూఁడె యస్థల మహాబలి! యీయవె? కొందు" నన్న మా
యుఁడ! ఖల కంస వంచకుడ! యుద్ధతు బాణు మనోబలంబుఁ జ
క్కడఁచి సహస్ర బాహువుల నక్కడె యుక్కడఁగించు పక్షియా
నుఁడ! ఇక నేను నెన్నఁడు నినున్ గనుఁగొందునో? యాశ్రితావనా॥ 279

ఉ॥ చేరిన మద్దిచెట్లనడిఁ జెచ్చెఱఁ జొచ్చిన సామి! భూరి దో
స్సార! మహాప్రభావ! యనిశంబును నీపదసేవఁ గోరి చ
ల్లారని యాస నుంచుచును నాగడిఁ బొందితి నెంతకాల, మీ
తీగున శబ్ద నూలల నుతించి నినున్ బిలువంగ నోపుదున్॥ 280

—— ఫలశ్రుతి ——

ఉ॥ శ్రుతిహిత పుణ్యశీలుని వసుంధరఁ గొల్చినవాని పేరిటన్
గృతిఁగ శఠారి యోగి పరికీర్తిత శీలుఁడు చెప్ప నర్థగుం
ఫిత రచనా సహస్రమున బెంపగు నీపదియుం బఠించి యు
న్నత పరమాస్పదంబును గనంగలవారు మహానుభావులై॥

## —♦తొమ్మిదవ పది♦—

మ॥ ఇది చెప్పంగ విరుద్ధమా నయినఁ గానిండేనునున్ బూని చె
ప్పెద నాలింపుఁడు భృంగఝూంకృతులతోఁ బెల్లొప్పు శ్రీవేంకటా
ద్రి దొనన్ నాయుపకారి, నాదొరయు, నాదేవుండు వాడుండ, ని
చ్చెదనే? మామక జిహ్వాకాగ్ర కవితాశ్రీ నేను వేఱొండ్లకున్॥ 281

మ॥ కొలనుల్ మాన్యము లంతటన్ వెలఁయ గన్గో నందమై వంద్యమై
తలకట్టైన ♦"తిరుకు్రఱుంగుడి" యథార్థజ్యోతిఁ గొల్వున్న నా
కుల నాథున్ బతి, మాని తామె తమ బాగుల్ జూచి మిక్కుటకు్ర మ
ర్త్యులపై వ్యర్థులపైఁ గవిత్వములఁ గూర్పుల్ సేయ నేమయ్యెడున్?॥

మ॥ ఒక తెంపొప్పక కల్ప కల్పముల తమ్మొప్పారఁగా నిల్పు కీ
లక మందించెడు దేవతాప్రభువు మ్రోలన్ గాక విద్వాంసు లొం
డొక చోటన్ జని యొక్క ప్రాకృత మనుష్యున్ గొప్ప కబ్బంపు పొం
దికఁ గొండాడి స్వరూపహీనులయి దేనిన్ బ్రోవుఁ గావింతురో?॥ 283

చ॥ మతిధనులార! యస్థిరుల మానవుల న్నుతిఁ జేసి కాంచు కాం
క్షిత ధనమెంత? దాననగు సిద్ధి యదెంత? యదెన్ని నాళ్లు సం
గతమగు? రత్నమాళి, సురకాంతు నుతింపఁ దనంత వారిఁ జే
సి, తనిపి, జన్మపాశములఁ జించి, స్వకీయులగొట్టిఁ జేకొనున్॥ 284

చ॥ సిరిఁ గల పెంటకుప్పలనుఁ జేతనులం గొనియాడ యోగ్యమై
పొరసెడు లబ్ధిలేదు కవి పుంగవులార! త్వదీయ సత్యమున్
దొఱఁగుదు రంతె అర్హుఁడును దోష విహీనుఁడు, కామదాత, కా
మ రహితుఁ డట్టి కృష్ణుపయి మావిభుపైఁ గవనంబుఁ జెప్పుఁడీ!॥ 285

చ॥ ఘన కవులార రండి! నిజకాయము వంచి భుజప్రయాస జీ
వనము నొనర్పఁ డీయిల ప్రవాహముభంగి ననిత్య మిందులో

♦గ్రామనామము

ధనికులు నేడు లేమియును తథ్యము కైతల చేత నిష్టదే
వుని స్తుతియింపుఁ డానుడియుఁ బొందును నావిలసత్కిరీటునిన్॥ 286

మ॥ తగు నీవిన్ గడుకొన్న కీర్తి విరివొందన్ వేయి పేర్లొందు నా
దగు దైవంబును తప్ప వేఱొకని, విద్యాహీను, భూజన్ము, న
ల్ప గుణాంధున్, దృణితున్, గరాబ్బుఁడనుచున్, బ్రిస్ఫార దోఃపర్వతుం
డగు వాఁడంచునుఁ బచ్చి కల్లలను నేనాడంగలే నెయ్యెడన్॥ 287

చ॥ వెదురులకన్న జెన్నయిన బెళుకుబుజాల్ గల రాధనాథు పే
రొదవు ననేక దివ్య సుగుణోన్నతిఁ బాడి దినాలఁ బుచ్చి మేన్
వదలి తదీయపాద నలినంబుల క్రింద వసింపఁ గోరు నే
నెదియననేర్తు? నానుడుల నీమనుజాళిని, భంగు రాంగులన్॥ 288

చ॥ జనులకు వాకులన్ గృతులు సల్పి యొసంగు కవీశ్వరుండ గా
ను, నుతగుణుం డుదారుఁడు, ఘనుండగు చక్రికె నాదు కైత కాం
తినిఁ గల యైహికార్థమిడి దివ్యపదంబును నీవ చూచి కొ
మ్మని పరికించి పొంచి పరమాత్ముఁడు మోక్షముఁ గూర్చు నాకునున్॥

మ॥ పలునాళ్లుండియు నుండి గంకువగు నీభారంపు దేహంబు చం
చలమై వచ్చుచుఁ జచ్చు చుంటఁ గని యైనన్ జన్మ బంధంబుఁ బో
దలఁచున్ వీఁడ"ని•నైచు స్రష్టకుఁ గవిత్వంబిచ్చు నాకీపయిన్
గలదే? యెన్నటి కొండు మానవునిపై కబ్బంబులన్ జెప్పఁగన్॥ 290

—♦ఫలశ్రుతి♦—

చ॥ ఒగిఁ బెనుకీర్తిఁ గన్న త్రిదశోద్వహు భక్తికృపాఖ్య పేరిటన్
న్నొగిఁ బెనుకీర్తిఁ గన్న 'కురుకూరు' శఠారి రచించు సూక్తియై
యొగిఁ బెనుకీర్తిఁ గన్న ద్రవిడోక్తి విశేష సహస్రి మాలలో
నొగిఁ బెనుకీర్తిఁ గన్న హరియున్నివినేర్చిఁ జన్మహృద్యగున్॥

## —•పదియవ పది•—

మ॥ పలు జన్మంబుల వెల్లడిల్లి యసుర వ్రాతంబు నుగ్గాడఁ గా
కలనన్ బోరెను, శంఖ చక్ర ధనువుల్ కౌమోదకీ నందకా
దులతో, గారుడయానుఁ డైపుడమి తద్దోర్వీర్య శౌర్యాదులన్
దెలుపన్ నోచిన పూర్ణభాగ్యుఁడను నెందే నాకు లోటున్న దే?॥ 291

మ॥ నతవార్ధిన్ ఫణిశయ్యు, శోణకజ సూనప్రాయ నేత్రంబు లం
చిత నిద్రాగతి యోగ మీలితములై చెల్వొందగాఁ బండువా
డతి సౌలభ్య పరుండు కృష్ణుఁడు పతంగాధీశ వాహుండు ని
ర్జిత దైత్యుం డొక యస్ఖలేకతని కీర్తిం బాడి నేనాడితిన్॥ 292

చ॥ అవిరళ దివ్యభోగు, జగదర్హ పతిన్ ఫల, శర్కరామృతా
సవ, మకరందభోగ్యు, విలస త్తులసీ దళ దామమాలి మా
ధవుని నమస్కరించికొని తద్విషయంబుల కూటలూరు నా
కపుర! యొకింత వంతయు హృదంతర మందున నుండ గల్గునే?॥ 293

మ॥ అలఁతిన్ బాణునిఁ బ్రోవగాఁ దలచి శస్త్రాస్త్రాఢ్యులై వచ్చి పెన్
గలనన్ డీకొను నప్పురారి, ననలున్, స్కందున్ జయించెన్ గరు
ద్బల వత్తార్క్ష్యతురంగుఁ డట్టి యరిజేతన్, గోపకున్; జక్రి దా
సులఁ బోఁడని ప్రోడఁ బొంది యిఁక నేక్షోభింతునే? సుంతయున్॥

సీ॥ పార్థుని, వైదికుఁ బాలుని నొక్కని మంచి గట్టిరథ మెక్కించి దాని
కడువడి స్వయముఁగానడిపించి; యుజ్వల తేజోమయంబయి తేరకొనుచు
క్రాలెడు స్వీయ పరంజ్యోతి వాగ్వాచ్య పరమపదంబు లోపలకుఁజొచ్చి
యందున్న యావైదికాగ్రణి కొడుకుల తొంటి నెమ్మేనుల తోడఁదెచ్చి

గీ॥ యిచ్చి యొక్క ముహూర్తమందెల్ల భువన । మండలము నిండు కీర్తి శ్రీ
మంబుఁ బడసె
పొందు శ్రీకృష్ణు సేవలఁ బొందు నేను । సేవితపు వెతలను సుంతయేని
బొంద

మ॥ విమల భ్రాజిత దివ్య విగ్రహమునే స్వీకారమున్ జేసి దుః
ఖములన్ జిక్కిన మానవప్రకృతితోఁ గన్పట్టుచున్ బుట్టి దుః
ఖముఁ జేకూర్చి, నిజేశ్వరత్వ మిలపైఁ గ్రాలించు కృష్ణున్ బతిన్
విమలున్, మాయు, భజించు నాయెడల నేవే దుఃఖముల్ కల్గునే?॥296

మ॥ సుఖ దుఃఖప్రద కర్మలన్, దివిని, దుష్టుల్ పొందు క్రిందా గతిన్
నిఖిలాజాండము, నిత్యజీవులనుఁ దానే పూని కల్పించు వా
డఖిల ప్రాకృత విభ్రమానుభవ లీలానందుఁడై యుండు శ్రీ
సఖు, లోకేశ్వరు నాశ్రయించు నను చిచ్చుల్ జేరలే వేవియున్॥ 297

సీ॥ నిరవధి, నిత్యంబు, నిర్దుఃఖమును నైన యానంద మొంది సర్వాంతరముల
వ్యాపించు నవయవ పరమ శోభయునంది దివ్యవిగ్రహ శుభదీప్తిఁ జెంది
పద్మాలయా గాఢ పరిరంభ భోగియా నానాథుఁడనవధి జ్ఞానమయుఁడు
తన జ్ఞానమునఁ జేసి తతే జగద్వ్యాపార మెల్లగావించువాఁ డెల్లలేని॥

గీ॥ మాయఁ గలవాఁడు సమ్మహోమహునిఁ గృష్ణు । భక్తవరదుని శ్రీపాద పద్మ యుగము
నాశ్రయించిన వాఁడ నాకరయ నొక్క । దుఃఖమనఁ గల్గదెపుడు సాధు జనులార॥ 298

మ॥ అలఘుజ్ఞాను, విభామయాత్ము వనమాలాలంకృతున్ బెక్కు మా
యల, లీలాకృతు లూని వింతలనుఁ జేయన్ జాలు దిట్టన్ శివా
జులు మున్నైన సమస్త సృష్టిఁ దనలోఁ జొక్కంబుగా నిల్ప లో
పలకు న్మ్రింగిన వానిఁ బొందితిని లోపంబున్నె నాకేదియున్?॥ 299

మ॥ ఎందే నెప్పుడు వ్యాప్తుఁడై యొకఁడె తానే హేతువై జ్ఞానియై
మందజ్ఞేంద్రియ పంచకంబున గ్రహింపన్ రాక సూక్ష్మాంగుఁడై
య్యుం దివ్యాంగుఁడు, భూతరూపుఁడిన చంద్రోద్భాసి, మాయాకృతా
సందుండా హరి పాదముల్ దొరకొనెన్ నాశంబు నాకున్నదే?॥ 300

## —♦ఫలశ్రుతి♦—

మ॥ ప్రతి కల్పంబును నామరూపములుఁ జర్యల్ మాఱ్చు భూనేత న
చ్యుతు నంభోనిధివర్ణు గూర్చి శఠజిద్యోగీంద్రుఁ డర్పించు నం
చిత కావ్యంబున నొప్పు నీపదియునున్ "శ్రీపేర"పైఁ జెప్పె నీ
స్తుతి వల్లించినవారు చక్రధరు దాసుల్ గాంత్రు సమ్మోదమున్॥





# శఠకోపగీతామృతము.

## నాల్గవశతకము

౧

—♦మొదటి పది♦—

మ॥ పలు నాల్గీయిల నేక నాయకులుగా బాలించు రారాజులున్
నలుపుం గుక్కలు పిక్కలన్ గఱువ, కుండల్ ముక్కలై పోవ లో
కులు వీక్షింపగ భిక్షమెత్తుదురు జాగున్ మాని శ్రీజాని యు
జ్జ్వలు, నారాయణు పాదముల్ దలఁచి సేవల్ జేసి జీవింపుఁడీ॥ 301

శా॥ పన్నుల్ గట్టి మనుండటంచు జగమున్ బాలించు రారాజు లిం
దున్నప్డే తమ ప్రేయసీమణుల సిగ్గూహింపకే శాత్రవుల్
కొన్నన్ బోవిడి యెండమావుల వనిన్ గుందొందుచుండ్రెండి కా
న న్నారాయణు రత్నమాళి పద మొందన్ జూడుఁడీ సత్వరన్॥ 302

మ॥ చరణన్యస్త కిరీటులై పరనృపుల్ సాగిల్లి మ్రొక్కంగ పి
డ్గురవంబట్లు మృదంగ వాద్యము వెలిన్ ఘోషింప కొల్వుండు భూ
వరులున్ మాసి పరాగ భూతులగుటన్ భావించి సద్గంధ సుం
దర దామావృతమాళి కృష్ణు పదముల్ ధ్యానింపుఁడీ చెచ్చెఱన్॥ 303

మ॥ పలుకల్పంబుల నేల నేలి చను భూపాలాళి లెక్కింప మి
క్కిలిగా నుందురు సైకతాణువుల పైకిన్ మున్ను వారున్న యి
క్కలునున్ బ్రిక్కలు గుర్తులేకఁ జెడగాఁ గన్నాము తాళ్లోన్న తో
రుల యెన్నగన్ బొరిఁగొన్న కృష్ణు మృదులాంఘ్రుల్ జేరి జీవింపుఁడీ॥

మ॥ పొలుపొ, చల్లని పూలపాన్పు పయిఁ దమ్మిన్ గూడఁగాఁ బిల్చు, సొ
మ్ముల నొప్పొ నెఱి కొప్పుటాండ్ర సురతా భోగామృతంబొందు రా
జులె, యాయన్నువ లొల్లకున్న, మొలగోచుల్ జారి వ్రేలాడ నుం
డ్రదలఁతిన్ రత్ననిభాంగు మావిభు సమాఖ్యల్ పల్కఁ రంజిల్లుఁడీ॥ 305

మ॥ సుఖు లాసారవిసృష్ట బుద్బుద గతిన్ జూపట్టియున్ బ్రుంగుటన్
సుఖమున్ బుట్టినదాది యింతదనుకన్ జొప్పిల్లియే యుండు? త
త్సుఖు లన్నట్లొక మాటలేదు సుఖమున్ జూఱాడ నిచ్చైన మా
సఖు, గంభీర పయోధితల్పు, హరి, దాస్యంబూని జీవింపుఁడీ॥ 306

ఉ॥ కమ్మని షడ్రసాన్నములఁ గైకొని మించియు మించుబోండ్ల గా
రమ్మగు మాటలన్ మగుడ గ్రాసముఁ జేయు నృపాళి ముష్టి య
న్నమ్ములకై పెనంగుట కనందగుఁ గావున నాదిదేవు నం
దమ్మగు శోభయున్ సుగుణ తండమును న్నుతియించి కొల్వుఁడీ॥ 307

మ॥ ఘనకీర్తుల్ గుణవర్తులున్ వితరణ ఖ్యాతుల్ ప్రజానంద వ
ర్ధనులౌ రాజులుసైత మాహరిని గర్వంబూని కైకోక నా
శనమున్ బొందెదరెంతయున్న ఫణిరాట్ఛాయిన్ రమానాధు భ
క్తిని సేవింపుఁడు మీఁదు భోగములకున్ గీడ్పాటు రాదెన్నఁడున్॥ 308

చ॥ పడసిన నేల, సొమ్ములు సవాసనగావిడి యింద్రియాల త్రి
ప్పుడు నడఁగించి మేనిపయి మొక్కలు మొల్వఁ దపించి నింగి ని
ల్లుఁడ గొనువారు, నా, హరిఁ దలంపరయేని నశింత్రు కాన, గా
రుడ దృఢ కేతనున్ సుఖనిరూఢి సతంబును నిల్వఁ గొల్వుఁడీ॥ 309

చ॥ మఱలిచి యాత్మతోఁ గలియ మాటి సమస్తము వీడి పొందు నా
మెఱుకయ ముక్తి యన్న బుధుఁడేనియు భక్తి విహీనుఁ డైనచో
చిఱు సుగమిచ్చు బంధములఁ జెందు హరి స్తుతిమాని మేన్విడన్
నెఱుకయురాదు కాన హరియే పరమార్థము మోక్షకామికిన్॥ 310

## —♦ఫలశ్రుతి♦—

మ॥ అదియే! శ్రేష్ఠముపాయమంచు హరి పాదాబ్జాతమున్ నమ్మి యీ
పదియుం జెప్పు శఠారి యోగి కురుకూర్వాసుండు తద్దాస్య స
మ్ముదితుండై రచియించు దైవవిషయం బున్నించు వేయింట ని
ప్పదియు న్నేర్చికొనుండు దుఃఖములు బోవన్ గాంచు డాధారమున్॥

## —♦రెండవ పది♦—

ఉ॥ బాల; లతాంగి నాదుహిత పాపమదేమియొ? యేడు లోకముల్
తేలిక నారగించి వట దివ్యదళంబున బాల మాత్రుడై
వ్రాలుచు జీర్ణమున్ గొలుపఁ బ్రక్కలకున్ బొరలాడు సామి పా
దాలను చల్లనౌ తులసి దామమె కావలెనంచు వేగెడున్॥ 311

చ॥ గిఱికొని నాదు పాపముడి కించునొ? నాదు కుమారి తీవతో
సరియగు చిన్నికౌనుఁ గల శ్యామ, మనోహర గోపికాళితో
నరమర లేక రాసమను నాటఁ బెనంగినవాని యఙ్ఘ్రి తా
మరల సగంధమౌ తులసి మాలయె కావలెనంచు బల్కెడిన్॥ 312

చ॥ బలితపు పాపమేదొ ననుఁ బట్టి యెసంగెడి నాదుపట్టి, మా
లలఁ బాలు పొందునట్టిది విలక్షణ సూత్రములొంది ఛందముల్
వెలయగనున్న వేదములు, వేల్పులు దొడ్డఋషుల్ నుతించు ని
ర్మలుని పదాలపై తులసి మాలల యొప్పౌనె చెప్ప నెప్పుడున్॥ 313

చ॥ అమలముఁబున్ సుమంగళములైన గుణంబుల నెంచి వాని యు
త్తమత, గణించి యెవ్వని విధంబు బుధుల్ వినుతింతురా మహా
ప్రముఖు, శ్రితోపకారు పద పద్మముపై తులసీ మనోజ్ఞ దా
మమె కొనఁగోరు నీసుభుజ మత్సుత మత్కృత పాపమెట్టిదో?॥ 314

ఉ॥ నాసుత దీర్ఘదోర్లలిత నాగ్నజితిన్ వరియించి ఢంకముల్
డాసి కవుంగిలించు ప్రకట ప్రబలుండునుఁ గుంభనస్త్రనా

భ్యాసుఁడు గోపకుండయిన వాని పదంబులపై హరిప్రియా
భాసురనూల కాసఁబడి వందురుచున్నది నాడు నాటికిన్॥ 315

ఉ॥ అందపు పంట నెచ్చెలికినై మహనీయ వరాహ రూపమున్
బొందుచు తొల్లి పెల్లయిన భూమిని వెల్లిని వీడదీయు శ్రీ
సుందరు నంఘ్రులం దులసి సోయగమున్ గను భ్రాంతిఁ జేసి, యా
సం దగులొంది దానికయి సంతతమేడ్చును నాకుమార్తెయున్॥ 316

మ॥ కొమరాలిన్ గమలాలయన్ సిరిని వక్షోమాలికాసీమ యం
దమరన్ నిల్పిన వాని పాదములపై నందంబు శైత్యంబు ర
మ్యముఁగాఁ గ్రుచ్చి యమర్చినట్టి తులసీమాలన్ గడుంగోరి యో
కమనీయాననలార! ప్రిబ్బలివలెన్ గన్పట్టు నాపట్టియున్॥ 317

మ॥ తనకుం బ్రిబ్బలిచెట్టు నట్టి దగు సీతాదేవికై పూని లం
కను బాణాగ్నినిఁ గాల్చువాని పదకంజాతమ్ములన్ బొల్చు వా
సనలన్ జల్లెడు చల్లనైన తులసిన్ జాలంగ నాసించె నం
గనలారా! తనుజాత యీపె నెటులింకన్నేను నోదార్చెదన్?॥ 318

చ॥ మెలతుకలార! కూతులను మీరునుఁ బెంచిరకాదె? నాదు గా
దిలి సుత యెంతయున్ జపల దీనినిఁ కేమననేర్తు? సంకు నే
పలుకు సుదర్శనంబెయను వాని హరిప్రియ మెచ్చు నేమి కా
వలె నని యన్న రేఁబవలు వానిన పేర్కొను నేమిఁ జేయుదున్?॥ 319

ఉ॥ అంగనలార! చాలమృదువైనది బాలిక యేమిఁ జెప్పినన్
లొంగదు నాకు రొమ్మున వెలుంగులనీను సరాలెసంగు ర
మ్యాంగునిఁ గృష్ణు పాదగతమౌ తులసీదళమాల చాలమేల్
బంగరు సొమ్ములున్న తన వక్షముపైఁ గొనఁ గోరి పొక్కెడున్॥ 320

—♦ఫలశ్రుతి♦—

కలఁచెడు బాధఁ దీర్చు హరి కామ్యపదంబులపేర,ఁ బేరు వ
ర్ధిలు కురుకన్వసించు నల శ్రీశఠవైరి వచించు స్తోత్రి వా

కుటలుఁ గల వేయి పాటలనుఁ గూడిన యిప్పది నభ్యసించు వా
రలు స్థిర నిత్యసూరుల వరంబగుకోవఁ జరింపఁ జేకుఱున్॥

## —మూడవ పది—

మ॥ అల బింబాధరమైన నాగ్నజితి కై యాఁబోతులన్ గూల్చి స
త్కుల దంతావళ దంతముల్ విరిచె ధూర్తున్ రావణున్ మాపె మా
సులభున్ నీరసుమార్చ లిచ్చుచు నమస్సున్ జేయలేదైన, పే
శల పుష్పాంగుఁడు నామనస్సెకొను నిచ్చన్ గంధలేపమ్ముగన్॥ 321

మ॥ క్షితి నెల్లన్ గబళించి యుమ్మి హరికిన్ జన్మార్తి కేకాకి యా
పతికిన్ గందపుఁ బూత నామనసు మద్వాగ్జాలలే మాల లం
చిత పీతాంబరమయ్యె గ్రంథమిది నాచేమోడ్పు మాళ్యాద్య లం
కృతియై యున్నది మత్పరుండయిన యా యీశుండు ప్రేమించెనో?॥

మ॥ ఒకఁడై రెండును మూడు తానెయయి వేయున్ మూర్తులున్ దానెయై
ప్రకటంబయ్యెడు పంచభూతములలోఁ బైరెండు తేజంబులన్
సకలాంతర్గతుఁడై ఫణీంద్రుని పయిన్ సంద్రమ్ములోఁ బండు నా
యకు నిష్టార్థము నా మెయిన్ గలిఁగె నాయందున్న వంతల్విడెన్॥323

మ॥ నిను మాయింపగ నెంచి చన్ గుడుపు దానిన్ బూతనన్ జంపు పా
వన! మాయామయ! వామనా! సిరిదొరా! బాగైన పూదండలన్
మును నీకిచ్చి నమస్కరింపనయినన్ బూమాలలం గ్రాలు మా
ళిని మాలాగతి నాదుప్రాణమును చెల్మిం జుట్టికొమ్మిచ్చితిన్॥ 324

ఉ॥ ఘనుఁడా కృష్ణుఁడు కాలసంజనక చక్రగ్రాహుఁడున్ మత్పరుం
డును నాసామి, మదాత్మమాలఁ గొని నేనున్ జేయు సంప్రీతియే
కనకోద్భాసితమాళి మున్నగు నలంకారంబుగా గారవా
తన, లోకాయతకీర్తి రూపమును జెందన్ సైచుచున్ గైకొనెన్॥ 325

చ॥ కరమునఁ గాలచక్రమునుఁ గ్రాలెడు కంబువుఁ బూనువాఁడ! ఉ
ర్వర దిగమ్రింగి యుమ్మిన నరాయణ! యంచునుఁ బిల్వ నొక్క వై
ఖరిఁ జనుదేవుకాని యనఘా! భవదీయ ఝుళంఝుళార వా
భరణ పదారవిందములు భాసిలు నౌదలనాకు భూషలై॥ 326

మ॥ వినదద్ విస్తృత పాదయుగ్మమునఁ బృథ్వీన్ గొల్చు దివ్యాంగ! వా
మన! నీసారవపాద సంశ్రితులఁ బ్రేమం జేరగాఁదీయు మా
యనుఁ జింతించెద పూవులుం జలము నీకర్పించి కీర్తింప కు
న్నను నాయాత్మను శబ్దగోచర భవ న్నవ్యాకృతిన్ గాంచెదన్॥ 327

శా॥ నాయాత్మన్ వసియించు సామి! భువనాంతర్వ్యాప్త సర్వాత్మ! శో
భా యుక్తుండవు జ్ఞానరూపుఁడవు నాప్రాణంబు నీవశ్యమై
నాయాధీన్యము నీదుప్రాణమయి యున్నామంచు నిన్ గూర్చి నే
నోయీ! ఎన్నటికేనిఁ జెప్పఁ గలనో? యుప్పొంగుచున్ మాధవా॥ 328

ఉ॥ ఏతఱి నీయశోంబునిధి నీఁదుచుఁ బారము ముట్టనేర్తు? నీ
ఖ్యాతి నెఱుంగకున్న బ్రిను, నాసిలియుంటి పరాత్పరా! పరం
జ్యోతి! విలక్షణుల్ సురలు నోడక నోరున నీమహాత్వ మే
భాతి నుతించుచుండ్రటులఁ బ్రిస్తుతిఁ జేసెద నేనుఁ బ్రీతితోన్॥ 329

ఉ॥ నేనును సప్తలోకములు నీవును నిన్ నుతియింప నెంతకుం
గానిది స్తోత్రపూర్తి, సుధ, కమ్మని పాలుచు,ఁ గండచక్కెరల్
తేనియలట్లు భోగ్యుఁడవు తియ్యని నెయ్యుఁడ వుండలేక యే
మేని స్తుతించి జీవనము నేను నొనర్తును కాని నేర్తునే?॥ 330

—♦ఫలశ్రుతి♦—

మ॥ బ్రితుకుం దెత్వొక లేదు కృష్ణుని పదాశ్హాతంబ కాకంచు ని
శ్చితుడై తచ్ఛుభ పాదదత్తముగ రాజీవాకరోద్యాన శో
భితమా తత్కురుకన్వసించు శరజిద్వేదాంతి వాకొన్న సూ
నృత గీతంబుల నిప్పుడిం జదివి నుంటిన్ మింటి నేలందగున్॥

ఉ॥ ఇమ్మహిఁదాకి 'వామనుని దియ్యదియంచ'ను మిన్నుమ్రొక్కి హ
స్తమ్మునఁ జూపు తత్పరమ ధామమటంచని కన్నుదోయిఁ దో
యమ్ములకంగ తోయధికళాంగుఁ డటంచును బల్కుచుండు నో
యమ్మ! కలంచెనా కొమిరె నాతని నేమి యొనర్తుఁ జెప్పఁడీ॥ 331

చ॥ కడియపు కేల మ్రొక్కి యుపకారకు పాన్పుని వార్ధిఁ గాంచు నో
కల్కఁడగు విభాను జూపి హరిఁ గాంచితినంచు భ్రమించు నశ్రువుల్
వెడల నరాయణా! యనును వేలుపు కన్నియ పోలు బాల యీ
బిడ, హరిణాక్షి, సేయుపని వింత, యొకింత యెఱుంగ చెల్లరే!॥ 332

చ॥ తెలిసిన యెఱ్ఱమంటఁ దనదేవుఁడటంచుఁ గవుంగిలించి మై
మలయదు మంచుగాలిఁ బడి మాధవుఁడంచు భుజాలుసాచు శ్రీ
తులసి సుగంధ మీపెమెయిఁ దోచును ముంజెయి జారె కంకణా
లెల చిటి యిఱ్ఱిచూపుఁ గల యీసుతచేత లెఱుంగఁ బాపినై॥ 333

మ॥ కని పూర్ణేందుని నీలవర్ణ! యనిపై గన్పట్టు పెన్గట్టు నా
ఘనమిత్రా! యనిపిల్చు వానమొగులుం గన్గొన్న నారాయణుం
డని నృత్యం బొనరించు, నింకఁ నెవియో యాశ్చర్య కార్యంబులన్
బొనరించున్ సుకుమారి నాకొమిరె యీపోకిళ్ల కేహేతువో॥ 334

ఉ॥ సుందర కోమలాంగమున శోభిలు దూడనుఁ గౌగిలించి 'గో
విందుఁడు మేపె దీని' నను వేఁజను పాయపుగాలిఁ దిండి వె
న్నుంది తదీయ తల్పమును నక్కట! పాపిని నేను మాయుఁ డీ
ఝుందపు తీవఁ బోడి వలపంతలు సేయ నెఱుంగ నింతయున్॥ 335

మ॥ కడవన్నెత్తికి నెత్తియాడు నటకున్ గన్గొన్న గోవిందుఁ డ
య్యెడు నంచున్ బరువెత్తు వేణురవ మొందే బాగ విన్పింప కృ
ష్ణుఁడ యంచున్ భ్రమియించు వెన్నలనుఁ జూచున్ వానివేయంచు నీ
బిడ, యాపూతన చన్నుఁ ద్రావు హరికై వెఱ్ఱెత్తెనో? బేలమై॥ 336

ఉ॥ ఎక్కిన పిచ్చితోడ జగమెల్లను కృష్ణకృతంబ యంచు పై
జక్కగ భస్మముంచుకొను సాధుల శ్రీహరి దాసులంచునున్
మ్రొక్కును గంధపుం దులసిపూల, నరాయణు మాలతోననున్
జొక్కపు లచ్చి యీపె హరి చొక్కునఁ దక్కును తెల్పు మఱ్పులన్॥

చ॥ సిరిఁ గల రాజులం గనుచు శ్రీపతిఁ గంటి నటంచుఁ బల్కు భా
సురతర వస్తువుల్ గనుచుఁ జూచితి వామను నంచు నాడు నే
తెఱగగు విగ్రహంబుఁ గల దేవళమా హరి కోవెలే యనున్
మఱపున సిగ్గున న్విడక మాధవు పాదము లాసఁ జేసెడున్॥ 338

ఉ॥ మాన్యులఁ జూచి యాసపడి శ్యామహరుఁడా! యని పిల్చు నీల ప
ర్జన్యముఁ గాంచి కృష్ణుఁడను భ్రాంతినిఁ బర్విడు రూపరేఖలన్
ధన్యములైన యాలఁ గని తత్పతిఁ గన్గొన వెంటనంటు మా
కన్యక మాయలాఁడు హరి గాదరపెట్టి భ్రమింపఁ జేసెనో?॥ 339

చ॥ వలపున సొమ్మసిల్లి నలుప్రక్కల మోదమెలర్పఁ జూచి ద
వ్వులకయి చూపుఁ గొల్పు మెయిఁ బూనును జెమ్మట కన్నుదోయి వా
నలఁ గురియించు నూర్పువిడు నాయక! కృష్ణుఁడ! రమ్మనున్ మహా
శలు కల నాకుమారి వగఁ జంపగ నోపను పాపచిత్తనై॥ 340

—♦ఫలశ్రుతి♦—

మ॥ బలవత్పాపము దీర్చు కృష్ణునకునై పల్కెన్ శఠారాతి పా
టల వేయింటిని నందు నిప్పదియు నిష్ఠన్ నేర్వ నానందమం
జుల వైకుంఠమునొంది తొంటి యఘమున్ బోఁబాసి తమ్మెల్ల వా
రలు సేవించి సమాదరింప మహిమన్ రాణింతు రప్పారకుల్॥

## —♦ఐదవ పది♦—

ఉ॥ ఓలగ మొప్పనున్న భువనోత్తమ శాసనశీలు సన్మహీ
పాలు తురంగ రాక్షస విభంజను నాపతి సన్నుతించి కెం

గేలు మొగిడ్చి మ్రొక్కు- లెసగించి మనోహరశబ్ద మాలికా
జాలము నిచ్చికోఁదగిన సంపదఁ గంటి నికేమి లోటగున్॥ 341

మ॥ నీల విశాలనేత్ర, రమ, నిత్య నివాసముసేయు పేరెదన్
గ్రాలెడు వాని, పెద్ద యనురాగపుఁ గన్నులవాని దేవతా
పాలకు గాటపుంగయిత పాటల మాలలఁ బూజఁ జేసి యీ
నేలఁ గలట్టి క్లేశ సరణిన్ సడలించితి భాగ్యమెట్టిదో!॥ 342

చ॥ అవిరళ నిత్యమోద చరమావధిఁ దేలెడు నచ్యుతున్ గుణా
ర్ణవు, నలినాక్షు, దివ్యజన నాయకునిన్ గల కాలమున్ వచః
ప్రవిమల గాన మాలికలఁ బ్రస్తుతిఁ జేసిన భాగ్యశాలినై
యవిరళ నిత్యమోద చరమావధి నేనును నోలలాడితిన్॥ 343

ఉ॥ తన్ను ననన్యులై కొలుచు దాసుల దోసము తూలఁ గాఁగిలిన్
గొన్న పరున్ విహంగ తురగున్ సమిదుత్సుక చక్రహస్తు వా
గున్నత గాన మాలికల నోపి నుతించిన భోగ భాగ్య సం
పన్నుఁడ నాదునాత్మఁ బరమాత్మ యొనర్చిన దెల్లెఱుంగుదున్॥ 344

చ॥ అనుగుణభంగి ధర్మపథ మాదరమొప్పఁగఁ జూపు దేవతా
జనపతి, యెల్ల యర్థముల జాటినవాఁడుపకారి యట్టి సా
మిని, కలుషంబు, వ్యాధులు సమీర జవంబునఁ దూల శబ్దమా
లను రచియించి కొల్చి విపులంబుగఁ గొంటి దినంబు మోదమున్॥ 345

చ॥ కను నల పాపపైఁ జలువ కప్పురపుంబొడి రవ్వ యొప్పు పెన్
గను సొగ సొందువాఁడు సురనాథుఁడు శ్రీపతి వాని నర్హ వా
జ్ఞి యతిని గాన మాలికలఁ గీర్తనఁ జేసిన గణ్య పుణ్య వ
ర్ధనుఁడను నాకు నీపయి సదా లభియింపని వస్తువుండునే?॥ 346

ఉ॥ ఎల్లపు డేమిటం దనకు నీడన హెచ్చన నొందులేని వాఁ
డెల్ల జగాల నేలికొను నీశుఁడు వానకు నష్టుఁ బెట్ట చే

వేృిళ్లను కొండ నెత్తికొను శ్రీపతికిన్ శుభ శబ్దమాల భా
సిల్లగ నిచ్చు భాగ్యమునుఁ జెందిన నాకొక లోపమున్నదే?॥ 347

మ॥ మనకున్, బువ్వనఁ గాపురంబుఁ గొను పద్మాదేవి కానంద మి
చ్చును భూమిస్థులకుం దివస్థులకు నీశుండౌను శీతాబ్జ పీ
ఠని విష్టాంఘ్రితలున్, జగజ్జనకు జాడల్ చాటు పాటల్ సువా
క్య నిరూఢిన్ రచియించు నాకు పరమాకాశస్థులున్ సాటియే?॥ 348

చ॥ దివి, దివిదాటునాదట, క్షితిన్, క్షితిక్రింద తలంబు, నష్ట ది
క్పవహము నొక్కెడ న్విడక నిండిన వానికి, వక్ర శంఖమున్
వివృత కరంబునం గొనెడు వేల్పునకున్ ఘట నృత్యమూర్తికిన్
గవనముఁ జెప్పి నర్మతనుఁ గాంచితి నాకిక మాఱు లేదెటన్॥ 349

ఉ॥ మిృింగియు నుమ్మియుం గొలిచి మీదకుఁ దేలిచి పవ్వళించి చ
క్కఁగను నిల్చి, భూషణ వికాసముతో దయచేసి కౌఁగిలిం
తంగడుఁ గూర్చి భూసతిని తానె వహించెడు దేవునైజ మొ
ప్పంగురియింపఁడు నోచితిని వైష్ణవ హర్షక శబ్ద వర్షమున్॥ 350

—♦ఫలశ్రుతి♦—

ఉ॥ సారపు వానల న్నివులఁ జల్వగు సుందర వేంకటాద్రి నొ
ప్పారెడు సామికిం గృతిగ నంబుసమృద్ధ వనాలెసంగు కు
రూకరున "కారిమాఱు" నగ నొప్పు శఠారి రచించు నిప్పదిన్
నేరుచువారి పాపముల నీరజ వాసిని తీర్చి ప్రోచెడిన్॥

## —♦ఆరవ పది♦—

మ॥ రమణీయానన నీపె నొందు సుకుమారంబైన రోగంబు తె
ల్లము యుద్ధాంగముఁ గూర్చి పాండవులఁ గెల్వంజేయఁ దానై శతాం
గము నయ్యర్జును నర్థమై నడుపు శృంగారాంగుపై నీపె భా
వము కీల్కొన్నది భ్రాంతి నింకెచట బోవన్ వమ్మ వైద్యార్థమై॥ 351

చ॥ పడఁతుకలార! యీలలనవ్యాధి గుఱించి భ్రమించి యుందు రీ
యడరొక దేవుఁ డూనుటనె యయ్యెను దయ్య మటంచు మీర డా
వుడిఁ బడుచుండిరి మీబ్రమలు పోవిడి యీవిడ యాలకింపఁ బ
ల్కెఁడు హరి సంకు చక్రమని కోమలి దిగ్గున లేచుఁ జూడుఁడీ॥ 352

చ॥ నెలతుకలార! దీని గమనింపుడు మీరు నిషాదనారి ప
ల్కెలఁ గొని కల్లు మాంసమునుఁ గూర్చి యొదేనియుఁ జేయనేల? తే
నెల నొలికించు శ్రీతులసి నిన్ మకుటంబున నుంచు మాయు న
ద్దల నుతియింపు డయ్యదియె కోమలి జబ్బుమరల్చు మందగున్॥ 353

ఉ॥ మందని చెప్పు నిక్కెఱవ మాయలమారిని నమ్మి దాని మా
టందుచు నల్లయన్న మరుణాన్నమునుం బలి చోటనుంచి యే
మొందగ వచ్చు? లోకముల నొక్కఁడ యొక్కెడ మింగి యుమ్మ గో
విందు పరాధిదేవు పలుపేరులఁ బేర్కొనుఁ డీపె తక్కెడున్॥ 354

మ॥ అయయో! ఈయమఁ దేర్పగా వెరవు దయ్యా లాడుటంగాదు పో
నయశాబ్జంబులు వాడె, మోవి జిగి సన్నంబయ్యె; మేతన్ బలం
బయి మత్తెక్కిన యేన్గుజంపు హరి నామశ్లాఘనన్ బావనం
బయి జానొప్పెడు ధూళి మేనిపయి నేయన్ బూనుఁడీ మేలగున్॥355

మ॥ అతివల్ మీరు నిమేషము న్విడక దయ్యాలాడిరే కాని యీ
సతి జాడ్యంబు శమింప కింక పెటిగెన్ సద్రత్న రమ్యాంగు, న
ద్భుత శీలున్ హరిఁ గొల్చు భక్తుల పదాంభోరుట్ప రాగంబ లం
కృతిగా నీమృదులాంగిపై దులుపుఁ డేదే జోడె? యీపాడికిన్॥ 356

మ॥ అరుదా మందని మేకపోతులునుఁ గల్లర్పించి తద్దేవ తాం
తరముం గొల్చుచు హస్తతాళముల నృత్యంబాడ నేమయ్యె? సుం
దరులారా? వెలి నెండు వడ్లనుఁ దినంగా మూతి నాడించు నా
ఖరముం జూచిన భంగి యయ్యె హరిభక్తశ్రేణిఁ బిల్పింపుఁడీ॥ 357

మ॥ శ్రుతి విదులైన భక్తులను జూచుచు వారి పరంబుగా, రమా
పతి పదసీమ మ్రొక్కి- నతివ్యాధి నడంపక పోయి క్షుద్ర దే
వతకు నిషిద్ధభంగి సుర బానలనుంచి, పదాలఁ బాడి స
న్నుతుల నొనర్ప మీకుఁ దగునో? రుజ తగ్గునా? నీచవర్తనన్॥ 358

మ॥ ఒక నీచక్రియ కంత్యజాతి జనుఁడే మోడప్పు వాయింప దా
నికి నూతై పలు కల్ల పాటలను నెన్నే పాడు మీపాడు చే
తలకు న్నైపను నేడుజన్మలకు శ్రీదంబొచుఁ దద్వ్యాధి వా
రకమై యర్హ్యముసైన కృష్ణపదమున్ బ్రార్థింపుఁడీ భక్తితోన్॥ 359

ఉ॥ ఈయమ మాధవాన్య సుర నెంచను వాంఛలఁ జెప్పి జబ్బలన్
వేయుచు నాడు నోసతులు! వేద చతుష్టయవేద్య ద్వారకా
నాయకు విష్ణు, కృష్ణు స్మరణంబొనరింపుఁడు మీదటన్ నతుల్
జేయుఁడు పైన నృత్యములఁ జేయుఁడు వ్యాధి నశించు నీమెకున్॥ 360

—♦ఫలశ్రుతి♦—

చ॥ పరత భజించి యాడి మణిభవ్యతనుద్యుతుడైన వాని కిం
కరుడయి ధూతఖేదుడయి నాశములేని యశస్సునొంది శ్రీ
కురుక వసించునట్టి శఠకోపుడు వాకొను వేయి పాటలన్
వరమగు నిప్పదిన్ గొలిచి పాడిన వారుఁ దరింతు రార్తులన్॥

## —♦ఏడవ పది♦—

మ॥ అనయంబున్ క్షితిభోక్త! జ్ఞానమయ! భక్తాసక్త! నారాయణా!
యని వేమాఱులుఁ బిల్చి యొఁదలప యిన్ హస్తఁబులన్ మోడ్చి మ్రొ
క్కి-న నీనెమ్మొయి సొంపుఁ జూపవు ననున్ గ్రేవాడకుం బిల్వ వ
ల్పుని దుర్వర్తనుఁ నన్నుఁ బొందు కలుషంబుల్ పెద్దవో? అయ్యయో॥

మ॥ అమలానంద మహాసముద్రమున నోలాడించు ప్రేమాత్మ! లో
కములం గొల్చిన వామనా! యనుచు బిగ్గన్ బిల్చి నేనస్రా

త్రిములన్ మంచి పవళ్ల నాఱ్చితిని నాథా! నన్ను వంచించి నే
త్రిముల న్నినొ్నకమాఱుఁ జూచి కొనగా రాకుండు వే? మాయివై॥362

ఉ॥ ఏఁదని దొడ్డ పాపముల నెన్ని యొనర్చిన వాఁడనో క్కొ-? 'దా
మోదర! వామనా!' యనుచు మోపిక నిన్ బలుసార్లు పిల్చి యా
వేదన నశ్రువు ల్విడిచి వేగియు నీదగు సేవఁ గాంచ న
య్యా! దయచేసి 'పాపివ'ని యైన నొకా నొక మాటఁ జెప్పవే॥ 363

చ॥ అమరులె యాసఁ జేసి నిను నారయలేరు మహాత్మ! నాథ! సి
గ్గు మఱచి మూఢబుద్ధి, "కనుఁ గొందు వికస్వర పద్మనేత్రు ను
త్తమ కనకాంగు నిన్ను దరి దాపునకుం దయచేయుమ"ంచు వ్య
ర్థముగను నాఱ్పు చుంటి నిట దాన నొకా నొక లాభముండునే?॥ 364

ఉ॥ అప్ప! అజేయచక్రిధర! అప్పతిఁ జిక్కిన గొప్ప తిప్ప! నీ
చొప్పగు నాల్గు బాహువులఁ జూడగ నువ్విళులూరి యూరి యే
నెప్పుడు కంటనీరు విడి యొంతయు వంతలవేగి తూలితిన్
న్నిప్పటి కేని వచ్చెదవో! యేమొ? యటంచు నపేక్షఁ జూచెదన్॥365

చ॥ దినమును నాదు మేనున, మదిన్, మఱి యింద్రియ పంచకంబు నం
దున నెడమీాయ కెల్లెడలను న్నెఱి నున్న నిను న్నెఱింగియున్
నినుఁ గనుదోయిఁ గందునని నేను వివేకము లేక నల్లైసల్
గనుచునుఁ గంచు నాత్మ తమకంబునుఁ బొందుచు నుందు నీశ్వరా॥366

చ॥ హరి! తులసీధరా! మనసు నందున నిన్గని యేనెఱింగి యు
న్నెఱిఁగియుఁ దేరి తేరి యమితేద్ధ వివేకుని నిన్ను నాత్మలో
నర మర లేక యుంచి జన నాదులపై మఱిపొంది నిల్చి నా
దరి నురియాడు నజ్ఞతను తద్ద మరల్చితి మన్మనః పతీ!॥ 367

ఉ॥ చారు హరి ప్రియాభరణ! సామి! నినుం దరిసించి నాదు కే
లారఁగ నీదు శ్రీపదము లష్ట హరి త్పరిలభ్య పుష్పముల్

గూరిచి కొల్చి తుష్టిఁ గని 'కో'యని పాడుచు నాడ నీపరీ
చారుఁడ నాకు రావయితి సంద్రము చుట్టిన యీధరిత్రికిన్॥ 368

చ॥ ఇడుములె యెఱుంగ నీరు నిడ నేరికి నింద్రియ పంచకంబు, లో
ఁబడునటు చేయ శాస్త్రవిధిఁ బట్టి సుమంబులఁ బూజఁ జేయ నా
గడుసు మనస్సునందు తమకమ్మది రేగగ సంభ్రమించి పా
పుఁడ నిను జక్రినిన్ వెతుకఁ బోయెద నేయెడ నిన్ను గాంచెదన్?॥ 369

చ॥ వెలసిన జ్ఞానరూపు నిను వేదవికాసుని జ్ఞాన దృష్టిమైఁ
దెలిసి కవుంగిలించియు 'పతీ! హరి! చక్రి' యటంచుఁ బిల్చి యం
జలి నొనరించి భాష్పములు జారగఁ బ్రక్కలఁ జూచి యుండి వి
హ్వలతనుఁ గంటిఁ గాని యతిపాపుఁడ నిన్ గనలేక పోయితిన్॥ 370

—♦ఫలశ్రుతి♦—

చ॥ తఱిమెడు ప్రీతితోడ నవ తామరసాక్షుని గూర్చి సౌధ సం
భరితమునైన శ్రీకురుక వాసము జేయు శఠారి చెప్పు సుం
దర సులభార్థవంత మగు ద్రావిడపద్య సహస్రమందు నం
బరగెడు నిప్పదిన్ దెలిసి పాడుచు నాడ లభించు మోక్షమున్॥

## —♦ఎనిమిదవ పది♦—

చ॥ సిరియు విరించియున్ హరుఁడు స్వీయతనూలత నాని యుండ నే
హరి; యసురాళి ధూళిఁ గలియన్ మదిలోనఁ దలంచి యాయుధో
త్కరముఁ గరంబులం గొనియె తబ్బలశాలి యుపేక్షసేయు మా
వర సుకుమార రూప విభవంబు లవేటికి? డంబులేటికిన్?॥ 371

మ॥ వినుతాంగిన్ ననయింటి చాన నెద నెవ్వేళన్ దిరంబుంచు వా
డవనీ భృద్బలవద్విశాల భుజుఁడుద్య ద్యుద్ధ సంసిద్ధ చ
క్రవహద్ధస్తుఁడు నన్ను స్వీయమగు కైంకర్యంబునం జేర్చు మా
ధవుఁ డాశ్చర్య గుణుండు చేకొనని చేతంబుండి నాకేమగున్?॥ 372

చ॥ తన ప్రియమైన తల్లి మయిఁ దాలిచి వచ్చిన దొంగ బూచి కు
డ్పిన విషదుగ్ధముం గుడుచు పెద్దవివేకపు పిన్నబిడ్డ శే
షుని పయిఁ బండు పర్వతభుజుండు సమాయుఁడు పూరుషోత్తముం
డనఘుఁడుపేక్షసేయ, తనరారియు నాజిగినింపు కాల్పనే?॥ 373

చ॥ నవదృఢ దీర్ఘబాహుయుత నాగ్నజితీ పరిరంభమొంద స
ప్తవృషభ ఘాతమోపి పిదపం గడతేర్చిన గోపుఁడున్ ఫల
ద్రవమున నెఱ్ఱ కఱ్ఱయిన దట్టియుఁ గౌనునగంట, ముంత, కో
ల, వెలయువాఁడు వాడని విలాసము మాకుఁ బ్రయోజనంబొకో?॥374

ఉ॥ రాణఁ దనర్చి కట్టెఁడి చెఱం బడి మెచ్చుగడించు నా శుకీ
వాణికిఁ గాగ రావణుని పట్నముఁ గాల్చినవాఁడు గంధముల్
తేనియలీను సూనములఁ దేరు హరిప్రియపేరు మౌళిపైఁ
బూనిన భూతనేత, తమిఁ బొందని బుద్ధి సమృద్ధి యెందుకో?॥ 375

చ॥ ఉరు ధరణీ తలస్థులగు నున్నత బుద్ధులకెల్ల బోధ్యమౌ
వెరవులనెత్తి చెప్పిన వివేకమయుం డతులైక మూర్తి యి
ద్ధరఁ గుహనా వటుండగుచు దానవిషం గొను నెత్తుకాడు శ్రీ
హరి, కయికోని నా యలరు నందపు పొందిక రిత్తయేకదా!॥ 376

చ॥ చెలఁగెడు పెంపెసంగి నరసింహము భంగిఁ దొడంగి పొంగి, యు
జ్జ్వలుని, హిరణ్య రాక్షసు విశాల దృఢోరము వ్రచ్చి సంతసం
బొలసినవాఁడు, తేజమున నొప్పెడు చక్రముఁ బాంచజన్యమున్
గల, హరి నీలవర్ణుఁడొక కాంక్ష నొసర్పఁడి కేల? కంకణాల్॥ 377

మ॥ అరి చిత్తంబుల నుజ్జ్వలాగ్నిపడ రేఖావృత్త శంఖంబు ను
ద్ధుర శబ్దంబున నూది, యాదినవనీ దుర్భారమున్ మాపె నీ
శ్వరుఁడుం బ్రహ్మయు నింద్రుఁడుం గొలుచు సర్వవ్యాప్త సత్కీర్తి శ్రీ
హరి యాసింపక మాకు నేమిటికి? యోఘ్యా ణాద్యలంకారముల్॥ 378

ఉ॥ కాంచన మేఖలాకలిత కమ్ర విశాలనితంబ రమ్యయై
మించు నుషాఖ్యకన్య మెఱ మెచ్చులయబ్బను బాణు జబ్బలూ
డించిన వాని నిద్దుర నటించి జగాలకు మేలుసేయ యో
జించుచు శేషశాయియగు శ్రీధవుఁ బొందని బొందె యెందుకో?॥ 379

ఉ॥ ఉసురులు లేని కొండలటు లున్న మహోన్నత కాయులైన య
య్యసురులఁ జక్కఁజేసి యుసులందినవాఁడు వియన్నదీ జల
ప్రసర జటాధరున్ స్వతను భాగమునందొక పాయ వేఱుగా
బసయిడి నిల్పు శ్రీధవుఁడు వాంఛ యొనర్పని ప్రాణమెందుకో?॥ 380

—♦ఫలశ్రుతి♦—

శా॥ లోకాలేడునుఁ గుక్షి డాఁచియునుఁ బాలు న్వెన్నఁ జేకొన్న సు
శ్రీకుం గూర్చి శతారియోగి కురుకా సేవ్యుండు వాకొన్న య
స్తోక ద్రావిడ శబ్దమాలికల యందున్ బైపది న్నేర్చినన్
వైకుంరంబును బొందగల్గెదరు సంసారంబు ఛేదించుచున్॥

—♦త్రొమ్మిదవ పది♦—
—౯

ఉ॥ గొంగలు నవ్వ బంధుగులు గొల్లున నేడ్వ నచింత్యదుఃఖ మె
ల్లం గలిగించు లౌకిక కలాపములేల? కృపాళు! మాకు? ను
త్తుంగ తరంగ సంకలిత తోయధి మంథన! నీపదంబె చే
ర్పంగల మృత్యువుం గను నుపాయము నాకెఱింగింపు సత్వరన్॥ 381

చ॥ చెడుతఱిఁ జచ్చు నప్పుడునుఁ జేరుచు జ్ఞాతులు బంధుకోటి పై
బడి కడు నేడ్చి యార్చెదరు పాపపు లోకపుతీరు లిట్టి వి
య్యెడదరు నడంచునెత్తొకటి యేనునెఱుంగ ననంతశాయి! నీ
యడియనిఁ బ్రోచు తావరసి యయ్యొ! వడింగొని పొమ్ము నీకడన్॥382

చ॥ అసమును, నాభిజాత్యము, సమాగత సంపద జ్ఞాతిబంధులన్
గుసుమ కలాపకేశ సతి, గోముముఁబాసి యొడల్ దొఱంగు టీ

వసుధ విధంబు దీనిఁ గని వార్ధికళాంగ! సహింప దాసుఁడన్
వెసననుఁ బిల్చి నీయడుఁగు పీటకడన్ బడిఁగాపుఁ జేయవే॥ 383

చ॥ 'కొనుమ'ని పెంపుతోడఁ దనుఁ గొల్వగ వచ్చిన లచ్చి చిచ్చు క
న్నను వెతఁ బెట్ట దానినె కొనం దమికన్ బ్రిమ్మెఁడు నిట్టి లోకమే
మనఁదగు? శ్లాఘ్యవర్ణ! సదయా! భవదీయ పదంబు వచ్చి చే
రను నను నీదు దాసు ననురాగమునం గృపసేయు మీశ్వరా॥ 384

మ॥ జల మధ్యాంబుజ జాతలోక వివరాం చచ్చేతనా చేతనం
బులలో జీవులు జన్మ, వ్యాధి, జర చావున్ బొంది యామీద, కొం
దలమౌ నారక మొందు చుందురు జగత్ స్వాభావికంబిట్టి దు
ర్జ్వలవర్ణా! మఱువంగఁ బోక నను నీవానిన్ నినుం జేర్పుమీ॥ 385

చ॥ భ్రమలను బెట్టి గట్టివల వాగురలం బడవైచి కొట్టి ప్రా
ణముఁ గొనియైన యన్యుల ధనమ్ములఁ గొందురు న్యాయమౌ నుపా
యముఁ గన రెట్టి లోక మకటా! తులసీధర! పాపినైతి నా
కమృతము వంటి నీకడకు నాశ్రితు నన్నిక నైనఁ బిల్వుమా॥ 386

ఉ॥ స్థావర జంగమాత్మకుఁడ! స్వామి! భవత్తను బాహ్యవస్తువుల్
లేవిల; నీవ నేతవయి క్లేశముఁ బుట్టటఁ గిట్టుటన్ జరా
భావము, వ్యాధియుం గెడపు పాపపు లోకము జూడ నీకు నీ
సేవకుఁదావకాంఘ్రియుగ సేవకునై కొనిపొమ్ము మాధవా!॥ 387

చ॥ మును కనిపించి డాచి వెలిఁ బుచ్చిన యీయిల, నీరు, నగ్ని, మి
న్ననిలముఁ, జేర్చి కూర్చితి సురావసథంబు నజాండ మిట్టి కో
టను నను దాట నిచ్చి కడుడంబగు నీపరమాస్పదంబునన్
ఘనమగు నీదు పాదములఁ గాంచ ననుం గొనిపోదు వెప్పుడో?॥ 388

ఉ॥ కూజిత తావకాంఘ్రులనుఁ గూర్తువు చేరగ నీవు మాయచే
జేజెలనైన శేషశయ! సేవకుఁ డింత మెఱుంగు సంసృతిన్

ద్వ్యాజిత వంతమహానటుల నర్మిలి సీవానరింప నీపదాం
భోజము నెంచి యాయడుఁగు పొంతకుఁ జేరితి నిన్నుఁ గాంచితిన్॥ 389

చ॥ చెలువు తొడంగులం దొడుఁగు శ్రీయును నీవును సేవనీయమీ
చెలువముఁ జూచి, మూరొ్కని; స్పృశించి, భుజించియు, నాలకించి నేఁ
దొలఁగితి దేహ భోగముల దుర్లభ కేవల తాల్వభోగమున్
లలిత భవత్పదాంబుజములం దరిసించితి వానిఁ బొందితిన్॥ 390

—♦ఫలశ్రుతి♦—

ఉ॥ శ్రీపదుఁడా నరాయణుఁడు శ్రీహరి కేశవుఁ డుజ్జ్వలుండు త
చ్ఛ్రీపదమందు నాసను వచించె శఠారియునర్థి ద్రావిడా
లాపములన్ సహస్రమకలంకత నందలి యీపదిం గనన్
శ్రీపద మందవచ్చుటను శ్రీపదమందున నైక్యమొందుఁడీ॥

—♦పదియవ పది♦—

మ॥ అమరుల్ లోకములున్ జరాచరము లీయావత్తు లేకుండు కా
లము నందుండి విరించి దొట్టి జగముల్ గావించు వెన్నున్ నగో
పమ సౌధంబులు చుట్టునొప్పు "కురుకూర్" పట్నంబునందున్న యా
దిమదేవున్ బరుగూని యేల? వెదుకన్ దేవాంతరంబున్ జనుల్॥ 391

మ॥ మిము మీరారసి మ్రొక్కు దేవతలనే మేధావి మున్ జేసె ను
త్తమశీలుండతఁ డాదిదేవుఁడు వివర్త ఖ్యాతి యున్నట్టి క్షే
త్రము పొందా "కురుకా పురంబు బహుసౌధ శ్రేణి నొప్పారు సం
ఘములై యాడుచు పాడుచు న్నటఁ జనంగా లోకులారా! తగన్॥ 392

మ॥ పలు లోకంబులఁ బెక్కు నాకుల జనింపంజేసి యంతర్వ్యాప్తి లో
పల కొక్కమ్మడి మ్రింగి, దాచి; వెలికిం బాటించియుం గొల్చి పై
వెలయం జేయుటఁ జూచియుం దెలియరో? వెన్నుండుఁగా కొండ్లు వే
ల్పులు లేర'క్కురుకా' పురీశు నరిఁ గాపుల్ కారె? వారెయ్యెడన్॥

చ॥ తలఁపఁ గపర్దికిన్ విధికిఁ దక్కినవారికి వాఁడె స్వామిగా
దెలియుఁ గపాల మోచనగతిన్ ద్యుతి మత్పరిఘా వృతంబు మం
జుల 'కురుకా' పురంబచట శోభిలు శ్రీశు నలంతి సేయుటన్
గలిగెడి దేమి? లింగభజన ప్రియులార! యెఱుంగఁ బల్కుఁడీ॥ 394

మ॥ అల లింగార్ధ పురాణ పక్షులగుమీ, ర్యాజైన శాక్తేయ బౌ
ద్ధులు మీమాంసకులున్ భవత్పరలు నెందున్ వాని యందుండ్రి స
స్యలసచ్ఛ్రి 'కురుకా' పురీశ్వరుఁడు దాసాధీనుఁడే సుండి! మా
యల మాటొక్కటి లేదు మానుడుల దేవాధీశు సేవింపుఁడీ॥ 395

మ॥ మఱియొక దేవతం గొలుచు మక్కువ మీకునుఁ గట్టిపెట్టి యీ
తెఱఁగున నుంచు మెల్లఱునుఁ దేలుచు ముక్తినిఁ గన్న లోకమే
జరుఁగ దటంచు శ్రీహరియె సల్పిన మాయసుమండి! దీని వే
నరసి, ససస్య ముగ్స "కురుకా"ఖ్య పురీశ్వరు నాశ్రయింపుఁడీ॥ 396

చ॥ పొరి పొరి పెక్కు యోచులనుఁ బుట్ట నుతించుచు గొంతి దేవతాం
తరముం మ్రొక్కు వారిగతి తగ్గయుఁ గాంచిరి మీరు దేవతా
వరు 'కురుకా' పురీశ్వరుని వాయువిలోల శకుంత కేతనున్
హరి, జగదాది కారణుఁ బ్రియత్నము తోడ సమాశ్రయింపుఁడీ॥ 397

మ॥ కరముం దాస్యముఁ జేసి తన్ గొలుచు మార్కండేయు నోమెన్ దిగం
బరుఁ డన్నన్నది శ్రీశు చెయ్దిమని యేర్పాటయ్యె; కహ్వాకృతిన్
విరులొప్పారెడు కేతకీ వితతి నెవ్వేటం గడుం గందుమా
"కురుకా"న్ మాధవుఁ డుండ నొండులను వాకోనేల? దైవంబులన్॥ 398

మ॥ పలుకంగాఁబడు షణ్మతస్థులునుఁ దద్వర్గాష్టదృష్టుల్ తనుం
దెలియన్ సైపని దుర్లభుండు, మొదలౌ దేవుండు, కొల్వుండు శీ
తల కాసార పరీత చారు 'కురుకా స్థానంబె మీచిత్త సీ
మలలో నుంచుఁడు మీకునుం బ్రిదుకు సన్మార్గంబ కాబట్టినన్॥ 399

చ॥ సకలసురల్ జగంబులును స్థావర జంగమముల్ స్వనిర్మల
ప్రకట తనూసమాన విభవమ్మునఁ దాల్చియు స్వీయమూర్తి మా
యక కొమరొందుచున్ "కురుక" యందు వసించెడు వస్తుఁ, గుంభన
ర్తకు హరి సేవఁ జేయుట కరంబు వరంబు సులభ్య మేరికిన్॥ 400

—♦ఫలశ్రుతి♦—

చ॥ అరికరు సేవ చేసికొని యాతనిఁ బొందినవాఁడు మాఱి నా
యరుదగు పేరుగాంచి వకుళాభరణుండగు శ్రీశఠారి సుం
దరముగ పాడు వేయిఁట గనందగు నిప్పుదియుం బఠించు ధీ
వరులకు చేతిలోనిది భవంబునకుం బరమైన లోకమున్॥









# శఠకోపగీతామృతము.

## ఐదవశతకము

—♦మొదటి పది♦—

ఉ॥ "సైకె నెతి చూట్టు కెదుపునఁ గన్నులఁ గన్పడు నీలవర్ణ!" యం
చే నన్నృతాలకాడి విషయేచ్ఛల మున్గ, ఫలంబె కంటి న
ద్దానె? ఫలించు నావిధికి నన్యము కృష్ణ? మఱేంక నీవు పో
(బూనుట కాదె? నన్ను విడి పోఁగలవేనియుఁ బొమ్ము చూచెదన్॥401

శా॥ "సాలోన్మాలక! బాలకా! మణి తనూసౌందర్య! మాధుర్య భో
గ్యా లేహ్యామృత!" యంచు నేమొ పలు శుష్కాలాపముల్ జేయ శ్రీ
లోలుం డెంతయు నాకు వశ్యుఁడయి భూలోకంబు నాకంబు శి
ష్టాలా యాండములుం బరం పదముతో నల్లారె నాయాత్మలోన్॥ 402

చ॥ మనసొక చోటఁ బెట్టి పయిమాట కుదార! మణిప్రకాశ! యం
చును నొక కొన్ని బూటకపు సొట్ట కబుర్లనుఁ బల్క నిన్నె వం
చనఁ గొను బుద్ధిపోయె నినుజాలఁ గనుంగొని మంటి; పాలవె
ల్లిని శయనించు సామి! విడలే నిటుపై నిను దేని కోసమున్॥ 403

చ॥ నినువిడి దేనిఁ గొల్చెదను? నేనని డాబులుకొట్టు ఘోర వం
చనుఁడ; మనస్సు నీడ్చి భవసంగ సుఖాశ్రులఁ దుడ్చి కృష్ణ! నీ
యనురతిలో నిమిడ్చికొని యాత్మను వేల్పుఱుపంగఁ జాల నన్
బొనుపడఁ జేయు నా మలినము న్విడఁ గొట్టుము చేర్పు నీకడన్॥ 404

చ॥ అమర సుధాభిరామ! అసితామల రత్నవికాస! కృష్ణ! నిన్
బ్రిమపడి కాంచి కాంచ నడుమం బెను మేననవైచి మత్కృతా
ఘములను గట్టి త్రాళ్ల బిగఁ గట్టుచు మాంసముఁ గప్పిపుచ్చఁ జ
ర్మము వెలిఁగప్పి నన్ను భవమాయల ద్రోచితి వేమి సేయుకున్?॥405

చ॥ వెలువడఁ గాక చుట్టుకొని వేఁచెడు రెండు విధాల కర్మలుం
గలుగు గృహస్థులం గలఁచు కాయ నికాయము లోనఁజిక్కి కేన్
దొలఁగితి; చారుదీర్ఘభుజు, తోయజ నేత్రునిఁ, బల్లవోష్ఠు, ధ
ర్మ లలిత చక్రహస్తు నభిరాము, శ్రియఃపతిఁ గంటి మత్పతిన్॥ 406

ఉ॥ ఎక్కడివాఁడు చక్రధరుఁ డీశుఁడు శ్రీహరి? ద్రోహినైన నే
నెక్కడ? యెట్టి పాపులకు నేన్ విధి పండెడు కాలమైనచోఁ
దక్కి ఫలించుఁ జుండి గజతాపహరా! యని చేతులెత్తుచున్
మ్రొక్కి యథార్థ భక్తిమతిఁ బొందితి దైవమునాఁ లె నాయెడన్॥ 407

ఉ॥ మిన్నున నున్న వారలును మేదిని వారలు నాసఁ జేయు సం
పన్నుఁడె వచ్చి నామనసుఁ బట్టెను నాకిక మచ్చికంటి, వి
త్తోన్నతి, సత్సుతుల్ మిగుల నోరిచి నాపయిఁ గూర్మి సేయునన్
గన్న మదంబ, మత్పితయు నాసకలంబును నాతఁడేయగున్॥ 408

ఉ॥ ఏరు సహాయులౌ గరని యెంచి తరంగ బలిష్ఠ వార్ధిలో
జేరిన నావ మున్గనటు చిక్కి భవాంబుధి నేనుఁ దూల సొం
పారిన రూపుఁ దాల్చి తన హస్తములందున శంఖ చక్రముల్
గూరిచి వెన్నుఁ డౌర! కడుఁ గూరిమి వచ్చి వసించె నాకడన్॥ 409

ఉ॥ మీనునుఁ గూర్మమున్ గిటియు, మించు నృసింహుఁడు వామనుండునై
బూనును ముందు కల్కియెయి పుష్కలవారిద మూర్తి 'దాసునిం
గా నొనరింపుచు'న్న నుడిఁ గైకొని పొంగుచు వచ్చి తానె నా
పై ననురక్తిఁ జేసి నను బాయక భోగ్యునిఁ గాగ చేకొనెన్॥ 410

—♦ఫలశ్రుతి♦—

చ॥ జలద సమానవర్ణు వనజాతదళేక్షణు కృష్ణు గూర్చి మం
జుల తమిళంబునందు సువచో రచితంబుగ శ్రీశఠారి భ
క్తులకయి చెప్పు వేయిఁటను గూడిన యిప్పదియుం బఠించి ని
ర్మల గుణపూర్ణులై చని రమాధవ పాదముక్రింద జేరుఁడీ॥

## —♦రెండవ పది♦—

ఉ॥ అంబుధివర్ణు దాసు లిల యంతటఁ దిగ్గచు పాడి యాడి స్వే
చ్ఛం బచరింపఁ గంటి మిహజన్మల పాపము మాసె; బాసె ఘో
రంబగు నారకంబు కలి మాన్పడె నయ్యమ ధర్మరాజు బా
రింబడు వారె లేరిఁక సమృద్ధి సమృద్ధి సమృద్ధి కావుతన్॥ 411

చ॥ చెలువయి చల్లనైన తులసిం ధరియించెడు శ్రీశు దాసు లీ
యిల పయి నాట పాట లొలయించుచు నెల్లెడ సంచరింప క
గ్గలువలు చల్లఁగా మనము కంటిమి కంటిమి కంటి మెల్ల భ
క్తులుతోర రండు! వారలనుఁ గూడుచుఁ గూడుచు పాడి యాడఁగన్॥

చ॥ కలిఁ గల తారు మారెడయఁగాఁ గృత కాలము వచ్చి నిత్య సూ
రులు తమయంతఁ జొచ్చునటు రూఢ ముదంబుధి పొంగునట్లు మ
బ్బుల జిగి, సంద్రపున్ రహియుఁ బొల్చెడు శ్రీపతిభక్తు లుర్విపై
వెలయుచుఁ బర్వి గానముల విశ్వములం దరియింప సేయుతన్॥ 413

చ॥ అలముచు నున్న దుర్మతము లన్ని సమూలము కూల్చుచున్ మహా
జలధి శయాను భక్తులు ప్రచారముఁ జేయుచు పవ్వళించియున్
నిలిచియు లేచి వంగియు ననేక విధంబుల పాడి యాడి ప
ర్వ్వలఁగొని నృత్యముల్ సలిపి పొల్తుగు శ్రీహరి పారవస్యులై॥ 414

శా॥ వైకుంఠేశ్వరుపాద భక్తు లిలపై వ్యాపించి స్వేచ్ఛాగతిన్
లోకంబంతట చేయు వ్యాపృతిని నాలోకింప నాకంటి కి

ల్లోక పరిక్రియఁ దోఁచు; నోఁచపలు! లీరే దైత్యులై పుట్టుచో
మీఁకు స్మన్గడలేదు కూల్తురు కలిన్ మిమ్మున్ నుడుల్ నమ్ముఁడీ॥ 415

ఉ॥ ప్రాణులఁ జంపుచున్ మెసవు పాపము కోపము తుత్తుఁ దొట్టి య
జ్ఞానముఁ ద్రోఁచివైచుటకె చక్రి సమాశ్రితు లుర్విఁబుట్టి స
ద్గానముఁ జేసి యాడి భువిఁ గ్రిమ్మరి నెమ్మది నిల్వఁజేసి త
త్స్థానముఁ జేరి యాశ్రయము సల్పి మనుండు భవాస్థిరాత్మకుల్॥ 416

శా॥ మీరుల్లంబుల నిల్పి వేల్పు లొకటన్ మేల్ జేసినారన్న త
త్కారుణ్యంబునఁ జుండి దీనికిని మార్కండేయుఁడే సాక్షి లో
నారాటంబు లిఁకేల? కృష్ణునకు వేఱై దేవతల్ లేరు స
ర్వారంభాత్మకు వానినెంచి పర దివ్యశ్రేణి నర్చింపుఁడీ॥ 417

చ॥ ఫలకర కర్మలం గొలిచి ప్రపణమొందు ప్రజార్థమై సురా
వళిగ నిజస్వరూపమునె వర్తిలఁ జేసెను దేవ దేవుఁ డా
విలసిత దివ్యలాంఛనుఁడు విష్ణురతుల్ గతకాములై యిలన్
వెలసినవారు గీత వినిపింతురు వారిని గొల్చి యుండుఁడీ॥ 418

ఉ॥ వేద పునీత మంత్రములఁ బేర్కొని జ్ఞాన విధిన్ ద్యజింప కా
మోదముతోడ దీపమును, బూలును, ధూపము, గంధ, మప్పు, సం
పాదనఁ జేసి కొల్చు హరిభక్తులు ధ్యానముఁ జేయు యోగులున్
మేదిని నిండియుండ్రిటకు మీరు చనుండు మనుండు భక్తులై॥ 419

చ॥ హర విధి పాకశాసన ముఖామరు లెల్లఱు కృష్ణు దివ్య సుం
దరు భజియించి లోక వితతంబగు సంపదఁ గాంచినారు పా
మరులగు మీరు వారివలె మాధవు నాశ్రయ మొందిరేని భీ
కరమయి యున్న యిక్కలి యుగంబు తొలంగదె మూలముట్టుగన్॥420

—♦ఫలశ్రుతి♦—

మ॥ కలి దోషంబులు స్వీయభక్తులకు లేకంజేయు నుద్యన్మహా
జ్వాల రూపుండగు మాయ కృష్ణునకుఁగాఁ బద్యాల్ సహస్రంబుగా

వెలయంజేసె శఠారి; కారి సుతుఁడా వేయింట్ల నిన్నిఁ బద్దిన
దెలియన్ మీకు మనోమలంబుచను మాధవా

## —మూఁడవ పది—

చ॥ అమలిన కాంతి మంతు నరుణాధరు నారతనాల కొండ, నా
దిమవిభు, శుద్ధశీలుని, బతిన్ వెతుకం గనుపింపకున్న దుః
ఖముఁ గని బుద్ధియుం జెదరి కామిని! ఎన్నిదినాలువోయె? గ్రా
మము ప్రజ నిందలం జొనిపి మమ్ములఁ జేసెడిదేమి? వాదులన్॥ 421

ఉ॥ నా యరుణాంబు జేక్షణుఁడు నాగుణపూర్తి హరించె తొంటి నా
కా యపు సొంపువోయె కటికన్గవ, హా తెర వాడి తెల్లగా
నాయెను డెందమున్ శిథిలమాయెను మాయలవాఁడు రాఁడు మ
మ్మో యతివా! మరల్చునొకొ? యూరిజనంబుల భూరి నిందలున్॥422

ఉ॥ పైకొనివచ్చు నాశకటుఁ బాదముసం బడఁదన్నె పూతనా
భీకర రాక్షసీ స్తనముఁ బీల్చుక త్రాగెను కెంపు మోవితో
నాకటి వేల్పు నాగొనము నంతయు దొంగిలె రాక పోకలున్
వాకులు వానితోడివియభామ! ప్రజల్ ననుదూఱ నేమగున్॥ 423

చ॥ పడఁతిరో! యూరివారి యపవాదమె యెర్వుగ తల్లి తిట్టులే
తడిపెడు నీరుఁగా వలపు ధాన్యముఁ జల్లి మదీయ చిత్తమన్
మడి నెసగించు నాసవరి, మస్తుగఁ బండనొనర్చు కార్మొగుల్
వడిమెయిఁ గన్నవాఁడు మనవాఁడగు కృష్ణుఁడు క్రూరుఁడౌ నటే?॥424

చ॥ గడుసరి కొంటె దిట్ట త్రిజగాలనుఁ గాలనుఁ గొల్చినాడు ధీఁ
గడచిన రూపువాఁడు గుణ గణ్యుఁడు వానిన నామనస్సునున్
గడు బిగిఁబట్టి యుండు నిదెఁగా యరుదాను గొనాల కుప్పవై
గుడుగుడు పాడి కొనుఁగల కోమలి! తల్లి యిఁకేమి? జేసెడిన్॥ 425

చ॥ మొదలిఁటి నిత్యసూరులకు మూలము ద్వారకరాజు రత్నశో
భఁ దనరు వాసుదేవుఁడను వాని వలన్ బడి చిక్కిపోతి నీ
పిదపను నన్నుఁ గూర్చి మదిఁ బెట్టకుఁ డాసలు మీరు, నూరి వా
రెది వచియింపనేమి? జనయిత్రియు నేమననేమి? నా యెడన్॥ 426

చ॥ వల వనువైచి నామృదుల భావముఁ గైకొని పోయి చక్రి యా
జల నిధి మీదఁ బండుకొనె స్వామిఁ బరాత్పరు వాని నేను క
న్నులఁ గని యమ్మలక్కలు గనుంగొన నాశిరసార మ్రొక్కగా
గలుఁగునొ? సుందరాంబర వికాస విశాల నితంబ! నెచ్చెలీ!॥ 427

ఉ॥ పూతన చన్నులం గుడిచి పోటరి బండినిఁ దన్ని సాలభూ
జాతము లుర్విఁ గూల్చి బకుఁ జంపి గజంబు నడంచు బాలు, లే
లేత పిసాళి నవ్వుల వెలింగెడు నెఱ్ఱనిమోవి సామినిన్
మాతలు సిగ్గిల న్మనము మానిని! పొందుటెఁ కెన్నినాళ్లకో?॥ 428

ఉ॥ నానుని సిగ్గు నానెఱిఁ జనంగ నొనర్చుచు మంచిదైన నా
మానసమున్ హరించి పరమంబగు నున్నత ధామమందుఁ గో
ల్వానను సురేనుఁ గూర్చి మొఱ నుర్విని౯ జాటి 'తవాయి' జేయుచున్
మానము మానుదాననయి మట్టలుఁ గట్టి చరింతు నష్టమే?॥ 429

చ॥ చెలియ! సహింపకే మనము చెచ్చెఱ వీధులకెక్కి పొల్తుకల్
పలుకఁగరాని నిందలను వాని గుఱించి వచించి దేశమున్
గలఁగగ నాల్చి మట్టలనుఁ గట్టి చరింతమె? చక్రిహస్తు పెన్
దళములఁ జల్లనౌ తులసి తావడముల్ తలఁ దాల్చి కొందుమే?॥ 430

—♦ ఫలశ్రుతి ♦—

గీ॥ ఘుమ్మదంబుధి నీలాంశు గోప కృష్ణు
నర్థమయి 'కురుక' శఠారి యర్థపూర్తి
జెప్పు వేయిఁట నిపుడిఁ జెప్పు వారి
పురములెల్లను వైకుంఠ పురము లగును॥

## —•నాల్గవ పది•—

శా॥ ఊరెల్ల న్నిదురిల్లె నెల్లెడఁ దమస్సాకుక్రమ్మెడిం గ్రిమ్మె నీ
రారావంబు లడంగె రేయి పొడవై యాగుబ్బతిల్లెన్ ధరా
హారుండో మనసామి! శేషశయుఁడౌరా! రాడు పూఁబోడి! యె
వ్వారింకం గలుషాత్మురాల నగు నాప్రాణంబు రక్షింతురో?॥ 431

మ॥ ఘనగంభీర పయోనిధి న్వసుధ నాకాశంబునుం గప్పి పై
కొనె దుర్వార వికార ఘోరనిశ నాగోపాలుఁ డబ్జాక్షుఁ డిం
కను రాలేదు మదీయ పాపమనసా! కారింతు వీవేని నా
కనుకూలింపక నాదుప్రాణములఁ గాపాడింతు రింకెవ్వరో?॥ 432

మ॥ మనసా! నీవును లొంగవైతి; పొడవై మాకొక్క కల్పంబు లా
గున నీరేయియు దాపరించెను దహాతూర్ప్రిరాస్త్రుఁ డారాఘువుం
డును రాకుండె నికేమిఁ జేయదగు? నాడుం బుట్టువుం బుట్టి పా
యని పాపమ్ములదాన నేను మరణోపాయంబు నేరన్ గదా!॥ 433

చ॥ పడఁతులకైన యీ వగలవాడిమిఁ జూడగనోడి వేడి వే
ల్పడరక డాగె వామనుఁడు నాయతనేత్రుఁడు కెంపుమోవి వాఁ
డోడయఁడు నాకు, నీలతనుఁ డుత్తముఁ డింకనురాడు నాయెదన్
బడు నెడలేని యీయెడరుఁ బాపగ నోపెడు వారలెవ్వరో?॥ 434

ఉ॥ అన్నలుఁ దల్లులుం జెలులు నారయ రీగతినాది రేయి యె
ల్ల న్నిదురింతు రబ్దరుచి లాలిత దేహుఁడు కృష్ణమూర్తి రా
డెన్ని యఘూలఁ జేసితినో? యేను గతించిన నాదుపేరు నే
లన్నెలవుండు నాస్థితిఁ దలంచెడు వారలు లేరె? యక్కటా!॥ 435

చ॥ వగలెగఁ ద్రోసి యాసరుజ స్వాంతము వెన్కకుఁ జేరె నీనిశా
యుగమెదురుండి నా నయనయుగ్మము చూపులమాపి కప్పె పెం

పగు కరమందు చక్రిమెస లారెడు మాయుఁడు రాడు ఈయస
హ్యాగతిని నాదు నిత్యమగు నాత్మను నిచ్చుటఁ బ్రోతురెవ్వరో?॥ 436

ఉ॥ ఇచ్చుట నన్నుఁ బ్రోతురెవరీ పెనుచీకటి వానజల్లు చే
పెంచ్చె యుగంబునై నడచు నీనిశ యిం దవదాతరూప పూ
తోచ్చుటఁ గన్న శంఖ మడరొప్పెడు చక్రిముఁ దాల్చు సామి తా
వచ్చునె? వేల్పులార! నను పాపము కాల్చెడి నేమిఁ జేయుదున్?॥437

ఉ॥ ఏక విచిత్రి రాత్రిమిది యేంష్లను పూండ్లయి నిల్వవచ్చె నో
నాక నివాసులార! యిక నాయొనరించెడి దేమి? యాత్మ బా
ధాకులమయ్యె చక్రకరుఁడా హరి యింతకురాడు చల్లనై
సోకియు నేటి మారుతము సొక్కక నిప్పులకంటె వేఁచెడిన్॥ 438

ఉ॥ ఎంతకుఁ బోక యెక్కువయి యీయిరులున్ జినుకుల్ దహించె భా
కాంతు, సరోజకాంతు, రథకాంతులు కన్పడ వెంతకేని శ్రీ
మంతుఁడు తమ్మికంటి యొక మాటిటురాడు సహించి నిల్చి చిం
తింతును నామనోవ్యథనుఁ దీరుచు వారిఁక మీద నెవ్వరో?॥ 439

చ॥ నిలిచియు నిల్చియున్ గరగి నేదురపిల్లెడు భంగి నింగియున్
గలఁగుచు తానునుం గరగి కార్చెడు చిన్కుల కంటినీరు వేఁ
దొలఁగని నేటిరేయి యిలఁ దొల్లిట కొల్చుపరుండు రామియున్
బలుక దొకింత ఈజగము పండుక నిద్రిలు నేమి చోద్యమో?॥ 440

—♦ఫలశ్రుతి♦—

గీ॥ యోగనిద్రి నుండి యోజించు సామికై
'కురుక' యందలి శఠకోప యోగి
పలుకు నట్టి వేయి పాటల నీపది
యరసి పొర్ధయురెట్లు పరమ పదము?॥

## —•ఐదవ పది•—

ఉ॥ కోమలులార! నాపయిని కోపమదేటికి మీకు? నాదు త
ప్పేమి? *"తిరుక్కు-ఱుంగుడి" నధీశునిఁ గాంచినదాది వాని కెం
దామర కన్నుతోడ నరుణంబగు వాతెఱతోడ శంఖ చ
క్రామల కాంతితోడఁ దిరుఁగాడును నామది దాని యంతటన్॥ 441

మ॥ ననుఁ గోపింపక నామనస్సుఁ గొని కాంచన్ బూనుఁడీ! దక్షిణం
బున శోభిల్లు "తిరుక్కు-ఱుంగుడి"ని తోపుల్ కాళ్లు నాపీట దే
వునిఁ గన్నప్పటి నుండి జన్నిదము, పోవుల్, రొమ్ము శ్రీవత్సమున్
ఘన భూపాళి చతుర్భుజంబు లెటుచన్నన్ దోచు నాముందటన్॥ 442

మ॥ "పనులం జేయదు భ్రాంతయై శిధిల భావంబూనునం" చున్ననున్
జననుర్! మీరునుఁ గోపగింతురు కుభృత్సంకాశ సౌధావళిన్
గనులం దన్పు "తిరుక్కు-ఱుంగుడి" దొరన్ గన్నంత నాకన్నులన్
మనసున్ వీడవు విల్లు, వాలు, గద, కుంభచ్ఛంఖ చక్రంబులున్॥ 443

శా॥ "కన్నీరింకిట నీకు నింకద"ని నన్ గద్దింతురో తల్లి! యే
ను న్నాసామి "తిరుక్కు-ఱుంగుడి" వనానూనస్థలిం గన్న మీ
దన్నవ్యాంబుజ మాల, శీత తులసీ దామంబు, కోటీర ము
ద్య న్నీలాంగము, పంచె, కాంచియును నాదాపుండు నేపాపమో?॥444

మ॥ "దెసలం జూచుచుఁ బొక్కు-చున్నద"ని నన్ దెప్పంగ నేలమ్మ! మీ
రసమున్ గన్న 'తిరుక్కు-ఱుంగు'డిని దేవాధీశుఁ గన్నంత బిం
బ సమానోష్ఠము దీర్ఘసుభ్రువులునుం బ్రాగైన కన్ దమ్ములున్
వసియించున్ గడు పాపచిత్తనగు నాస్వాంతంబుపై నెప్పుడున్॥ 445

మ॥ "మన వంశాలకు మాటఁ దెచ్చు"నని నన్ మాయమ్మ పోనీదు, సో
వను లొప్పారు 'తిరుక్కు-ఱుంగుడి' హరిన్ బద్మాక్షు సేవించు నా

టను గోలెన్ మదిఁ బాయవాతని నిరూఢంబైన నామంబు పెం
పునుఁ గన్దోయి, ఫలారుణోష్ఠము భుజస్ఫూర్తుల్ లసన్మూర్తియున్॥

మ॥ "మన వంశాపయశస్సు హేతువని" నన్ మాతల్లి చూడంగ నీ
దనఘశ్లాఘ్యు "తిరుక్కుఱుంగుడి" యశఃఖ్యాతున్ గనుంగొన్న దా
దిని సాభోగ విభా పరీవాహావృతమై దివ్యంబు శ్రేష్ఠంబునై
కననయ్యెన్ మది వాని రూపమునుఁ జక్రింబున్న తద్ధస్తమున్॥ 447

మ॥ "కమలున్ జేతుల మోమిమిడ్చి"యని యల్గన్ బోకుఁడీ! నీలసా
ధము లొప్పారు 'తిరుక్కుఱుంగుడి' విభున్ దర్శించు తర్వాత త
త్కమలాక్షిద్వయి లేతకెంపు, పెఱుఁదుల్, కాయంబును న్వేణి దీ
ర్ఘములౌ బాహు లదేమి పాప మెదుటన్ గన్పట్టు నాకెప్పుడున్॥ 448

మ॥ "మునుకో నిల్చితి వం"చు నాసకియలున్ బూబోండ్లు కోపింత్రు నూ
తన సౌధాల "తిరుక్కుఱుంగుడి" విభున్ దర్శించు తర్వాత నా
యన దీర్ఘంబగుమౌళి మున్నగు ననంఖ్యాలంకృతుల్ దాల్చి నా
మనసున్ వీడడు శర్కరామృత పయో మాధుర్య ధుర్యాకృతిన్॥ 449

మ॥ "కొనె నీపిల్లొక పెన్నయాస" యని కన్గోనీదు నన్నంబ కుం
దని పేరొందు "తిరుక్కుఱుంగుడి" దొరన్ దర్శించు తర్వాత ది
వ్యనికాయంబులు చేరి కొల్వ విమృతాభామధ్య విద్యోత మూ
ర్తి నటించున్ మదిలోన నాకు నిదియున్ దెల్లంబుగా దొంగ్లకున్॥ 450

—♦ఫలశ్రుతి♦—

చ॥ అరయఁగ రాని వాఁడు నరి హస్తుఁడుఁ సామి 'తిరుక్కుఱుంగు'డీ
శ్వరుఁ డతనిన్ దయం బిలిచి చక్కని కమ్మని పూలఁ గొల్చుచున్
'గురుక' శఠారిచెప్పె హరి గూర్చి సహస్రము దాన నిప్పదిన్
గుఱిగఁ బఠించి వైష్ణవుఁడగున్ వనరాశి పరీత మేదినిన్॥

## —♦ఆరవ పది♦—

ద్వి॥ జలధివృతోర్వికి సృష్టి నేననును
జలధివృతోర్వి చిచ్ఛక్తి నేననును
జలధివృతోర్వి వంచనఁ గొంటిననును
జలధివృతోర్విని వెలినుంతు నను
జలధివృతోర్వి లోపలఁ గొందుననును
జలధివృతోర్వి కీశ్వరుఁ డూనెనొక్కొ?
జలధివృతోర్వి నీచాన చెప్పునది
జలధివృతోర్వి మీసరస నేమందు?॥ 451

ద్వి॥ చదువు చదువు హద్దు స్థానంబననును
చదువు చదువుల రక్షకుఁడ నేననును
చదువు చదువులకు జనకుండ నను
చదువు చదువు నర్థ సారంబననును
చదువు చదువు ఫల సంపత్తి నను
చదువు చదువు లోని సామి పూనెనొకొ?
చదువు చదువుఁ గల సతులార మీకు
చదువుఁ బ్రాయపుఁ గూతు సరణి నేమందు?॥ 452

ద్వి॥ కనఁబడు భూమిలోకము తానెయనును
కనఁబడు నెల్ల యాకసము తాననును
కనఁబడు తేజ మెక్కడిది తాననును
కనఁబడు నీ యెల్ల గాలి తాననును
కనఁబడు నెల్ల సాగరము తాననును
కనఁబడు జలధి సంకాశుఁ డూనెనొకొ?
కనఁబడు లోకులకయి యేమి చెపుదు?
కనఁబడు నాకూతు కజ్జంబులెల్ల॥ 453

ద్వి॥ చేయంగఁ బడు క్రియల్ చిఱుత తానమను
'చేయంగఁ దగియున్న చేతలే న'నును
చేయంగఁ బడి చన్న చెయ్వులే నను
చేయు చేతల ఫలసిద్ధి నాకనును
చేయు వారల నేను చేయింతు నను
చేయు లాక్యులు మీకు చెప్పంగఁ జాల
చెందమ్మికంటి తాఁ జేరెనో యేమొ?
చెందిరవున్ మోవి చెలి చెప్పునిట్లు॥ 454

ద్వి॥ తిరుగు లేకే న క్షితిం బ్రోతుననును
తిరుగు లేకేన్మలఁ దేల్చినా నను
తిరుగులే కసురులఁ దెగటార్తుననును
తిరుగాడి యనిఁ గాచితిని నేవుర సను
తిరుగు లేకబ్ధి మథించినా నను
తిరుగు లేని పయోధి దీప్తుఁ డూనెనొకొ?
తిరుగెఱుంగని మీకుఁ దెల్ప నేముండు?
తిరుగని నా సుపుత్రి వినోదములను? 455

ద్వి॥ గుంపారు వెదురుల కొండ నెత్తితిని
గుంపారు కోడెలఁ గూల్చితి నను
గుంపు దూడల మేపి కొంటినేననును
గుంపులా నాల సాకుదు నేనె యనును
గుంపున్న గొల్లల గురువు నేన నును
గుంపులై సురలెంచు గుణి పూనెనొకో
సమములై విల్గనుఁగ్ జానొప్పు మీకు
సమధను శ్నేత్ర భాషణ లేమిచెప్ప?॥ 456

ద్వి॥ బందుగులగు వారెవరు లేరు నాకు
బందుగు లిట నెల్లవారు నాకనును
బందుగులనుఁ జేయువాఁడ నేననుఁ
బందుగులను మాయఁ బడఁ ద్రోతునను
బందుగులకు నేన బంధుండ ననును
బందుగుల్లేని యాపరుఁ డూనెనొక్కొ?
బందుగుల్మీకు నెప్పగిది చెప్పుదును?
వందురి నాపిల్ల పలుకు పలుకులను?॥ 457

ద్వి॥ ఎన్నంగఁ బడు శివుం డేన యంచనును
ఎన్నంగఁ బడు నల్వ యేన యంచనును
ఎన్నంగఁ బడు సురలెల్ల నేననును
ఎన్నంగఁ బడిన దేవేంద్రుఁ డేనను
ఎన్నంగఁ బడు మునులేనెకా యనును.
ఎన్నంగఁ బడు కృష్ణుడే పూనె నొక్కొ?
ఎన్న లొక్కులు మీకు నేమి చెప్పుదును?
ఎన్నగ నెలఁ దీవ యీపె భావముల॥ 458

ద్వి॥ బెడిదపుఁ బాపమబ్బెడిని నాకనును
బెడిదపుఁ బాపపు విధిని నేననును
బెడిదపుఁ బాప మబ్బింతు నేనను
బెడిదపుఁ బాపము విడిపింతు ననును
బెడిదునిఁ లంక మాపితి నేన యనును
బెడిదు గరుడునెక్కు వెన్నుఁ డూనెనొక్కొ?
బెడిదపు లొక్కులేవిధి మీకుఁ జెపుదు?
బెడి దురాలను కూతు బెడఁదల నెల్ల॥ 459

ద్వి॥ కళలారు దివికి రక్షకుఁడ నేననును
కళలేని యీ నరకము నేన యనును
కళ తనరారు మోక్షము నేన యనును
కళలారు జీవాత్మ కులము నేననును
కళలారు ప్రకృతి యొక్కటి యేన యనును
కళలారు నంబుదాంగకుఁ డూనెనొక్కొ?
కళలారు లౌక్యుల కడ నేమిఁ జెప్పుదు?
కళలొప్పు విరికొప్పుఁ గల కూతు చొప్పు॥ 460

—♦ఫలశ్రుతి♦—

మ॥ సిరికిన్ నేలకు నీళకున్ దయితుఁడౌ శ్రీసాధునిండాయుచున్
కురుకా పూర్వర జేత స్వానుభవమున్ గూఢార్థయుక్తంబుగా
తెలుగంజెప్పిన వేయి పాశురములందీ పైపదిన్ నేర్చువా
రురు కీర్తింగని విష్ణుభక్తులకులం బొందంగ శక్యంబగున్॥

## —♦ఏడవ పది♦—

ఉ॥ నోములు నోచలేదు పదముంగల జ్ఞానములేదు కాని యీ
పైమిముఁ గాసియోప ఫణిపాన్పునఁ బండెదు సామి! భూమిపై
దామరలెల్లధాన్యములు తద్దయుఁ గన్పడు "♦వాన మామలన్"
స్థేమ మొనర్చి వారలటు చేసిన మీకొక లాతి వాఁడనే?॥ 461

ఉ॥ అయ్యెడ నొంద నియ్యెడయు నంద భవత్పద దర్శనేప్సచే
నెయ్యెడఁ జెంద లంకఁ బొలియించిన సామి! శశాంక మండలం
బొయ్యనఁ దాకు వజ్రముల నొప్పెడు మేడల వాన మామలన్
దియ్య మెలర్చు చక్రధర! తేర్చు దయన్ నను నొంటిగానినిన్॥ 462

చ॥ గరుడి సిడంబు చక్రిమది కైదువు నాకమునాడు నీకు పా
ర్థర శుభవర్ణ! నన్నొక పదార్థముఁ జేయుచు నేలుకొంటి ధీ

♦గ్రామ నామము

వరులు శ్రుతి ప్రవీణులగు పల్వురఁ బ్రోచెడు 'వానమామలన్'
దిరమయి యుండి సత్కృపను దీనికి ప్రత్యుపకార మున్నదే?॥ 463

ఉ॥ సాయములేని యేవురను సాకఁగఁ గృత్రిమ యుద్ధ మందునన్
సాయుధులైన నూర్వుర గతాయులఁ జేసితి భూధురీణ! ఆ
మ్నాయ నియామ వర్తులగు మాన్యులు కొల్వఁగ వాన మామలన్
శ్రీయుతి నెక్కి యున్న హరి! నేనెట నిన్ గనుఁగోఁగఁ బిల్చెదన్?॥ 464

చ॥ "వెరవిది" యంచు నేను నినుఁ బిల్చిన వచ్చెదె? యెట్టి శత్రులం
జొఱపడి మాయఁ జేయు మణి సుందరమూర్తివి తావకార్చనా
పరులగు నేలవేల్పులకు వాళిగ వారల వాన మామలన్
గరుణ వసించి యుంటి వది కంటిని నేనును సాధు రక్షకా॥ 465

మ॥ ఇలఁ బైకెత్తిని నేకలీఁడు వయి సామీ! కృష్ణ! వ్యోమేశ! నన్
గల కాలంబు గులాముఁ జేసితివి రంగద్రత్న తేజస్క! తే
నెలు మాకందముఁలొంది చల్లనయి సందీపించు నా వానమా
మల నున్నా వడియందు చేరికొన రమ్మా! కూర్మి పెంపారగన్॥ 466

ఉ॥ వచ్చితి నా మనస్సున నివాసముఁ గొంటివి నిత్యులందు పై
పెచ్చయి యుంటి లోకములఁ బెంచెదు నమ్మవు నయ్య వీవు నిన్
జొచ్చును సప్తలోకములు శ్రోత్రియు లుండెడి వాన మామలన్
హెచ్చగు కీర్తినుంటి నను నెన్నఁడు వీడకు నీకు దాసుఁడన్॥ 467

మ॥ సలలిత నూత్నరత్నమయ సౌధ *"శిరీవర మంగళేశ" ని
చ్చలు కడు దుర్లభుండవగు సామి! బకాసుర హంత! యింద్రియం
బులకునుఁ గట్టి నిన్ను విడిపోవగఁ జేయుదు మాయఁ జేసి నే
దెలిసితి నన్నును న్విషయ తీవ్రతఁ ద్రోసెదె? భక్తవత్సలా!॥ 468

*గ్రామ నామము

చ॥ బకముఖభేది! సాలతరుభంజన! గోవృష సప్తక ప్రశా
సక! కపట ప్రకార! హరి! జాతిమణిప్రభ! జ్ఞానధన్యవై
దిక జనపూర్ణమై చలువఁ దేరు 'శిరీవరమంగళంబు' నన్
జెక చెక లాడుపోఁడ! దయచేయుము నాకును జీవనోన్నతిన్॥ 469

చ॥ చెఱుకులు నెఱ్ఱధాన్యములు చెల్వగు చల్లని 'వాన మూమల'న్
బరిమళ రమ్యమౌ తులసి మాళి ధరించిన దేవ దేవ! నా
శరణుగ నీదు పాదము లొసంగితి వప్పుడు దీని మూఱు చె
య్యరయను దేని నేగతిని నాత్మయె నాయది నీది మాధవా!॥ 470

—♦ఫలశ్రుతి♦—

చ॥ హరిని సురాధి నాథుసకలాప్తుఁ ద్రివిక్రముగూర్చి పుష్ప సుం
దర 'కురుకా' పురస్థుఁడగు తచ్ఛఠవైరి రచించు వేయి పా
శురముల 'వానమామల'కు శోభ యొనర్ప వచించు నిప్పదిన్
బరతఁ బఠించు వారమృతభంగి హితుల్ పరదేవతాళికిన్॥

—♦ఎనిమిదవ పది♦—

ఉ॥ నామెఱు నీమెఱున్ గరగి న్నగ్గడలాజని నల్లఁ జేసి తో
సామి! సుధాభిరాము! వరి సాగుల నెఱ్ఱనివడ్ల యెచ్చులున్
జామరలల్లు పీవ, జలసంపద నొంచు ♦'తిరుక్కు-డంద' శో
భామయ భూమల న్వెలసి పండుక యుండగ నిన్నుఁ గాంచితిన్॥ 471

శా॥ సామీ! నా పరిశుద్ధమూర్తి! హరి! స్వేచ్ఛా సంగృహీతోద్భ వో
గ్రామా! పుంగవ! యెఱ్ఱతామరల యందంబొందు కోనేళ్ల నా
రామాలొప్పు 'తిరుక్కు-డంద' నగరిన్ రాజీవ నేత్రద్వయం
బేమో మూసుక నిద్రచేసెదవు నే నింకేమిఁ జేతున్ బతీ!॥ 472

ఉ॥ ఏమొనరింతు నేను? గతియెవ్వరు? నన్నును నేమిఁ జేయుదో
సామి? నీను న్వినా పెరల సాయముఁ గోరను రాగికోట చు

♦గ్రామ నామము

ట్టోము తిరుక్కుడంద శయమొందితి దాసుని యాత్మకీవు గా
రా మొనరించుదాక యిడరాదె త్వదీయపదాంతిక స్థితిన్?॥ 473

చ॥ నిగిడెడు బుద్ధిమంతులు గణించు కొలందిని మీరు కీరితిన్
నెగడెడు నచ్యుతా! జగతి నీకును శేషము; యేకమూర్తి! కూ
ర్మిఁ గొను 'తిరుక్కుడంద' నిదురించెదు నేనినుఁ గాంచవేగి నె
వ్వగ మదితూల నాకసము వంకఁ గనుంగొని యేడ్చి మ్రొక్కుదున్॥

మ॥ కడు నేడ్తున్, గయిమోడ్తు, స డి కనుదున్, గానంబుతో నార్తు బ
ల్విడి నన్ బట్టిన చెట్టయేమొ? దెసలన్వీక్షించి నాయాదలన్
బిడియంబొందుచు వంతు నీటివసతిన్ బెంపౌ "కుడందన్" బడ
ల్పడి నిద్రింతువు నీపదాప్తిఁ గనుత్రోవం జెప్ప వబ్జేక్షణా!॥ 475

చ॥ వరలు ననాదికీర్తిఁ గల వైష్ణవులుండు 'కుడంద' బండు ధీ
వర! సురనాథ! జ్ఞానఫల! వైణికగాన సమానరమ్య! నీ
చరణముఁ జేర్చు కీలెఱుఁగ జాలియు నింద్రియవాంఛఁ జిక్కి నిన్
దొఱఁగుట యెన్నినాళ్ల? ఘముఁ ద్రుంచి నినుంగను మేలు నెంచుమీ॥

మ॥ పురుషశ్రేష్ఠ! హిరణ్యతేజ! యరుణాంభోజాక్ష! యబ్దాంగ! ప్ర
స్ఫురదగ్ని ప్రతిమ ప్రవాళ కుధరస్ఫూర్తీ! చతుర్బాహు సుం
దర! మత్స్వామి! కృపాగృహీత నతకైంకర్యా! 'కుడందా' పురీ
శ్వర! నిన్బాయఁగనోప చేరఁ గొని నాజన్మంబుఁ బోఁగొట్టవే॥ 477

శా॥ చుట్టానోమ్ముల చట్రమూను హరి! నా క్షోభంబుఁ బోఁగొట్టు పో
గొట్టన్నాత్మను 'కుడంద'శాయి! పెరదిక్కున్ బొంద నాబొందెకున్
బట్టుల్ జారఁగ జీవిపోవు నెడ మేడ్పాటొంద కేకాగ్రతన్
బట్టన్నీవిడక నీపదాలె కొలువన్ భావింపు మాయామయా!॥ 478

శా॥ నన్నుంజేకొని స్వీయ పాదముల క్రిందన్ నిల్పుదోస్వామి! శ
శ్వన్నాకేశులకున్ దలారివి, జగత్సర్వస్వము న్నీది, శో

భన్ నల్దిక్కులఁ జల్లు రత్నములకున్ బట్టా 'కుడంద'న్ సుగం
బున్నావశ్రమ, లోకమెంచికొన రావో? నేను సేవింపఁగన్॥ 479

శా॥ రాకున్నా వరుదైనవాఁడ! మది బేరంబాడు మాయాఢ్య! మా
యా కాలుష్య విహీనమూర్తి! యమృతాభా! యంతరంగప్రియా
నాకుం బోని యఘమ్ము నూపితి 'కుడందా'వాస నీదాసుఁడన్
గా కన్యుండనె? నేనుకూడ తిరుగంగాఁ గూడునే యక్కటా'॥ 480

## —♦తొమ్మిదవ పది♦—

మ॥ హరిణీ లోచనలార! పాపినయి నిత్యంబేనుఁ జింతింతు నం
బరమున్ డీకొను పోక క్రముఁకులు, వనుల్, మల్లెల్, పువ్వుందేనెలన్
గరమొప్పా *"తిరువల్లవాడ" తన యిక్కన్ జేసికొన్నట్టి శ్రీ
హరి పాదంబులు నాకు దాస్యమున డాయంగల్గు నేనాఁడొకో?॥ 481

మ॥ బలిమి న్నిల్పెదరేమి లేమలు ననున్? బంగారు రంగారు తే
కుల పొన్నల్, పొగడల్, హసంతులును తాకుల్ జేయు లేలేత గా
డ్పుల నొప్పా 'తిరువల్లవాడ'ఁ గల మాపున్నాగు పాదాంబుజం
బుల ధూళిన్ దలఁ దాల్చు టెన్నఁడొకొ? నాబోంట్లైన భృత్యాళికిన్॥

మ॥ సుమవేణుల్! దురదృష్ట మెట్టిదో ననున్ స్రుక్కించెదున్ సామగా
నము లేతెంచెను వెల్లిహోరువలె చెంతన్ లేచె నీహారామ ధూ
మము నెత్తావులతోడ నిట్టి సుఖసీమన్ 'వల్లవాడ'న్ నివా
సముఁ జేకొన్న రమేశు పాదములు నిచ్చల్గొల్వఁగా వచ్చునే?॥ 483

మ॥ చెలులింకేటికి నన్ను వేపెదరు? నాచిత్తంబుఁ దాఁ బచ్చయా
కుల పోకల్, కదళీవనాలు, పనసల్; గుంపున్న టెంకాయ చె
ట్టులు సౌధంబులఁ గప్ప చల్లనగు పట్టన్ 'వల్లవాడన్'; విసం
బులఁ బైగ్రిక్కొను చిల్వ పాన్పుపయి వేల్పుం, గొల్చుఁ దద్వశ్యమై॥

మ॥ చెలులారా! వరవైదిక క్రతు కృతిన్ జేకూఱు ధూమంబు క
జ్జల వర్ణంబున లేచి నింగి నలమన్ జల్లైన 'శ్రీవల్లవా
డ' లలిన్ జొప్పిలు పిప్పి లేని చెఱుకై డాల్ క్రాలు పంటై సుధో
జ్వల భోగ్యుండగు నామనోహరుని నిచ్చల్ గాంచుటేనాటికో?॥ 485

మ॥ నవ బింబాధరలార! భృంగముల ఝుంకారంబు, శీతానిలం
బు, వివృద్ధోన్నత శాఖలై తరులు, తోపుల్, గ్రాలు "శ్రీవల్లవా
డ, వటుండై చిఱిమేని సొంపలరు దంటం జేరి నిర్భిన్న ప
ద్మ విధంబొప్పెడు, వాని పాదముల సందర్శించు టేనాటికో?॥ 486

మ॥ చెలులారా! "తిరువల్లవాడ" ప్రజలా స్త్రీలొందు నెమ్మోమ్ము ల
క్ష్ములునుంబోలగ వెల్గిఁ బోలి వెడదా కోనేటిలోఁ బుట్టు త
మ్ములు చెంగల్వలు నొప్పు నప్పురమునన్ భూమండల గ్రాహి, మా
కులదైవంబు పదాలు నిచ్చ విరులన్ గొల్వంజనం గల్గునే?॥ 487

మ॥ రమణీయాననలార! పంటమొగస్సై రాజిల్లు ధాన్యంబుఁ, ది
య్యముఁగా నాటకు సిద్ధమైన చెఱుకుల్, ధ్యామస్థలుల్ పుష్ప వా
తములా చెఱ్వులునున్ బొలాలుఁ గల శీతంబైన "శ్రీవల్లవా
డ" ముదంబారు త్రివిక్రమేశు పదముల్ డాయంగ నౌనో? సదా॥488

మ॥ శీతోద్యాన మధుప్రపాన జనితోత్సేకంబునన్ దేంట్లు వీ
ణా తంత్రీస్వన వేణునాదముల కన్నన్ మిన్నఁగా బాడగా
పూతంబౌ 'తిరువల్లవాడ'ఁ గల దేవున్ సంభ్రమచ్ఛక్రు ముం
జేతుల్ జాఱిన కంకణాలు బిగియన్ జేమోడ్చఁగాఁ గల్గునే?॥ 489

మ॥ చెలులారా! తననైజమౌకృప జనుల్; జేజేల్, గనన్ సత్కృపా
ఖులు వేయుం బుధులుగ్గడించు 'తిరువల్లూర'న్ నివాసించు ను
జ్వలు నారాయణదేవు నామముల తచ్ఛశ్వత్కృపాలబ్ధ ని
ర్మల భావంబున మాకుఁ జెప్పనగునో? మానోము సాఫల్యమై॥ 490

## —•పదియవ పది•—

మ॥ జననోదంతము, బెన్నువింతయుఁ, గురుస్థానంబునం దాలమం
దున నేర్పాటులఁ జేసి పాండవుల కెత్తుల్ నేర్పుటల్, పోకయున్
మునుగా మాయలు మర్మముల్ దొలిచిచంపున్ బోక నాయాత్మ మో
హన తేజోజ్వల! కృష్ణ! నీయడుఁగు డాయంగల్గు టింకెన్నఁడో?॥ 491

మ॥ ఎలనాగన్ గొన నెడ్లఁ ద్రుంచుటయు మాయిన్ గేశి మాయించు ట
వ్వల పూఁదేనియలొప్పు కొప్పుఁ గల గోపస్త్రీలతో నాడి కే
ల్గలుపన్నేర్చుట దీని దాని నన నేలా? యన్ని నీచేతలున్
గలఁచున్ నన్ను జగత్ప్రధాన! నినుఁ గాంచం గల్గునో? యెన్నఁడే?॥492

మ॥ ననల న్వేణిని ముడ్చి ముగ్ధవలె చన్ ద్రావించు మాయావి పూ
తన శిక్షించిన తెల్వి లే యెఱుపు పాదంబెత్తుచున్ బండిఁ ద
న్నిన నీ చిన్నితనంపుచేవ, నెయికై నీయమ్మ బెత్తెత్త భీ
తిని కన్నీర్విడులీల వచ్చి మదిలో తీండ్రించు నాకెప్పుడున్॥ 493

మ॥ కృతకాకారముతోఁ బురత్రయముఁ బూనిక్రం జొచ్చి చన్వచ్చి దై
త్యతతి స్వాంత విభేదకుండవయి మాయన్జేయు నీమాయ; యా
యత గంగన్ జడఁ దాల్చు రుద్రుఁడును నీయందొండు గాకుండు టి
క్కత లుల్లంబునఁ జొచ్చి యాత్మ కరఁగన్ గారించు నన్నెప్పుడున్॥494

మ॥ అమరేంద్రార్థ ముపార మిచ్చుటకుగా నాభీరులున్ బెట్ట న
న్నముఁ దా మ్రింగిన రంగు రంగులమలన్ బైకెత్తి వర్షంబు లా
పె మహిన్ మున్ను సృజించి మ్రింగియుమిసెన్ బైఁదీసెఁ గొల్పాన్ వహిం
చె మది న్నీవని నిల్చి యెంచఁ గరగించెన్వహ్ని లక్కన్ వలెన్॥ 495

చ॥ నిలుచుట కూరుచుంట శయినించుట యెంచగలే ననేక భం
గులవి త్వదీయ మాయలు నగోచరముల్ పోరి నిల్పి యెంతు ను
జ్వల! జగమెల్ల లోనఁ గొను సామిని నిన్నెటు లెంచ నేర్తునో
పలుకఁగదయ్య దీనికి నుపాయముగల్గిన నాకు, పాపికిన్॥ 496

శా॥ ఉన్నావన్న మహోజ్జ్వలుండవయి నీవున్నట్టి చందమ్ము, లే
కున్నావన్న మహాంధకారమటు లీవున్నట్టి చందమ్ము, రా
కన్నాకన్నులఁ జ్రాముచెయ్వి, మదిలోఁ గన్గొంచు దుఃఖింతు న
స్మన్నీలాంగ! త్వదంగ మొక్కటతఁ గాంచం గూర్పు నాకంటికిన్॥ 497

మ॥ నడిసంద్రంబునఁ బవ్వళింతు నెఱిమేనన్; బొడ్డుచూలిన్ జొఱం
బడి సృష్టించెద వీడులేని పనులొప్పన్నీవ యేకైక నే
తృఁడవై యుందు విన న్నీవ న్మనసు కుందెన్ బాష్పముల్ కన్నులన్
బడి కాల్వల్వలె పాఱు నీయడియఁ డబ్బా! యేమిఁ జేయందగున్?॥498

మ॥ అడుఁగుల్ మూఁడిఁటి నడ్గు టాదట, నగాధాబ్ధిన్, ధరన్, నింగి రెం
డడుఁగుల్ గా నిమిడించు శక్తి మునుగా వ్యాపారముల్ చెప్పఁగా
బడవిన్నప్పుడు నామనస్సు చను నీపై నార్ద్రమై పొక్కు నె
ప్పుడు నిన్ గూడఁగఁ గూడు? క్రూరుఁడను పాపుండన్ గదా మాధవా॥

ఉ॥ చేరి సముద్రముం జిలికి జేజెలకున్ సుధ భుక్తిఁ జేయ దే
వారుల నొత్తిగించిన యుపాయము, మాయము, లోనఁ జేరి కం
గారొనరించి యాత్మనుఁ దినంగొనె భూరి విషోద్వమత్పవా
హార శయాన! నీపదమునందు విధంబును నాకుఁ జెప్పుమా॥ 500









# శఠకోపగీతామృతము.

## ఆరవశతకము

—♦మొదటి పది♦—

మ॥ నిరతం బొప్పగు నుప్పుతేట మెసవన్ దిగ్గాడు నీర్కోళ్లు! మేల్
వరి సస్యమ్ము పొలాల నిండు *"తిరువణ్వండూరు" నందుండు వాఁ
డరుణోష్ఠుండు కరస్థ చక్రుఁడగు దేవాధీశుఁ బ్రాణేశు నా
హరిఁ గన్నం గయిమోడ్చి పాపినగు నాయారాటముం జెప్పరే?॥ 501

మ॥ అనురక్తంబునుఁ గోమలంబయిన జాయన్మేపుదో, నల్లనా
రణపక్షీ! శ్రుతిగాన యాగరవ సంరంభంబుతోఁ జల్లనౌ
'వణవండూరు' ననుంచు గ్రస్త నిఖిల బ్రహ్మాండు నస్మత్పతిన్
గని తత్పాదము మ్రొక్కి నాదయిన దుఃఖంబెల్లఁ బల్కం గదే!॥502

మ॥ గుములై యెల్లపొలాలలో మెలఁగు పల్కోటాన కోళ్లా విహం
గములారా! చెలువెన్నఁ దగ్గ "తిరువణ్వండూరు" నందుండు దై
వము, విశ్వేశు, భ్రమత్సుదర్శనకరున్ భవ్యారుణోష్ఠున్ మద
ర్థము సేవించి వినమ్రులై యొదిగి నాతాపంబులన్ జెప్పరే?॥ 503

మ॥ ఎడఁ బాపోపని పొందున న్మనిగి హాయి న్మేయు హంసాళి! పొ
న్పడ కామ్నాయ రవంబు జెల్లు "తిరువణ్వండూరు" వాఁడబ్ధి కై
వడి మైవాఁడు నిజాశ్రిత ప్రియుఁడుఁ దద్వశ్యుండు నాసాక్షి క
న్పడినం గాంచి "యొకర్తు నీకునయి కుందం గందు మం"చాడరే॥ 504

*గ్రామనామము

మ॥ పొలయలుకల్ సవరించు నేర్పొలసి పూవుంబోండ్లతో మేయు నం
చలు! సంకుల్ గల బాడువల్వలయు 'వణ్వాండూరు' వా డుజ్వల
త్తులసీమాలిక మాళికిం దొడఁగు నాథుండాతనిం జూచి చే
తుల జోడించుచు నన్ను గూరిచియు సాధుప్రార్థనల్ జేయుఁడీ॥ 505

శా॥ పున్నాగంబుల మీది కోకిలలు! మిమ్ముంగొల్చి యాచింతు నా
పన్నన్; మీలు పొలాల మిట్టిపడు 'వణ్వాండూరు' నందున్న సా
మిన్నాకేశు, గృపాత్తచక్రికరు నెమ్మింజూచి నాభ్రాంతి తీ
రన్నా కొక్క ప్రకారమా బదులు వార్తన్ దెచ్చి రక్షింపుఁడా॥ 506

మ॥ పొలుపుం జిల్కరో! జట్టిఁ బెట్టు కొమరుం బూఁదోట లంభోధి ది
బ్బలకున్ జేవురు చాయఁ జేయు 'తిరువణ్వాండూరు' నంటక ని
శ్చలతం జొచ్చి వినీలవర్ణ మరుణోష్ఠం బెత్తునా కన్నులు
జ్వల చక్రాదులుఁ బొల్చు వానిఁగని నాచందంబు జెప్పంగదే॥ 507

మ॥ పొలుపౌ లేవడి చిల్కరో! వకుళముల్ పున్నాగముల్ సర్గముల్
బలమౌ మద్దులుఁ జల్వలీను 'తిరువణ్వాండూరు' నందుండు శీ
తల పద్మాయతనేత్రు, భూరిభుజు, నుద్యన్మౌళి, శీతాసితో
జ్వల మేఘాంగుని సామినిం గనుచు నాజాడొక్క మాటాడుమీ॥ 508

మ॥ అలరుం గుత్తులమీద వర్తిలెడు రాయంచల్! ప్రభాతంబు నం
దలి శంఖధ్వని దందడించు "తిరువణ్వాండూరు"నన్ గూరిరు మా
యల కృష్ణున్, మహిమాఢ్యు జూచి చరణాలత్యంతమున్ మ్రొక్కి పెన్
గలుషంబుల్గల నా విషాదమును నేకాంతంబునం జెప్పుడీ॥ 509

మ॥ వనతావృల్గొను తేంట్లు! మిమ్ము నుతులన్ యాచింతు నచ్చాంబు పా
వన పంపానది కుత్తరంబుఁగను "వణ్వాండూరు" నందీడు గా
నని యోధుండగు దైత్యకోటి నివురుంగాఁ జేసి మోదించు వ
గన శౌర్యుండగు వాని కేసన నొకరం గలిగి శాసింపుఁడీ॥ 510

## — రెండవ పది —

మ॥ మెఱుపుం గానుల సానుతాచుఁ గడు కూర్మిన్నించు నీవారి ముం
దఱ నీనొచ్చుటకేనుఁ గొంకుదు సమర్థత్వమ్మెప లంకాపురీ
హర! మాయుండ! యెఱుంగవచ్చె భవదీయంబైన కాపట్య మా
తెఱఁ గింకొప్పగు గచ్చకాయలను బంతిన్ నావి నాకిచ్చిపో॥ 511

మ॥ పరిపూర్ణుండవు పోర! నీదు నయనాబ్జాతంబులుం గెంపు నా
తెఱపైఁ జిల్కెడు మొల్క నవ్వులలఁచం దీల్పావెటు మానోత పె
న్నెఱి కొప్పుం బసలొప్పు గొప్ప నవలాల్ నీకూర్మిఁ గైకొండ్రు వే
ఱు రవంబూదర! యాలదవ్వనిచి, వించున్ లేచి రాకుండురే?॥ 512

మ॥ పరమాభోగ! పయోధిఁ జిల్కితివి నీ భవ్యానురాగార్హలై
యురు వంశాయత బాహురమ్యలెవరో యుండ్రాడకుం బొమ్ము గొం
కరి వాకుల్ పచరింపు బేలలగు నా కన్యాళికిన్ నీకనుల్,
పరువుం బింబపు మోవి, లాతివిత మేలా? వాడె నీనాడయో?॥ 513

శా॥ ఆనాడేడు జగాల మ్రింగి వటపత్రాకల్ప్య తల్పుండ వై
తే? నీమాయలు వేల్పులే యెఱుఁగ రింకేమాడ్కి నేనేర్తురా?
చానల్ విగ్గనుఁ బోలు కన్నులను నిచ్చల్ గూడు తత్సైకత
స్థానిం జుట్టిరె యాల మేపెదవు నీ జంభాలు చాలింపరా॥ 514

శా॥ టూలా టోలి కబుర్లఁ కేమిటికి? ప్రోడా! నీదు టాటోటులన్
భూలోకంబు దివంబెఱుంగు నెఱయన్ బ్రోద్దామ చక్రంబు నీ
కేలం ద్రిప్పుదువాక్క మాటవిను నీ క్రేఁ గన్నులం గన్న మ
ధ్వాలాపల్ హృది నొత్తురంటకు మదీయాలాపవత్కరముల్॥ 515

మ॥ బెళుకుల్ జేసితి బొమ్మలాగితివి, నీపేచీల నేమారర? నీ
చెలిమిం గంటిమె యిట్టితీరు కృప మాచెంతేల? ముల్లోకముల్

లలి నేలందగు నందకత్తియలు చాలన్ లేరె? సంపూర్ణ! యీ
వల మాగోష్టిని నీవు పైకొనకు మల్పాలిట్టి వ్యాపారముల్॥ 516

శా॥ మా కేలం గల బొమ్మదొంగిలుట ధర్మంబయ్య? భూభోగి వ
స్త్రోకా! నిర్మల! తప్పు తప్పుగుర! మాగూఢోక్తిఁ బైఁబెట్టుటే
నీకుం గ్రీడయొ? నాదు సోదరులె దానిన్విన్న ధర్మంబొ, కా
దో కించిత్తును నెంచకేయుదురు బెత్తుం గొంచు నన్నయ్యెడన్॥ 517

శా॥ ఏరిన్ వేనిని లోనఁ జేర్చికొని వేఁడే పెట్టి సృష్టించు సం
సారాస్పృష్టుఁడ, వద్వితీయుఁడ, వసంఖ్యాతామృత ఖ్యాతు లో
ప్పారన్, జ్ఞానవిభాకృతి న్వెలుఁగు దయ్యా! నెయ్యరుల్ బిల్వ నీ
యోరన్ వచ్చితి మడ్డుకోకు జగమేమో? యేమొ? కల్పింపదే?॥ 518

మ॥ అనురాగమ్మున డెందముల్ జెదర నీయజ్జేక్షణా పాంగ జా
ల నిబద్ధాత్మలఁ జేయ మాయిసుకఁ గూంల్లం జిన్ని తిన్బండముల్
గని మోదారగ నవ్వి నిల్వక పడంగాఁ గొట్టినా వక్కలన్
జను నే? నీకిది? నీకునింతయుఁ గృపా సంపత్తి లేకున్నదే?॥ 519

చ॥ నిలిచి వెలుంగు మాళిఁ గల నిర్మల! ఇర్వదియొక్క మార్లు రా
జులఁ బొరిఁ గొన్న దీర్ఘ పరశుప్రధనాయుధ! విశ్వకర్త! గో
కులము తరించు నట్లిపుడు కొంటివి జన్మము కృష్ణ రత్న పే
శల! కడగండ్లు నీవలన జాలగ మాకిట వచ్చె నిచ్చలున్॥ 520

## —♦మూడవ పది♦—

చ॥ కలిమియు లేమి, స్వర్గ నరకంబులునై, జయమొందు ద్వేషముం
జెలిమి, విషామృతంబులయి, చిత్రవిధంబుల నిండియున్న యు
జ్వల! ననుదాసుఁ జేసితివి సామి! ధనాఢ్య సుధీ కుటుంబముల్
వెలసిన పుణ్యసీమ ♦"తిరువిణ్ణక"రన్ బురి నిన్నుఁ గాంచితిన్॥ 521

♦గ్రామ నామము

చ॥ కన నగు దుఃఖ సౌఖ్యములుఁ గష్టితచిత్తముఁ దుష్టిచిత్తమున్
ఘనమగు కోపముం దయయుఁ గానయి, నిప్పును నీరమహాచుఁ గ
న్గొనఁ బడకున్న వేల్పు తనకొల్వున సేవకుజేసె నన్ను పృ
ధ్వని విమలాంబు సంపదల 'విణ్ణకర'న్ బురి వాఁడు వాసిలున్॥ 522

చ॥ పురమును దేశమున్ దెలివి మూఢత; తా, నయి యీడు లేనటుల్
విరియు ప్రకాశమూర్తి యయి, పృథ్వి దివంబులు నైనవాడు కా
పురమయి యుండు కొండలను బోలిన యిండుల నిండు 'విణ్ణకర్'
పురి హారి కీర్తియొక్కటియె ప్రోచెడుఁ జక్కటి మానవాళికిన్॥ 523

చ॥ పొరసెడు పుణ్య పాపముల భోగ వియోగములందు జ్ఞప్తివి
స్మరణము లందు నిండి సదసద్విధ వస్తువులందు నుండి దో
షరహితుఁడైన కృష్ణు, ఘనసౌధ లసత్ 'తిరువిణ్ణకర్' పురీ
వరపతి కూర్మి భోగ్యమయి వర్ధిలు కైతవముండదీ నుడిన్॥ 524

చ॥ ఘన సురకోటి తోడి త్రిజగమ్ములుఁ గైతవమార్జవంబు న
ల్పునుఁదెలు పైనవాడు ఋజువున్, మృష, బాల్యము వార్ధకంబు నూ
తనమునుఁ బ్రాక్తనంబయిన దైవమువాడె ప్రదీప్ర వప్ర జృం
భణ 'తిరువిణ్ణకర్' పుర నివాసు డొనర్చిన తోట సృష్టియున్॥ 525

చ॥ భువనముఁ దత్పరంబునయి పొల్చి యనుగ్రహా నిగ్రహాలు మా
ధవియును జ్యేష్ఠ తానెయయి తారొక్కను కీర్త్య పకీర్తులాచు శ్రీ
ధవుఁడు సురార్చనీయుఁ డయి తాఁ 'దిరువిణ్ణక'రాఖ్యసీమ నుం
డు; వితతకాంతితో వెలిగెడుం బతితంబగు నా మనస్సునన్॥ 526

చ॥ పరమ విశ్రామయంబయిన పావనరూపము ఘోరదోష దు
ర్భరమగు రూపముం బొరసి పొల్పడకుండియుఁ బుట్టి తిర్గి వం
శర పనులం బొనర్చు హారి నాకులు సాగిలిమ్రొక్క 'విణ్ణకర్'
పుర నివసించె తచ్చరణముల్ శరణంబగు సేరి కేశతన్॥ 527

చ॥ అమరులఁ బ్రోచుతావు దనుజాళికిమృత్యువు నైనవాఁడు లో
కముఁ దన యగ్ఘునీడలనుఁ గాచుచుఁ గావనివాఁడు దక్షిణా
శ, మనుచు 'విణ్ణకర్' పురిని సాధువశుండయి యున్నవాఁడు ని
త్యము నుపకారకుండు నను దాసునిఁ జేసెను నాకు పోష్టయై॥ 528

శా॥ నాకుం దల్లియుఁ దండ్రి యాలి యగుచున్ నా హేమమాణిక్య ము
క్తా కల్పుండగు సామియై మెఱుఁగు బంగారంపు ప్రాకార మొ
ప్పై కన్పట్టెడు 'విణ్ణకర్' పురిని నిత్యంబుండు నీశుం డసా
మ్యాకారుం డిడు నాకు నాశ్రయము స్వీయాంఘ్రిద్వయ చ్ఛాయలన్॥

చ॥ అణువు, మహత్తు, ఛాయయును, నాతపముం జరమున్ స్థిరంబునున్
గనఁ బడు హ్రస్వదీర్ఘము లొకండగు తా,నయి వాని భిన్నుఁడై
పెనఁగొను తేంట్లు పాడు 'తిరువిణ్ణకరన్' బురిలోననున్న వె
న్నుని చరణాల కన్ననుఁ గనుంగొన మొండొక ప్రాపు నారయన్॥ 530

## —నాల్గవ పది—

శా॥ కేళీలీలల గోప బాలికలతోఁ గేల్గల్పు టేకాదిఁ గెం
గేలం దాల్చుట దుర్విష హ్రదఫణిం గీడ్పర్చుటే మున్నుగా
జాలం గ్రాలెడు శేషతల్పు హరి యాశ్చర్యంబు లగ్గించి స
త్కాలక్షేప మొనర్తు రేఁబవలు నాకన్ నాకు లోటున్నదే?॥ 531

శా॥ ఆలం గాచుట వేణుగాన సుధ నూటాడించు టాలోల దృగ్
జాలన్; రాధఁ బ్రసూనవేణిని భుజా సంశ్లిష్టఁ గావించుటే
లీలల్, తక్కిన మాయలొప్పు వనమాలిం దల్చి యార్ద్రుండనై
హేలం గాలముఁ బుచ్చువాఁడ నగునాకీడేది లోకంబులన్?॥ 532

చ॥ అనుపమ మల్లురన్ బొడుచు టావుల మేపుట కొండవంటి యే
న్గునుఁ బొరిఁ గొంట, మున్నగు పనుల్ మఱి తక్కిన చెయ్వు లుజ్జ్వలా

భువి హరిచర్య లెంచి క్రమముం గమనింపకె పల్కి నిచ్చలా
యనుభవయుక్తిఁ గాలమెడయంగను నాకొక దుఃఖమున్నదే?॥ 533

ఉ॥ నొవ్వగఁ దల్లి రోలునకునుం బిగిఁ గట్ట భయంబుగొంట దా
దవ్వుల నుండి వచ్చి చనుఁ ద్రాపిన పూతనఁ జంపి యుంటయున్
ద్రెవ్వగ బండిఁ బూచి నెదిరించుట మున్నగు దివ్య చెయ్వులన్
ద్రివ్వి తలంచి నీరయిన నాకులె కూడె నికేమిఁ గోరుదున్?॥ 534

మ॥ అమరుల్వేడగ నిచ్చ వచ్చి జననంబై తల్లి తన్ గూర్చి కు
ష్టముఁ గావింపగఁ దేర్చి పెన్నిరుల జాడన్ బోయి వ్రేపల్లె కూ
టమునం జొచ్చి, రహస్యతన్ బెరిగి దిట్టం గంసు ధ్వంసించు చో
ద్యము నిచ్చోఁ గన నయ్యె నాకు నిఁక చింతల్ గిరత లేముం గెడిన్॥ 535

మ। కలశన్ గొంగను మాపె మూపురములం గ్రైన యెద్దన్ వడిన్
నలుగం గొట్టె విశాలశాఖి, గురుగింజం గుంజె నిత్యాది మా
యల గావించిన యాత్మవిక్రముని చర్యల్ రేఁబవల్ చాటఁగా
గలిఁగెన్ నాకు మఱేమి దుఃఖము మనోగారంబు నందుండెడున్?॥ 536

చ॥ మనసురియాడ మూఢమగు మానవజాతిని స్వానుకూల మూ
ర్తినిఁ గొని పుట్టె తానె తన రేగెడు కోపముఁ దీర్చుకొన్న పా
వన తులసీ విభూషితుని స్వామిని తచ్చరితంబు నెంచు నె
మ్మనమె కల్గె నాకు నిఁక మాఱుకలాడె? విశాలమేదినిన్?॥ 537

చ॥ పరపగు నేల వారును, నభశ్చరు లచ్చెఱువొంద నిండుఁ బెం
దురమున బాణు వే బుజలుఁ ద్రుంచుట మున్నగు పల్వితంబులా
ధరణినిఁ గొల్చు మాణవకు దండితనంబులఁ గాంచు నుల్లమున్
బొరసితి నిట్టి నన్ గదియఁ బోవునె? యజ్ఞత యెట్టిదేనియున్?॥ 538

ఉ॥ ఏడు సముద్రముల్ గ్గడచి యేడుకులాద్రులు నేడులోకముల్
తోడన దాటుచున్ రథము దూకుడునంగొని గమ్యమందె నీ

వేడుక లాడి శ్యాములుని విష్ణుఁ గరాంచిత శంఖ చక్రునిన్
వేడుకపర్చు నాలుకఁ గల పీరు.డ నాకెదు రెవ్వ రీధరన్?॥ 539

ఉ॥ పంట వెలంది వేగిగుడుప భారతయుద్ధముఁ బన్ని మాయ ల
న్నింటనుఁ బూన్చి శాత్రవుల నీల్గసడంచి దివిం గ్రహించి తా
నొంటి స్వకీయ తేజమున నొందిన భాస్వరరూపు శ్రీపదా
లంటి మనంగఁ గాంచిని నియామకు లేరను లేరు నాకిఁకన్॥ 540

—♦ఫలశ్రుతి♦—

చ॥ నెఱిఁదగు నేడులోకముల నేతయి వాతను నేడులోకముల్
బొరిఁగొని యుమ్మి తానె జగముల్గ బయల్పడి లోకదోషముల్
పొరయని కేశవుం బొగడఁ బూని శఠారి వచించు వేయిటన్
బరఁగెడు నీపదిన్ జగావఁ బాపమువాసి సుఖింతు రీ భక్తులై॥

—♦ఐదవ పది♦—

మ॥ వెలసుల్! నిర్మల రత్నసుందిరములన్ బెంపొ♦♦♦“తుల్లైవిల్లిమం
గలము”న్ బొందిన యీపెయాస విడుఁడింకన్ “దెల్లనౌసంకు, ను
జ్వల చక్రంబ”ని, “తమ్మికన్నుల”ని కల్వల్ చెల్వు చెల్వారు క
న్నుల నీరంబుల నించుచుం గుములుచున్ నూఱారు వాపోయెడున్॥541

మ॥ పలుఘోషల్ గుమిమోగ్రియ సంబరము లొప్పంగన్ ‘దుల్లైవిల్లిమం
గలము’ం జేర్చి సుధారసోక్తిఁ గల యిక్కన్నెన్ నిరాశాగతిన్
దొలఁగం బూనిరె? ఈపెస్తబ్దయయి నాథున్ దేవ దేవా యనున్
జలితోష్ఠంబున బాష్ప నేత్రమున మూర్ఛన్ బొంది కుందుంజుఁడీ॥ 542

మ॥ పలుపెన్ దోటల యేటిగట్లఁ గొలఁకుల్ బాగా ‘తుల్లైవిల్లిమం
గలము’ం జేరిచి మంజు వాగ్వినుత నికాంతన్ విసర్జించి రా
సలుఁ జెల్లంగనటమ్మ? వార్ధిశయనున్ ఝమ్మచక్రి వికాంతు గో
కుల నేతం దలపోసి యీపె విపులాశ్రుల్ నీరునన్నింపెడున్॥ 543

♦♦♦గ్రామ నామము

మ॥ నలు వేదాల నెలర్చు బ్రాహ్మణుల స్థానంబౌ 'తుల్లైవిల్లిమం
గలము'ం జూచి యొకింతయుం గుదురులేకన్ బోయె నోయమ్మ! యీ
చెలి తిక్కంం గనరమ్మ! నేర్చెఁ బలుకుల్ "శ్రీకృష్ణ! వార్ధ్యాభ! శ్యా
మల!" యంచున్ బిడియంబు డించి హృదిసీమన్ బొంగి మోహించెడిన్॥

మ॥ చలచిత్తన్, మృదుశీల, సుందరముఖిన్, సాధ్విన్ 'దుల్లైవిల్లిమం
గలము'ం జేర్చిరి తమ్మికంటిదొర సింగారంబుఁ జూపించి ర
వ్వల నోయవ్వలు! యీపె బాష్పములఁ గార్పంజొచ్చె విభ్రాంతి మో
హిలి, చిక్కెన్ హరి దిక్కు మ్రొక్కెఁ దమితో నేకాగ్రచిత్తంబునన్॥

మ॥ కలదెచ్చె చెఱుకెట్టధాన్య ముదుష్టై కాలన్ "దుల్లైవిల్లిమం
గలమ"న్వాడది, తామ్రపర్ణికి నుదగ్భాగాన తద్దిక్కు దృ
క్కులఁ బడ్డన్ మఱియొండుఁ గన్గొనద యీ, కొంగొమ్మ పొగ్గెల్ల ని
చ్చలి మాటల్ హరి నీలవర్ణుఁడగు నా శ్రీకృష్ణు నామంబులే॥ 546

మ॥ ఎల నెమ్మి న్వలెఁ జిన్నిలేడి వలెఁదా నింపై "తుల్లైవిల్లిమం
గలమ" న్మాటయె కాని మీ నుడుల నాకర్ణింపదీబిడ్డ ముం
దలి పుణ్యంబొకొ? కృష్ణుమాయయొకొ? యో! తల్లీ రమానాథు చి
న్నెలు నామంబులు నీపెనోటఁ బడి పొందెన్ బావనత్వంబులన్॥ 547

మ॥ అల వేదాలును యజ్ఞముల్ సిరియు నింపారన్ "దుల్లైవిల్లిమం
గలమ"న్ బ్రోలది తామ్రపర్ణికి నుదగ్భాగస్థమైయుండ ని
చ్చలి కృష్ణాయతనేత్రి దానిఁ గని సంసేవించు టే యాదిఁగా
జలజాక్షా! యని నేటిదాక యఱచున్ స్వాంతమ్మునన్ మ్రొక్కుచున్॥

మ॥ కలకాలంబును నీపె లోఁగలఁగుచుం గన్నీరుఁ గార్చున్ నగం
బులు జాలింగొనఁ బిల్చు నీలమణిరూపున్ ద"త్తుల్లైవిల్లిమం
గల" వాసున్, దళితాశ్వదైత్యు; మఱి తద్గ్రామంబు పేరెవ్వరేఁ
బలుకం దోడనఁ గేలుమోడ్చి యలరొప్పన్ మ్రొక్కు తద్దిక్కునున్॥

మ॥ ఇలయో? నీలయొ? తమ్మియింటి చెలియో? యీలీల జన్మించెనో
బలిరే! యీబిడ లోకనాథుఁ బిలుచున్ బంతంబునన్ వాఁడు ముం
దలి కాలమ్మున వచ్చి తావుకొనుటం జూనా "తులైవిల్లిమం
గలము"న్ ముందల వంచిమొ్రిక్కు వినుఁ దగ్గా్రిమాఖ్య సంరక్తమై॥

—♦ఫలశ్రుతి♦—

మ॥ తలియుం దండ్రియు దేవ దేవుడనుచుం దాఁజిత్తవాక్కాయ వృ
త్తులఁ గొల్వ్తై 'కురుకూర' నుండు శఠశత్రుండున్ 'దులైవిల్లిమం
గలము'ం గూర్చి వచించు నిప్పదియు నంచద్వేద భావంబులన్
బొలుపొ వేఁయిటనుం బఠించికొన నొప్పున్ శ్రీశకైంకర్యమున్॥

—♦ఆరవ పది♦—

మ॥ పెనఁగొను మోహమూని పృథివీస్థలిఁ గొల్చిన సర్వదక్షు, ను
న్నను నలుపైన మబ్బుపోలుపుం గలవానిని సుందరారుణా
బ్జనయను నాసఁ జేసి యగచాట్లయి కూతురు తేనెలొల్కు క్రొ
న్ననసర మొప్పు కొప్పుఁ గల నాసుత జార్చెను కంకణంబులన్॥ 551

మ॥ కర సంశోభిత శంఖ నందక ధనుః కౌమోదకీ చక్రి, సుం
దర బింబాధరు, రక్త పద్మ నయనున్, దైత్యారి, గోటీర బం
ధుర నానాతులసీస్రగచ్ఛ మధుబిందు స్యంద సంశీతలున్
హరి, నాసించుట నాకుమారి సుకుమారాంగ ద్యుతిం గోల్పడెన్॥ 552

ఉ॥ చామన చాయ వానిని విశాలజగత్తును మ్రింగు భంగు లం
గా, మెఱుగారు మోవిఁ గల యర్భకునిం గళలీనువాని ను
ద్దామ సుదర్శన భ్రమణ దర్పితహస్తునిఁ బొందనేరమిన్
శ్యామలసాంద్ర దీర్ఘకచ, నా, సుత యూరక పాడిఁ గోల్పడెన్॥ 553

చ॥ కడిఁదిఁ గలట్టి ధాతఁ దొలిఁ గాంచిన వానిని శ్రీధరిత్రి మూ
డడుఁగులఁ గొల్చు నాయకు ధరాధిప పాండవదౌత్యకృత్యుఁ బూ

ర్ణుఁడయినదేవు నాసపడి నున్ను వెడంద పిఱుంద జంట చొ
ప్పడరు మదీయపుత్రి తనదైన స్వభావమె కోలుపోయెడిన్॥ 554

చ॥ తెలివి విధించువేద ముపదేశముఁ జేయు పరాత్పరుండు మృ
చ్ఛిలల ధరించు భూమి విడఁదీసిన యాదివరాహమూర్తి ని
ర్మల జలశాయిదైన మన మాధవుపై వలపూని యీపె, య
క్షులఁ జెదిరించు మాలఁగల కూతురు జ్ఞానముఁ గూడఁ గోల్పడెన్॥

ఉ॥ కల్పక కాననాభ భుజకాండుని కాంచనశైల సన్నిభా
నల్పకిరీటు, పద్మనిక రాంచదసంఖ్యకిరున్, స్ఫురద్ధనుః
కల్పములైన కన్బొమలు గల్గిన యీలలితాంగి కోరుచున్
బొల్పునుఁ గోల్పడెం దనదు పొంకపు నెమ్మొయి వాడిపోవగన్॥ 556

మ॥ తన నెమ్మేన ననేక భూషణములం దైవారు నట్లుంచు దే
వుని, విస్పష్ట ఫణాదిశేషశయు కెంపుం గేలునం గొన్న మె
ట్టని పాదంబుఁ గలట్టి బాలు నుపకారస్థాను శ్రీకృష్ణుఁ బొం
దను లావణ్యముఁ గోలుపోయినది వంతం జిక్కి నాబిడ్డయున్॥ 557

మ॥ కురువిందం బడఁగించుదంట శకటాఖ్యున్ మాయఁగాఁ దన్ను ధీ
వరునిన్ బూతనఁ గూల్పఁ బొల్గడుచు సద్భావున్, శ్రియఃపాలకున్॥
హరిఁ బొందం గడు నాసఁజేసికొని మా యమ్మాయి సౌరభ్య సుం
దర వేణీభర యీపె మాపికొనియెం దారుణ్య లావణ్యముల్॥ 558

మ॥ అతిసౌందర్య విభూషితుండయిన, మాయాచేష్టితుండైన మ
త్పతి, శ్రీవామను, నున్నతోజ్వలగిరి ప్రాయారుణాకారు న
ద్భుతదృశ్య ప్రభవ ప్రకారుఁడగు రాముం గోరి యాసించి నా
సుత శుంభన్మృదువక్షు కోల్పడియె తా శోభాతిరేకమ్ములన్॥ 559

మ॥ పొలుపుంగొల్పు కిరీటముం జలువసొంపుల్ నింపు పూదండయున్
గల వానిన్, బలుమల్లురం దొడరు దోఃకర్కశన్ మహామాయు, రూ

పులఁ జెన్నొందు సమస్తవస్తువుల వ్యాప్తున్, నిర్మలుం బొంద నా
సిలి నా కూతురు కట్టుబాటు నెడబాసెన్ జాణయై యుండియున్॥ 560

—♦ఫలశ్రుతి♦—

మ॥ పరమారామములొప్పు వేంకటగిరిన్ వాసిల్లు శ్రీజానికై
కురుకా పూర్వశఠకోపయోగి శుభవాకుల్ గూర్చి వాకొన్న సుం
దర గీతైక సహస్రమందు గడునందంబొందు నీపైపదిన్
గురితోడన్ బఠియింపఁ గల్గు నెఱి నాకుల్ వొందు నానందమున్॥

## —♦ఏడవ పది♦—

మ॥ తన సాపాటును మంచితీర్థ మటుపై తాంబూలముం గృష్ణుఁడే
యనుచుం గన్గవ నీరుఁ గార్చుచిలలో నాదేవుశీలంబు లా
తని చెల్వొప్పెడు నూరి త్రోవడుగుచున్ దాఁజొచ్చె నాబిడ్డ దూ
కొని యేదివ్యపురంబొ అయ్యది ♦"తిరుక్కోళూరై"యె తీరెడున్॥ 561

శా॥ ఊరున్ నాడును లోకమున్ దనవిధం బుద్రేకతన్ వాని వే
పేరుల్, పూసలపేరులం జపమునన్ బేర్కొంగఁ గావించి దు
ర్వారంబౌ మరియాదదాటెఁ గొలఁకుల్ వర్ధిల్లు "కోళూరు"లో
జేరెన్; నాలతకూన నాచిలుక; యిస్సీ! మళ్లిరా నేర్చునే?॥ 562

మ॥ చిలుకల్, పచ్చని చిల్కలున్, గలశముం, జెండున్, విరుల్ సజ్జయున్
తులసీదామునిపేర వీడి హరి నెందున్ బల్కి జీవించు నా
కుల దీపంబు కుమార్తె చల్లని "తిరుక్కోళూరు"నం జేరి మం
జుల బింబాధర యశ్రునేత్రియయి యచ్చో నేమి కానున్నదో?॥ 563

మ॥ కొమరారన్ హరి పవ్వళించెడి♦"తిరుక్కోళూరికే" లేత మ
ధ్యము మల్లాడగ బాల పోఁదలకొనెన్‌♦దంటాలనోళ్లున్న గ్రా
మము స్త్రీలున్ బొరుగున్న యన్నులు సుతన్ "మర్యాదఁ బోఁదట్టె నీ
యమ" యంచందురో? సాధ్వియంచ నెదరో? యాశ్చర్యమే? యేమనన్

♦గ్రామ నామము

మ॥ అవగాహించి, భ్రమించి, మ్రాన్పడి, వినోదార్థంబునున్ బోని మా
నవ బాలారమ యింతలోనఁ జని నానా పుష్పితోద్యానముల్,
కువలాబ్జాక్త తటాకముల్, గుడిఁ "దిరుక్కోళూరు" నన్ జూచి యె
ట్టివితం బుల్లము చల్లఁగా నిపుడు తుష్టిన్ బొంది పెంపొందునో?॥ 565

మ॥ నను నిష్క్రాంతిగ వీడి పోయె సుత కింకన్ దక్షిణంబైన ది
క్కున కొప్పౌ తిలకంబు నాఁదగు 'తిరుక్కోళూరు'నం జేరె నిం
క, నిజాధీశుని కెంపుమోవి సొగసుం గందోయియున్ గాంచి పొం
గునుఁ గాకాత్మవిశాల నేత్రముల సంతోషాశ్రువుల్ నింపుచున్ఁ 566

మ॥ కనుల న్నీరము నిండ భ్రాంతమతిఁ జొక్కంబైన రేయింబవల్
ఘనమోహా! యని పిల్చి యాదటను శోకగ్రస్తయై యాడి మె
ల్లనఁ గాలీడ్చుక వెళ్లి నాకొమిరె యేలా గెల్ల చెల్వంబులన్
గొనబై శ్రీహరి పవ్వళించెడి "తిరుక్కోళూరు"లోఁ జొచ్చెనో?॥ 567

మ॥ అతి సూక్ష్మావనతావ లగ్నముపయిన్ హస్తంబులన్ వైచి క
ష్టితయై యార్ద్రమనస్కయై మనల వీడెన్ నా తనూజాత ఆ
నత లక్ష్మీ యువతీయుతున్ హరినిఁ గానం బోయెఁ 'గోళూరు' పూ
రిత బాష్పాక్షియు నార్ద్రచిత్తయయి చేరెంగావలెన్ బాలయున్॥ 568

మ॥ కృత సద్వస్తువు లేవిఁ గాంచినను 'శ్రీకృష్ణార్పణం'బంచు మో
హితయై నీవగలాడి యెల్లయవి యిందే వీడి పైఁబోయెఁ బెన్
గుతకం బొప్పఁగ నూరుడెప్పగ "తిరుక్కోళూరి"కే చేర నొ
కతయున్ మమ్ముల మా మనోగతులనుం గైకోదు సుంతేనియున్॥

మ॥ సురలారా! స్మరియింపలేను; సుత, మా శోణాక్షి యీమీదఁ దా
నరవిందాక్షు, జగన్నివాసుని క్షణంబైన న్వీడంబోదు చే
[illegible] తత్సన్నిధి శ్రీశు నూరగు 'తిరుక్కోళూరు'నం జేర మా
[illegible] ప్రతిష్ఠ యనియున్ భావింప దొక్కింతయున్॥ 570

—♦ఫలశ్రుతి♦—

మ॥ స్థిరసంస్థాపితమైన శ్లాఘ్యనిధిఁగా శ్రీనాథు సేవించుచున్
గురుకాపూ ర్శఠకోపయోగిమణి వాకొన్నట్టి వేయింటనుం
గుఱితో నిప్పది శ్రీశుఁ డుండెడు 'తిరుక్కోళూరు'పై బుద్ధి నె
వ్వరు వర్ణించిన స్వప్రకాశ పరమావాసంబుఁ బ్రాపింపరే?॥

—♦ఎనిమిదవ పది♦—

మ॥ అమితస్నిగ్ధ పతత్త్రిలార! గతభాగ్యన్ మిమ్మ్రయాచింతుఁ బూ
ర్వము లోకమ్ములసృష్టిఁ జేసిన మొయిల్ రంగారు శ్రీకృష్ణుఁ జి
త్తము లోఁగొన్న హరిన్ గనంగ మదవస్థం జెప్పి వైకుంఠ లో
కముఁ జూఱం గొనుఁడీ! ధరావలయ మింకన్ మీరె పాలింపుఁడీ॥ 571

మ॥ చిలుకా! చక్రిసుధాధరున్ విభునిఁ దృష్టిం జూచి నెమ్మనిపై
వలపుం జెప్పి గిరుక్కన న్మరలి దీవ్యత్కజ్జలా లంకృతా
క్షుల నాచెల్వల ముందు నా కరముపైఁ గూర్చుండి నీవింక ని
చ్చలు క్షీరంబు ఘృత ప్రసాదముల నిచ్చం దిన్చు నుండందగున్॥ 572

మ॥ అళులారా! కురురాజపంచక హితుండై సంచరద్ ఘోటకం
బుల జంటం గల గొప్ప తేరుఁ గొని యేపుణ్యుండు చెండాడె సే
నల నాకృష్ణుఁడు తాల్చు చల్వతులసిన్ నవ్యాసవంబాని ని
ర్మలమా మూతులవచ్చి మత్కచ సుమ స్రస్తాసవం బానుఁడీ॥ 573

ఉ॥ మొల్లలమీఁది తుమ్మెదలు! పూతమఘార్తుల నాడికొంచు మీ
రెల్లఱుఁ బూవుఁ దేనెఁ గొన నేగిర యేన్ గలుపాత్మ్రరాలి నన్
గల్లఁగఁ గాగిలించి విడె కమ్రమధుస్రవమాలి దేవతా
వల్లభు వానిఁ జూచి స్వకృపాగతి యిట్టిదయేమొ? యన్నఁడీ॥ 574

శా॥ ఏనాడించెడు చిల్కలార! యిటు రండీ! మాట! రక్తాక్ష ప
క్షీనుం దోలుక వచ్చే పాపిసగు నా హృత్సీమఁ గొల్లాడు ర

క్త్రానూనాత్ముఁడు శోణితాధరు,డు నీలాంగుండు కల్పాభుఁ డె
చ్చోఁ నున్నన్ జని చూచి నీదయ యిదేసూ! యంచునోనాడుఁడీ॥ 575

మ॥ కలుచన్ మున్గితి నాదు చిన్నిచిలుకల్! కాంతంబు జందెం బుర
స్థలి దీపిల్లెడు నల్లనయ్య హరి యాత్మస్ఫార పాదాక్త శీ
తల దివ్యత్తులసిన్ మ దన్యలకుఁ జెందం జేయఁ డీరేగి మి
మ్ములవర్ణింపఁగ జేయు నాదువచనమ్ముల్ తప్పకే చెప్పుఁడీ॥ 576

ఉ॥ బొమ్మలు! తెల్లుపువ్వజిగిఁ బొందిన వానిని పుండరీక నే
త్రమ్ములఁ గులుకు-సుందరుఁ జరాచరవాసుని, మాయలానిఁ జ
క్రమ్ము ధరించు నావిభు,ఁ దురంగవిదారి, మధుప్రహారిఁ బా
దమ్ముల మ్రొక్కి నానుడులఁ దప్పకఁ జెప్పి మదార్తిఁ దీర్పరే॥ 577

మ॥ విమల శ్వేతగరుద్బకంబ! కడుఁ బాపి న్నేను నిల్లెంత కా
లము వైవర్ణ్యము నొంది కుందు టాకవేళన్ నీవు ప్రేమార నీ
లమణి శ్యామల కేశపాశు సురపాలస్వామినిం జేరి చె
ప్పుము నిర్దుష్టుల మిమ్ముఁ దక్కొ-రుల నీ పూఁబోఁడి కన్గోదనన్॥ 578

మ॥ జలభంగోపరి నీఁది భుక్తికయి సంచారంబుఁ గావించు కొం
గలు! దుర్భాగ్యను నాకు వేఱొకఁడు నేకస్వామి లేడేకదా!
పొలుపుం గార్మొయిలట్టి కృష్ణు దివిప్రాపున్ జూచి వాఁడాడు వా
ర్తల నాకుం దయచేసి సంతసముఁ దీరం జెప్పుఁడీ నిత్యమున్॥ 579

మ॥ మగలున్ మీరును బందుగుల్ కుసుమ సీమం దిర్గుచున్నారు నె
వ్వగ లేలేక మరాళులార! కమలావక్షున్ హరింజూచి 'యీ
పగిదిన్ వేడెడి నీపె చూడుమ'ని నాపట్లన్ రహస్యంబుఁ గా
దగు వాదంబుల నచ్చఁ జెప్పి మగుడన్ దద్వార్త నాకాడుఁడీ॥ 580

—♦ఫలశ్రుతి♦—

చ॥ పరిమళ పుష్ప వాటికల బంధురమా "కురుక"న్ శఠారి శ్రీ
హరి చరణాంకితంబుగ సహస్రవిధంబుల నేపుమీరు పా

శరముల వేదసారము వసుంధరఁ జెప్పగ నందు నిప్పుడిన్
వరుస బఠించువారు హరి భక్తిఁ గరంగరె వారి వోలికన్?॥

## —•తొమ్మిదవ పది•—

జలమై నేలయుఁ గీలి గాలి కడువిస్తారంపు మిన్నై నము
జ్వల తేజః పరిపూర్ణ సూర్య శశులై శర్వుండునుం బ్రహ్మయై
వెలయం జెల్లు మహాత్మ! యొక్కతతి రావే! శంఖ చక్రాలు చే
తులఁ గ్రాలన్ దివి, నేల సంతసిల నార్తున్నన్నుఁ బాలింపవే!॥ 581

మ॥ మన్నున్ మిన్నలరంగ వామనుడవై మాహాత్మ్యముం జూపి భూ
మి న్నాకంబునుఁ గొన్న మాయఁడవు సామీ! నిన్ సమీపించి నా
కన్నారం గని సంతసించి మెయి వొంగన్ నాట్యమాడంగ న
న్నన్నీవొక్క దినంబుడాసి ధరణిన్ గూర్మిన్ బ్రవర్తింపవే!॥ 582

మ॥ ఇలపైఁ గాల్కొని, నిల్చి, పండుకొని యెన్నేనాళ్లు పాలించి జీ
వులఁ బోషించితి నిచ్చలున్ బ్రితియుగంబున్ స్వామి! సౌందర్య కో
మల లక్ష్మీయుతు నిన్ను దాసుఁడను నీ మాటేని సేవింప కా
కులపా టొందుచు నెంతకాల మిటు నే ఘోషింతు నీపద్ధతిన్?॥ 583

మ॥ దురితాత్మున్ శకటున్ మెయిన్ దుమురుఁగాఁ దున్మాడి పాదంబునన్
బరిపాలించిన పెద్దవేల్ప! పనిగా బ్రహ్మేంద్ర రుద్రాదులా
సురలుం జుట్టి నుతింపఁ బెంపున మహాజ్యోతిర్మయా కారమున్
బూరయ న్నొకొకనాఁడు దర్శనము నీవో? రావో? భూసీమకున్॥ 584

మ॥ పరమస్థాన నివాసివయ్యు గిరిసంవాసుండవై, క్షీరసా
గర తల్పుండవు భూచరుండవయి, యిక్కన్పించు సర్వంబునన్
మఱుఁగై యుండి యసంఖ్య బాహ్య జగదంతర్వ్యాపివై యాత్మకం
తర బాహ్యంబులనుండియుం గనుల పొంతన్ రావు డాఁకొంటివే?॥ 585

మ॥ ఒకశ్రీపాదముఁ జాపి యంబుధిపరీతోర్వీస్థలిన్ గొల్చి కొం
డొక పాదమ్మున నూర్ధ్వలోకముల నెన్నో తాకు మాయుండ! తా
వక సేవారతి నెల్లకాలమును నీభక్తుండు మైనంబు రా
వకునిం డాసిన మాడ్కిఁ దప్తుఁడయి దేవా? నేలఁ దిర్గాడునే?॥ 586

శా॥ లోకాలోకిత కర్మరంగ ఫలమా! లోకేశ! లోకాత్మ! భూ
లోకస్థాన బహిఃపరీత దశదిగ్లోకాంతరవ్యాప్త జీ
వాకారాత్మక! యేమిఁ జేయుదు? వసంఖ్యాజ్ఞాన సంజన్య భా
షా కర్మాదికమగ్నుఁడన్ నను గృపాసంరక్షితున్ జేయవే॥ 587

మ॥ అమల జ్ఞానులలోని యాత్మవయి దివ్యామోక్షైకస్వరూ
పముతో దాసుని మోహపర్చెదవు స్వల్పజ్ఞుండు దాసుండు ప్రే
మమునన్ బ్రోవుము నిన్నుఁగా కెఱుఁగఁడీ మందుండు నా నెమ్మదిన్
బ్రమలం ద్రోసి కుయుక్తిఁ బన్ని మఱియున్ భ్రష్టంబుఁ గావించెదే?॥

మ॥ మనసల్లాడఁగ నింద్రియాలుఁ బొగులన్ బల్ స్వల్పభోగాలు నీ
వనఘా! నా కగుపర్చి వేపెదవె? కట్టా! భూమినిం గొల్చి లోఁ
గొను నీ దీర్ఘ విశాల పాదములకుం గొంపోయి, నన్ గాచు పా
వనకాలమ్మది యింక నెంతకు సమీపంబౌట కన్పింపదో?॥ 589

మ॥ పొడవున్ బ్రాఁకియుఁ గాక యవ్యయ మసంపూర్ణంబు నస్థూలమై
యెడలేకుండెడు నాత్మయోగ సుఖమెంతే పొందినన్ గూడ మా
యుఁడ! యోజింపగ, నొక్కతూరి క్షణమాత్రోద్వ్యక్త కాలంబు నీ
యెడఁ గైంకర్య మొనర్చి కాంచు నెఱితో నీడౌనె? లక్ష్మీశ్వరా!॥ 590

——♦ఫలశ్రుతి♦——

చ॥ చదువున ధ్యానయోగమున సంస్కృతిఁ జిక్కని శ్రీశు దాసులై
పొదలిన వారి దాసులకుఁ బూనికదాసుఁడు శ్రీశఠారి యిం
పొదవగఁ జెప్పు వేయిఁటను నుండిన యిప్పది పాశురంబులన్
జదివినవారు శ్రీపతి పదంబుననుందు రనన్య శేషులై॥

## —•పదియవ పది•—

మ॥ భువన గ్రాసక భూరివక్త్ర! సుయశఃపూర్తీ! స్థిరాభా పరీ
త విభామూర్తి! మహాత్మ! దాసహిత! నాథా! భూమికిన్ భూషణం
బు విధంబొప్పెడు వేంకటాద్రి ప్రభువా! బోధింపు నీపాద ప
ల్లవముం జేరు పథంబు దాసుఁడను తల్పం దాసవాశ్యుండనున్॥ 591

మ॥ తుమురున్ బూడిద మట్టికాగ బలమా దుర్వారమా దైత్యవం
శము మాయింపఁ దలంచి కేలున జ్వలచ్చక్రంబుఁ గైకొన్న దై
వమ! వాపీజలఫుల్లపద్మ శుభశోభా భద్రశేషాద్రి వా
స! మహాసక్తుఁడ నీ పదాలఁ గనుటే చందంబొ? తెల్పంగదే॥ 592

మ॥ మరులం గొల్పెడు శ్లాఘ్యమేఘ నిభధామా! మాయుఁడా! నామనోం
తరమున్ జొచ్చిన తియ్యనౌ నమృతమా! నా దేవతానాథ! ని
ర్ఝర సంవాహిత తార రత్న కనక ప్రాచుర్య శేషాద్రిశే
ఖరవాసా! భవదంఘ్రిఁ జేర్చికొని సాఁకన్ రమ్ము నన్నయ్యయో॥ 593

మ॥ "అయయో! అయ్యయొ!" నాక,లోకులకు,|నల్లాటంబుఁ బాటించు ని
ర్దయులౌ దైత్యుల యాయువుల్ డొలుచు నస్త్రజ్వాల వర్షించు విల్
గయి కొన్నయ్య! రమేశ! వేంకటపతీ! కాలుష్యమున్ మాపి పా
ద యుగంబేనుఁ గనుంగొనన్ దలపు నాథా! దివ్య యోగ్యర్చితా!॥594

ఉ॥ చేరి పెనంగొనం దరులఁ జించితి వేఁడిటి నేకథన్వినై
చేరికనున్న మద్ది జతఁ జెచ్చెఱఁ జొచ్చితి వాదిమూర్తి! సాం
ద్రోరు పయోద సన్నిభ గజోత్కట వేంకటశైల నాథ! సాం
ద్రోరు ధనుర్ధరా! యడియఁ డొందుటెఁ కెప్పుడు? నీపదాబ్జముల్॥ 595

మ॥ ఇలనుం గొల్చిన చేరికొనడుఁగు లే మేనాఁడు సేవింతు మం
చల నిత్యావళి, నిచ్చ గుంపులయి డాయన్వచ్చి కొండాడి పెన్
గొలుపుం జేసి మనో వచ స్తనువులన్ గొల్వంగ నవ్వేంకటా
చల మందుందువు "నీపదాల్' సరిఁగ గాంచం గూర్పు నీదాసుఁడన్॥596

మ॥ అడియండున్ దరిఁ జేరి పొందు నమృతంబౌవాఁడ! దేవాధి పా
దుడుకుం బుల్గుసిడంబువాఁడ! కడుచందుం బొందు కెమ్మోవి వె
ల్గెడు నయ్యా! కలుషార్తిఁ దీర్చు నగదాళీ! వేంకటాద్రీంద్ర! నీ
యడుఁగుందమ్ములఁ గాంచ నోచకె క్షణంబైన న్విడన్ సైప నేన్॥ 597

శా॥ "నీపాదాలఁ గనంగ నోచ మయిన న్నినీ్వడ లేమం"చు ధీ
వ్యాపారుండగు నీలకంఠుఁడు జతుర్వక్త్రుండు నిందుండు నీ
పాదపుం గొల్తురు మచ్చెకంటులు దరిన్ రాఁ బ్రీతితో వేంకట
క్ష్మాపా! కృష్ణుఁడు మోహపర్చి చనునోజన్నేల వేంచేయవే॥ 598

శా॥ రమణా! రాఁ గనుఁ దోచి, రావు మఱియున్ రాకుండియున్ వక్త్రు బిం
బ మనోజ్ఞాధర! వారిజేక్షణ! చతుర్బాహూ! ప్రియపాణి రూ
పమ! చింతామణికాంతి, రేయి పవలై భాసిల్లు శేషాద్రి వా
సముఁ గొన్నా వడియండు సైపఁడు నిమేషంబున్ నినుంబాయఁగన్॥

మ॥ క్షణము న్నిన్విడి తాళజాలని రమాచంద్రాస్య వక్షంబునం
గొని, నిస్తుల్య యశంబు నిల్వ, త్రిజగత్కూటంబునుం గల్గి నా
కును సంతోషవునై యసామ్య సురయోగుల్ గొల్వ శ్రీవేంకటా
ద్రినివాసింతు వుపాయ హీనుఁడను నీశ్రీపాదముం జేరితిన్॥ 600

—♦ఫలశ్రుతి♦—

మ॥ చరణద్వంద్వము క్రిందఁ జొచ్చి బ్రతుకున్ సాగింపుఁడీ యంచు నా
దరతన్ దాసులఁ దేర్చు శ్రీహరికి క్షేత్రఖ్యాతమైయున్న త
'త్కురుకూర,న్ శఠకోపుఁ డార్తిచన వాక్పొన్నట్టి వేయింటఁ పా
శురము ల్వీని బఠించువారి పదదాసుల్ గాంతు రీ సాలోక్యమున్॥





# శఠకోపగీతామృతము.

## ఏడవశతకము

### —♦మొదటి పది♦—

శా॥ లో నేనింటనుఁ ద్రొక్కి నీపదము ల్పొందంగ నీకింక నన్
హీనుం జేయఁ దలంతువే? హరి! యసంఖ్యే యాపరిచ్ఛిన్న మా
యా నైపుణ్య! యమర్త్యగణ్య! నిజశేషాంశత్రియీాలోక! సా
మీ! నా నాయక! భోగ్యభూతుఁడవు సుమ్మీ నాకు నా భర్తవున్॥601

మ॥ వరవర్షాబ్ద నిభాకృతీ! యమృతభవ్యా! శర్కరాభోగ్య! సా
గర వృత్త క్షితి రక్షణోజ్జ్వలిత చక్రా! వేద వేద్యా! యఘా
కరు నన్ లోఁగొని వేఁచు నింద్రియములం గల్పించి పీడించుచున్
దరిఁ జేరం జన నీయకుంటివి ననుం ద్వత్పాద పద్మస్థలిన్॥ 602

ఉ॥ మూలమవై విశాలజగమున్ సృజియించి గ్రసించి క్రిక్కి నీ
కాలనుఁ గొల్చితో ధగ ధగాయిత దీర్ఘకిరీట! తొంటి పా
పాలనుఁ బాపినట్టి మధువైరి! నను న్విషయాలఁ ద్రోసి పా
దాలనుఁ జేర నగ్గదు కదా! ఫలమేమగు నీకు దీనిచేన్?॥ 603

శా॥ వేనిన్నెవ్వరి నీదుగర్భమున, గుప్తిం జేసి న్యగ్రోధ ప
త్రానం గుఱ్ఱఁడవై శయించెదవు మత్పాపాప నోదాషధీ!
యేనున్ ధర్మము మఱ్ఱి నింద్రియపు మాయే చూపి నన్ ద్రిప్పి శ్రీ
జానీ! నీ పదపద్మముం దరియగా సాగంగనీకుందువే?॥ 604

శా॥ ఆమూలా సురవంశవృక్ష దళనోద్యచ్చక్రధుర్యా!పరం
ధామా వాసకరక్ష! మందులకు లొంగన్ రాని యేన్ నొవ్వులన్
బాముల్బొందు శరీర యంత్రమునఁ దత్పంచేంద్రియాధీనుఁగా
సామీ చేసితి బైటఁ ద్రోసితి చికిత్సల్ సేర మీవ్యాధికిన్॥ 605

మ॥ పరమేశా! భవదీయ కింకరుల దివ్యశ్రేణి వంచించు భీ
కర పంచేంద్రియముల్; ధరాగతు, భవత్కారుణ్య సంత్యక్తు, నన్
జెఱుప న్నేరవె? నాదుకూరిమిఁ గయితం జేతమ్మునం గన్గవన్
వరభక్తిన్ మృదుసూక్తి నున్న పరదేవా! వచ్చి మాటాడవే?॥ 606

చ॥ అపుడు సురాసురుల్ తఱచు నబ్ధి నలల్ జెలరేగ గట్టు స
ర్పపతినిఁ గట్టి నిల్పితివి పాపిని నాకమృతంబునీవె నీ
కృప విడెనేని పల్కొకటి కృత్యమదొక్కటి కాఁగ దూలు పా
పపు విషయారి పంచకముఁ బట్టి మఱెట్టుల మట్టు నేర్చెదన్॥ 607

మ॥ జననీప్రాియ! మనః ప్రియా! సురగణేశా! యల్ల వైకున్ గనద్
ఘన భోగంబులవోలెఁ దోచి నరులన్ గర్షింపఁగా నీవ యుం
చిన నీమాయమునెల్ల వేళ్ళొదలు సంఛేదించి నీచిహ్నముల్
తనువుం జింతనఁజేసి పాడి బుజలెత్తన్ నాకుఁ జేకూర్పవే?॥ 608

శా॥ జాతిఖ్యాతిని మాపు పాపగతియౌ సంసారమన్ ఘోరమౌ
గోతం ద్రోయు హృషీక పంచకము నిక్కన్ బూర్తిగా ద్రొక్క చే
యూతన్ నాకు ననుగ్రహింపుము పతీ! ఓ! నా పరంజ్యోతి! నీ
చేతన్ బుట్టె ధరాదిలోక చిదచిచ్చిత్రంబులుం దొల్లిఁటన్॥ 609

మ॥ మును సంద్రమ్మునుఁ జిల్కి కొంటి వమృతంబున్ మాపరంజ్యోతి వం
చును ఘోషించుచు, జేరియున్న భవదంఘ్రుల్ జేరి రంజిల్లు పా
వన భాగ్యమ్మదియుండ; దేహభరమున్ బైవైచి పంచేంద్రి యా
ళ్లను నల్గిక్కుల కీడ్చి యన్యవిషయాలం ద్రిప్పగాఁ జేసితే?॥ 610

—♦ఫలశ్రుతి♦—

మ॥ గుణవన్మూర్తికినిం దిరామూర్తికి జగత్కూటోదయత్రాణ నా
శన పారీణున కబ్జనాభున కుదకస్సంశాయికిం దాస్య జీ
వనులౌ వారికి దాసుఁడైన శఠకోపస్వామి శ్రీసూక్తి నుం
డిన పద్యాల్పది వీనిఁ బాడి యఘమున్ ఛేదింపుఁడీ రేఁ బవల్॥

## —♦రెండవ పది♦—

మ॥ కనులం గూరుకు రేఁ బవల్గనదు వైకెఁ గన్నీళ్లు జల్లున్ నమ
స్సనుఁ గావించును సంకు, చక్రమని యేడ్చున్ గుందుఁ గెందామరల్
కనులంచు న్నిను వీడలేనని క్షితిన్ గైనంటు శ్రీరంగ భూ
మిని మీనాంచితనీరసీమ మను సామీ! యీమె కేమయ్యెడున్?॥ 611

మ॥ నలినాక్షా! నను నేమిఁ జేసెదవి కంటన్ న్నీరుఁ బెట్టున్ మహా
జల రంగేశ్వర! ఏమిఁ జేతునను? నుష్ణశ్వాసమున్ బుచ్చు మూ
ర్ఛిలు మున్ జేసిన పాపమంచఱచు శ్రీకృష్ణా! యనర్హాంబనున్
నిల మున్ మ్రింగియుఁగ్రక్కి కొల్చికొను సామీ! యీమె కేమయ్యెడున్

మ॥ నను సిగ్గెంతయుఁ దూల 'నీలకళ' యంచున్ బిల్చి యాకాశమున్
గను మోహిల్లు "బలాసురాసుహర! యేకస్వామి! యంచార్ద్రయౌ
"గనరానట్టి నినుం గనం గొలుపవే! కాకుత్స్థ! కృష్ణా!" యనున్
ఘనకేతూత్కటవప్ర సుప్రథితరంగా! యీపె కేమయ్యెడున్?॥ 613

శా॥ కాలుం గేలును నుంచినట్లనుచు నేగన్ లేచి మూర్ఛిల్లు కెం
గేలున్ మోడుచు, "నాసచెష్టదను భ్రాంతిం గూరుఁ వార్ధ్యాభ! నీ
జాలేదీ? యను సర్వతోముఖలసచ్చక్రేండ! రమ్మంచిలన్
వ్రాలున్ శేషి! సమృద్ధతోయ విలసద్రంగేశ! యేమీమెకున్?॥ 614

శా॥ చింతించున్ భ్రమియించుఁ దెల్విఁ గనుచుం జేమోడ్చు "రంగేశ! నే
సంతోషాస్పదఁ గార్ప, నాఁడవిడి నాజాడన్ బ్రవేశింపు మ"ం

చెంతే మోహిలు సంధ్యఁ జీల్చితివి యాహేమాసురున్ వాహినీ
కాంతున్ జిల్కినభోగ్య నీయడుఁగులం గాంక్షించె నీ భ్రాంతయున్

మ॥ "నను నూరించు మనోహరా! మణినిభా! నవ్యారుణోష్ఠా! ప్రమో
హన! శీతాంబు పరీత రంగనగరేశా! దేవతాధీశ! దా
రుణ ఖడ్గాంబక శంఖ చక్రధర! నన్ బ్రోవంగ రమ్మంచు నో
ఫణిరాట్తల్పక! నిన్నుఁ బిల్చునిది నా పాపంబొ రాపీవిటన్॥ 616

మ॥ స్థల సంకల్పిత సౌఖ్య దుఃఖ! జలధిస్థా! యబ్ధివర్ణా! యన
న్యల కీవేగతి కాలచక్రధర! మీనోదంచ దంభ స్థలో
జ్వల రంగేశ్వర! పావితాహ మను కృష్ణా! యంచు మోహించి యీ
తలిరుంబోడి హిమాంబు సంభరిత నేత్రాలొప్ప నిల్చుండెడిన్॥ 617

మ॥ సురరక్షా! పశురక్షకాద్రిధర! యంచున్నేడ్చు కృష్ణా! యనున్
గరముల్ మోడ్చు నిగుడ్చు నూర్పు మదిపొక్కన్నిక్కి వీక్షించు నం
బరమున్ దప్పిడకుండ వేఱెటుల నిన్ భావింతు నంచాడు మా
సిరి యీబిడ్డకిఁ కేమగున్? జలవృత శ్రీరంగ రాజేశ్వరా!॥ 618

శా॥ "మా లక్ష్మిం గల రొమ్మువాఁడ" యనుచున్ "బ్రాణేశ! భూదేవినిన్
దేలం దీసితి పంటిచే"ననుచు "నాడిన్ బ్రిఁలం బోలు ఘం
కాలం బట్టితి నీలకై" యనుచు రంగస్వామి! యీబిడ్డ తాఁ
జాల న్నొచ్చెడి నీపె టిచ్చలకు మోక్షం బెప్పుడో? చెప్పవే॥ 619

మ॥ తన దుఃఖాంత మెఱుంగకే పడఁతియున్ "త్రైలోక్యనిర్వాహకా"
యని "సౌరభ్యజటాధరుండ! చతురాస్యా!" యంచు "దివ్యాంగశో
భన! నాకావన! రంగపావన! యనున్ బాదాప్తి లేకున్న భం
గినఁ గన్పట్టియు మేఘవర్ణ! భవదంఘ్రిన్ బట్టె నీపట్టియున్॥ 620

—♦ఫలశ్రుతి♦—

మ॥ జలదాంగాంఘ్రులఁ గొల్చి తత్కరుణ నిచ్చల్ బొంది జీవించుచున్
జలచీరాంచిత తామ్రపర్ణినది పజ్జన్ మంజులారామ పు

షట్కలమాచోట శఠారి రంగవిభు కైంకర్యంబుగా జెప్పు ని
స్తుల సాహస్రములోని యీపదియుఁ గూర్చున్ నిత్యమోదంబునున్॥

## —♦మూడవ పది♦—

మ॥ సితశంఖోద్యత చక్ర సంయుతుఁడు రాజీవాక్షుఁ డప్పక్షి రా
ఢ్యాశ్రితుఁడై నామది దిర్గుటంగనరు నేజెప్పంగ నేమున్న దా
తత సంతోషకు డుండనుత్సవపు మ్రోతల్ బాలకేళీ రవో
ద్ధతి, వేదార్భటి యున్నెడం జనెద మాతా! నేఁ “శ్రీదిరుప్పేర”కున్॥621

మ॥ వినుఁడీ! తల్లులు నెచ్చెలుల్! పరిమళద్వేణుల్! సమీపస్థలీ
మనసున్ బట్టఁగలేనధీనముగ వంపం గాక రేయుంబవల్
చని తేంట్లొప్పెడుఁతోటలన్ సరసులం జానా ‘తిరుప్పేర’ దే
వుని భోగ్యారుణ సుందరాధరముపై బోవున్ దదేకాగ్రతన్॥ 622

మ॥ రమణీయాధరపక్వ బింబవశనై రక్తోజ్వల స్మాళి వ
శ్యమునై శంఖముఁ జక్రముం గని మహాసంతుష్టయై కంటి క
న్యము వీడ్కొన్నది యుత్సవాలెసఁగ ధన్యంబౌ ‘తిరుప్పేర’ వా
సము మాకై కొను సామికొగ్గినది లజ్జన్ నామనస్సుగ్మలీ! 623

మ॥ హృతశోభన్ మగిడింపనేగి మనసందేనిల్చె నేనింక య
త్నత నేరిం గొని యేమనం గలను? భంగద్వార్ధి ఘోషాను భా
విత వేదధ్వని యెల్లెడం గల “తిరుప్పేర”ం దిరంబుండు నా
ధృత శంఖుం గని మాయముగ్గితిని తల్లీ! నన్నుఁ గోపింతురే?॥ 624

శా॥ మాయాపూతన పాలుఁ బీల్చి శకటున్ మాయించి సాలద్వయిన్
బాయం గూలిచి దూడఁ దూలిచిన గోపాలుండు నాసిగ్గు గొం
పోయెం దల్లి! యికేఁమి జేయనగు? మున్ మున్ వాడు విచ్చేయ నె
చ్చాయం దోపులెసంగు నందుఁ గొనిపో జానా “తిరుప్పేర”కున్॥ 625

శ్రీగ్రామనామము

శా॥ నీలాభ్రాభుఁడు, నాదు నాథుఁడెదుటన్ నిల్చుండె వైకుంఠుఁడు
ద్వేలంబై వల పట్టి మించెను చతుర్వేదజ్ఞులున్వేల్చి యె
ద్వేళం గొల్వ నతండు నిల్చెడు 'తిరుప్పేరన్' ఫలత్సస్యముల్
చేలొప్పారెడియూర వానిఁ ద్వరనే సేవింపఁ గావింపుఁడీ॥ 626

మ ఘన దుర్గాప్త పయోధి గుప్తిఁ గల లంకం గూల్చు సంక్రాంత పృ
థ్విని విచ్చేసి నివాస ముండెడు "తిరుప్పేర'న్ బ్రవేశించు నా
మనసున్ మళ్లఁగఁ గాంచ నింకిచట కొమ్మా! యేరి సాయంబునన్
బనియేమి? నామది నేరు తెత్తురిటు? పోవన్ మేలు నేనయ్యెడన్॥ 627

మ॥ చెలియా! కన్గొని చేరి యెల్ల ఉదధిశ్రీవర్ణుతో నాకు నా
చెలిమిం బట్టె నెపాలు వెట్టుటె మొదల్ స్నేహంబు వర్ధిల్లె న్నృ
ద్బలభూ సప్తసముద్ర నాకములకున్ బైదాటి భంగద్ధ నీ
విల సద్దేశము విష్ణువాసము 'తిరుప్పేర'న్ గనం జేరెదన్॥ 628

శా॥ ఓతల్లుల్! చెలు! లీయవస్థకిఁక మీయోదార్పు లేలమ్మ? నా
చేతోనిశ్చయమీడ లేదు సితభాసిన్ గ్రస్తరత్నాకరో
పేత ఘూర్ణతలుఁ గృష్ణుఁ డైకొనెఁ దిరుప్పేరన్' హరిక్షేత్రవి
ఖ్యాతిం బొంది సగోభిరామమగు నూరం డేగి నేనుండెదన్॥ 629

మ॥ గిరిశృంగోన్నత రత్నసౌధ నికరాకీర్ణన్ 'దిరుప్పేర'ఁ గా
పురమున్నాడురు కుండలుండు, శతరాట్పుక్రాంతకుం డబ్ద సుం
దఁరుఁడా చక్రి హరించె, నామనసు కాంతా! చాల కాలంబు పల్
పురము ల్వాఁడలు నాడులున్వెదుకుదున్, బోనాడితిన్ వ్రీడయున్॥630

—♦ఫలశ్రుతి♦—

మ॥ ప్రతి కల్పంబున నామ రూప కృతులన్ బల్ రీతులం బొంది యీ
క్షితి రక్షించు పయోధి వర్ణు కృతిగా శ్రీమచ్ఛరారాతి ని
ర్మితముం జేసిన వేయి పాశురములన్ "శ్రీపేర" పేరన్ బదిన్
శ్రుతిఁ జేయన్ ధృతచక్రి కింకరత నిసుల్గాను రాగంబగున్॥

## —•నాల్గవ పది•—

మ॥ కరశుంభద్దర చక్ర నందక ధనుః కౌమోదకీ రూపముల్
బెరుఁగం దిక్కుల మంగళధ్వనులు వ్యాపింపంగ బ్రహ్మాండ మా
వరణాంభోనిధిఁ గ్రుంగ మౌళి, పదముల్ వ్యాప్తిం గొనన్ శోభనా
కరుఁడై నాఁడు త్రివిక్రముండు కొనె లోకంబెట్టి యాశ్చర్యమో॥ 631

మ॥ అమితానంద కరంబుఁగా సుధకునై యా యప్ప జిల్కన్ నగా
భి ముఖంబై నదులప్డు వేగ మరలన్ బెన్ జప్పుడుం దిప్ప స
ర్పమునం జుట్టి మథించుచప్పుడును, పారావార సవ్యాప స
వ్య మహావర్తనఁ బుట్టు చప్పుడును నాభావంబులోఁ దోఁచెడిన్॥ 632

ఉ॥ తెప్పునఁ బెల్లగించి విడఁదీసి స్వదంతముచేత నెత్తి యా
యప్పయె యేడిఁటన్ బొదలు బ్రహ్మాండము నిల్పఁగ నిశ్చలంబుఁగా
నప్పుడు నిల్చె; నేడగు కులాచలముల్ జలియింపకుండె న
ల్లప్పుడె తానముల్వ్వడక యంబుధు లేడుఁ జలింప కొప్పగన్॥ 633

ఉ॥ కాలము కూలె నేల బలగంబు నశించెను నింగి కుంగె పైఁ
గ్రాలుగ్రహాలు మాసె శిఖ, గాలియుఁ దూలె కులాచలంబు లా
మూల మడంగె జ్యోతులునుఁ బోయె మహాధ్వని నింపి యప్ప లో
కాలను నారగించు లయ కాలము గూడిననాఁడు మర్ఘురే॥ 634

చ॥ కనఁదగు భారతాహవ ముఖంబున నప్ప యెదిర్చి నిల్వ భో
జన బలులైన మల్లు లొక చాయను గుండయుఁ బిండిగాఁగ నా
ధ్వనియును రాజవీరభట దారుణకంప భయార్తరావ మె
త్తున వినువీథినున్న విబుధుల్ పొనరించెడి చప్పుడున్ దగెన్॥ 635

ఉ॥ వ్రాలిన సంజప్రొద్దు దివి రంగము దిక్కులు రక్తసిక్త భా
గాలగులాగు నప్ప కడుఁ గాటియఁ గూరిచి రాక్షసావళిన్

గూలుచు చొప్పు పర్వతముఁ గ్రోధమునన్ బెకలించి చీల్చి నా
భీల మృగేంద్రి పద్ధతినిఁ బెద్దయుఁ బోలె మహాద్భుతంబుగన్॥ 636

చ॥ ఒరయుచు నొక్కదాని వెనుకొక్కటిగా నెదురేగి 'హైరెంయిమ'ం
చరుగు శరాలఁ దూలు నసురాళి శవంబులు కొండలట్లుపై
తొఱఁగెడు రక్తవాహినులు తోయధిలోఁ గలియంగ నప్పు యు
ద్ధురమగు ధర్మయుద్ధమున దుంచెను లంకనుఁ గిన్క రాముఁడై॥ 637

ఉ॥ నేరుపుకాని బాణు గణనీయభుజంబులఁ జీల్చునాఁడు తాఁ
బోరి మయూరకేతనుఁడు ముందుగ నోడె ననంతరంబు దు
ర్వార శిఖోజ్వలుండయిన పావకుఁడోడెను దాఇ మీఁదటన్
బోరుఁ దొలంగి వెన్ దిరిగి పోయెఁ జమీ! యల ఫాలనేత్రుఁడున్ ॥638

చ॥ అపుడు సృజించె నప్పు వసుధాంబ్వనిలాగ్ని నభః కులాచలా
ద్యపరిమిత ప్రపంచము ద్వయంబగు తేజముఁ దక్కవాని నిం
కపుడె సృజించె వానల సురాసుర మర్త్యులఁ దక్కవారి న
ల్లపుడె సృజించె మొట్టమొదటా పరమేశుఁడు లోకజాలమున్॥ 639

ఉ॥ మేయుచు నున్న గోధనము మెల్కవఁ గ్రిందకుఁ జేర, జారుచున్
బోయి మృగాలు దొర్లిపడ పుష్కల నిర్ఝరవారి జారి ఘో
షాయుతమై క్షితింబడగ జానుగ నాలునువ్రేలు నిల్వ శై
లాయత వృష్టి కడ్డముగ నప్పు కొనెన్ గిరిఁ దల్లకిందుగన్॥ 640

—♦ఫలశ్రుతి♦—

గీ॥ కుధరమెత్తిన కృష్ణు భక్తులనుఁ గూడి
యడరు శరకోపయతి జెప్పి నట్టి నూరు
పదుల నిప్పుడి పద్యముల్ పరనజేయు
జనులకరు నజేయసంసార జయము గల్గు॥

# ఐదవ పట్టు

మ॥ ఘనతంగన్న యయోధ్యలోఁ దృణము మున్ గానున్న యల్పాలు నం
దనయంబుండు పిపీలికాదులగు జీవానీకముల్ బ్రహ్మాదే
వుని సృష్టి స్థలమందె మోక్ష గతులన్ బొందించె నొండేమి లే
కనె యారాముని దక్క నన్యులను భక్తశ్రేణి యర్చించునే?॥ 641

మ॥ మనుజార్థంబిల మీదఁ బుట్టి సయిరింపన్ రాని కుందొంది పృ
థ్వని బాధించెడి రాక్షసాధముల నన్వేషించి చెండాడి భూ
మినిఁ శాలించి శుభంబు నించి చనుపేర్మిన్వొంచు నారాయణా
న్యుని సేవింపఁ దలంతురే? మఱి మనుష్యుల్ ధారుణీ సంభవుల్?॥642

చ॥ వినఁ జను వారి వీనులును విచ్చెడు నీచకఠోర దూషణం
బొనరిచి చాలనాళ్ల పగ నూనిన యాశిశుపాలు స్వీయపా
వన పదమంద చేర్చిన స్వభావమెఱింగిన వారిఁ గోరి యూ
కొను జను లల్ల కేశవునిఁ గూరిచి తప్పు మఱొండు విందురే?॥ 643

మ॥ పలు రూపాల్ గల సృష్టి నేది యుదయింపన్ లేని శూన్య స్థితిన్
బ్రళయావస్థఁ బ్రశస్తనీరముఁ జతుర్వక్త్రున్ స్వసంకల్ప భూ
తులఁ గావించి పురాహ్మృతంబయిన వస్తుశ్రేణి సృష్టించు చో
ప్పులఁ జింతించిన తత్వవేత్తలు రమాప్తుం గాకొరున్ గొల్తురే?॥ 645

మ॥ ఉరు గంభీర మహాంబుమగ్నమగు నీయుర్విన్ రవం తేనియున్
దఱుఁగన్ సైపక స్వీయదంతమున నంతం దానె వారాహసుం
దర రూపమ్మున నెత్తుటన్ వినియునుం ధ్యానించు వారాశ్రయం
బరయన్ మాయుని పాదపద్మములు తక్కన్యంబులం గొల్తురే?॥ 645

మ॥ సతతోదార కరుండవైన బలిచే సాంద్రార్తినిం బొంది దే
వత లొక్కమ్మడిఁ జేరి యేగి హరినిన్ బ్రార్థింప తద్దుఃఖసం
హార్తికై సంకుచిత ప్రశస్తకరుఁడై యాగుజ్జు కావించు న
ద్భుతముం జూచుచు వించు నెంచు జనమున్ బూజించునే? యన్యునిన్

మ॥ కని తేర్చ్గానెడు పూలమాలఁ గల మార్కండేయు నాయువ్యమున్
మనుపన్ దామజటాకిరీటుఁడగు నంబాజాని తోఁకొంచునుం
జని చెప్పం దరిఁ జేర్చి పాయమి నెఱుంగం గల్గి గ్రంథంబులన్
గని ధ్యానించియుఁ గాంచువారు హరిఁ దక్కం గొల్తురే యొక్కరున్॥?

మ॥ అరికట్టన్ బడనట్టి పెన్ దపనుచే నాదిత్యులన్ బెక్కు తొం
దఱలన్ బెట్టు హిరణ్యరాక్షసుని మేనన్ నారసింహాంగ భీ
కరుఁడై చేసిన మాయలం దెలిసి మోక్షంబందఁ గాంక్షించు వా
రు రమానాయకు శీలపాళి విడి వేఱున్ నేర్వగాఁ బోదురే?॥ 648

మ॥ "మును దాయంబెగవేయు నూర్వురను దుమ్ముంజేయ నప్పంచకం
బునకుం దోడయి, లోకమెల్లఁ గన మెప్పుంగొన్న సారథ్యమున్
గొని యాజిన్ గుదియించె సైన్యమ"ను, సూక్తుల్ వించు తన్మాయఁ గ
న్గొను వారెవ్వరు మాయకృష్ణువిడి యన్యుం గొల్వఁగా బోదురే?॥649

శా॥ వార్తావేత్తలు జన్మ వార్థక మృతుల్ బాధించు సంసార ఘో
రార్తిన్ మాపి సమూలమున్ వగపు మాయంజేసి తానే కృపా
పూర్తిన్ బాదముక్రిందఁ జేర్చు హరి చెయ్వుల్ సేమముల్ దల్చి ధీ
స్ఫూర్తిన్ బొందుచు మాయకృష్ణునకె దాసుల్ గాకొరుంగొల్తురే?॥

—♦ఫలశ్రుతి♦—

మ॥ తెలియుచు గొంకులేని స్థిరధీరతికిన్ బర ముక్తిదాత శ్రీ
కలితుఁడు సర్వవేత్త కృతికర్తగనొప్ప శఠారియోగి తాఁ
బలికిన వేయి పద్యములఁ బైపదిఁ బొందినవారు పాప సం
కుల జగమందె యున్నపుడె కొందురు జ్ఞాన సమృద్ధ బుద్ధులన్॥

## —♦ఆరవ పది♦—

చ॥ కలిత పదార్థ సంచయ జగత్ప్రియకల్పక! పద్మనాభ! ఓ
కలిత పదార్థ సంచయ జగత్త్రయ విక్రమణాంఘ్రి పద్మ! ఓ

నలిన దళాయతాక్ష! నలినప్రతిమాననకరా! యొకండ నన్
బాలుపుగనోము సామి! నినుఁ బొందుట నాకిఁక నెన్నినాళ్లకో?॥ 651

శా॥ భూమి వ్యోమ జలానిలాగ్ను లఖిలంబున్నీవయై యున్న నా
సామీ! యావులమేపి గోపకులమున్ సాకంగఁ గొండెత్తి నా
వో, మన్మానసచోర! మాయి! చతురాస్యుండున్ శివుండెంచునీ
శ్రీమత్పాదము నేను బొందుటెఁక యిస్సీ! ఎప్పుడో! అయ్యయో!॥652

మ॥ మలఁ బైకెత్తి శిలాతివృష్టి నెదిరింపన్ నేర్చు హృద్యక్రమా!
తులసీ శీతలదామమాళి! జడయందున్ శోణ సూనాళితోఁ
బాలుపౌ రుద్రుఁడ! జ్ఞానియైన నలుమోము ల్వేల్పు! నన్ జేరు నా
యలఘు ప్రాణమ! యెందు పొందెదను స్తోత్రాప్రీతకీర్తి! నినున్॥653

మ॥ మకరందాంచిత ఫుల్లశీత తులసీ మాలాలసన్మాళి! గో
పక! మధ్భవ్య! జగత్రయంబవురు గొప్పన్ బొందు ముక్కంటి వీ
వ కదా! బ్రహ్మవు నీవ! కూరపవి దీవ్యద్ధస్తు డిందుండు నా
యకుఁడై యున్న సురాళి నీవ! యెచటయ్యా! నిన్ను నేఁబొందెదన్?॥

శా॥ నా గోపాలక! నా యమేయ మణివర్ణా! యస్మదీయాత్మ సం
రాగంబొందెఁ ద్వదీయనాభిజనిత త్రైలోక్య సౌఖ్యంబు లం
దూగన్ గావున దేవ! తావక మహాజ్యోతిః ప్రవాహంబులోఁ
దోగన్, గన్గొన, డగ్గరింప, నిఁక నెందున్ నాకు సందున్నదే?॥ 655

మ॥ విలసన్నీల కళల్ జెలంగఁ గటిపైఁ బీతాంబరం బొప్ప నం
ఘ్రిలును, న్నాభి, కరాలు, ఁబేరురముఁ గన్నుల్ మోవి రమ్యారుణా
భల రంజిల్లఁగఁ బండు రత్న సుమశుంభ న్నీల సాలాభు శ్రీ
లలితోరస్థలుఁ జేరి పొందు తెఱఁగుల్ గానన్ గదా! యక్కటా!॥ 656

మ॥ మనశ్రీఁ బేరెదఁ గొన్నవాఁడు మన యంబన్ బూని సామేన నా
నినవాఁడున్ మనవాణి మోము పయిన న్నిత్యంబును న్నిల్పువా

ఁడునుఁ బైనుండు శచీవిభుండు భువి తేడున్ మూడుపట్నాల్ దహిం
చిన వాఁ డింద్రియజేత స్వర్గపతి వానిన్నేను సేవింపనో?॥ 657

మ॥ కరివైరిం గను నక్కలై శరభముం గన్గొన్న గుజ్జాలునై
పరువుల్వెట్టి బిలాలుజొచ్చి రసురుల్ పల్ కూతలన్ జక్రి సుం
దర తార్క్ష్యో ద్గతుఁడౌచు లంకఁ జనునంతన్. మాలి నింగూల్చి భూ
ధర భంగిన్ బరిమార్చెఁ దజ్జనుల నా ధన్యాకృతిన్ జూతునే?॥ 658

మ॥ మనసా! కాంతునె? క్రూరచేష్టితుఁడసామాన్య ప్రభాశాలి కా
లున కీడౌ నల రావణుం దునిమి యిల్లుం గూల్చి తద్భ్రాతకున్
ఘన వైశాల్య జలానుకూల్యమగు లంకం గూర్చి పాలించి పైఁ
దన తేజంబునఁ జొచ్చు నిర్జరకులోత్తంసున్ రమానాయకున్॥ 659

శా॥ ఏకత్వంబున నేగి మాయపనులెన్నేఁ జేసి కంసున్ యమో
ద్రేకుం గూలిచి పాండవార్థము కురూర్వీభృచ్చమూజేతయై
లోకఖ్యాతిని మించి చొచ్చెఁ బెను చెల్వం బాలగోపాలుఁడై
వైకుంఠంబు నొసంగెడిన్ మనకనిర్వాచ్యోన్నత స్థానమున్॥ 660

—♦ఫలశ్రుతి♦—

మ॥ నరహరియై హిరణ్య తనునాశమొనర్చి యెసంగు చక్రికై
కురుకను శ్రీశతారి నుతిఁ గూర్చిన దివ్యములైన వేయి పా
శురములపైఁ బదిన్ జదువు సూరులు చాపల దేవతాంగ నా
కరకృత వీజనాదిక సుఖంబులఁ గాంతురు విష్ణుసన్నిధిన్॥

## —♦ఏడవ పది♦—

మ॥ ఎటులఁగన్ శేలల యొక్క ప్రాణముఁ దినన్ మృత్యు ద్వయంబానో? సా
గర రోచిష్ణుని కృష్ణు శ్రీనయన యుగ్మంబానో? సద్యోవిక
స్వర పద్మంబుల యట్టు చుట్టుకొని కన్పట్టుంజుఁడీ! నాకు నె
త్తటి నోతల్లులు! వెచ్చెలుల్! పొరయు ఖేదంబేమిఁ గావించెదన్?॥ 661

మ॥ జననీ! నన్ బుదిరించి తిట్టి బెదిరించన్ దానసేమయ్యె? చు
ట్టును బెంపౌ సురవల్లియో? చివురో? గుట్టున్ సేర క్రొవ్వెన్న క్రిం
గిన యవ్వెన్నుని ముక్కు నామనమునం దీపించి వ్యాపించి యా
రని దీపంబయి రేఁ బవల్వెలిఁగి యారాటంబుఁ గావించెడిన్॥ 662

మ॥ అమలంబైన ఫలంబో? నాదయిన క్రూరాఘంబో? డంబైన వి
ద్రుమఖండంబో? యెఱుంగ కార్మొయిలు తీరుంగేరు మేనారు దై
వము బింబాధర మేను జూచు దశదిక్ ప్రాంతంబులందుండి నా
దు మృదుప్రాణముఁ దీయ వచ్చినటు కందున్ నిచ్చలో నెచ్చెలీ!॥ 663

మ॥ అనువుం బ్రాణముఁ దీయ దుర్బలుల నేయన్ వంగు నీలప్రభా
ధనువుల్ రెండో? సురూప సంభరిత కందర్పేక్షు కోదండ మో
ననవిల్లున్ గనుతండ్రి కన్బొమలొకో? నావంకకున్వచ్చి నా
మనసుం దామెదిరించి నిల్చి బెదిరింపం దోచునే చాయనున్॥ 664

మ॥ తిరమై యెల్లెడఁ గుల్కు నెట్టనగు కాంతిం జిల్కు వెల్వెల్లనౌ
మెఱుపో? నామనసున్ హరించు సొగసో మేల్ముత్తెపుంజాలో? యే
నెఱుఁగన్ భూధరధారి కృష్ణు చిఱునవ్వేమో? మదీయాత్మ నా
తురపెట్టుం గద యమ్మలార! మనునెత్తున్నేర నొండక్కటా!॥ 665

మ॥ "బ్రతుకుం దెఱ్వొక యేది? కామినులకున్? రక్షోజనశ్రేణి కే
గతి?" యంచుం జిగిమించి వ్రేలు మకరాకారంపు పత్త్రాలో? యా
యత భోగోగ్ర విషోద్వమత్ఫణిపశయ్యాశాయి శ్రీకుండలాం
చిత కర్ణంబులో? చూడుఁడీ! విడవు నన్ జీకాకుఁ గావించెడిన్॥ 666

మ॥ కనరమ్మా! యని చూపనౌ వెరవెఱుంగన్ దల్లి! శుక్లాష్టమిన్
గననౌ తెల్లని చంద్రుఁడొక్కొ? యనురక్తస్త్రీలకుం దుర్విషో
ల్బణమౌ మూలికయో? చతుర్భుజుని శుంభద్వక్త్రమో? కట్ట! నా
మనసున్ సొంపడఁగింపఁ జేరి తఱుచై బాధించు నాప్రాణమున్॥ 667

శా॥ నైజాలంకృతి నొప్పు రత్నలతికా నాళీకకోదండముల్
నైజాలంకృతి నొప్పు మౌక్తిక నిశానాథ ప్రవాళంబులున్
నైజాలంకృతిఁ గొన్న పూర్ణరుచి మంతంబైన వ్రింతంబొకో?
నైజౌజ్వల్యము కృష్ణమూర్తి ముఖమో? నాప్రాణమున్ లోఁగొనున్॥

శా॥ లోకాల్ ప్రింగి చెలంగు చీకటుల నూలుంబంతిలోఁ బైపొరల్
గాకంతఃస్థిత నీలగోళమున నూ ర్ దారంబులో? కావు మా
యాకృష్ణ ప్రభు కేశముల్ వికచపుష్పాబద్ధ విష్ణుప్రియా
స్తోకామోదముఁ జల్లి నన్ గలచె పొల్తుక్! తిట్టుచుండ్రిజ్ఞతన్॥ 669

మ॥ జననుల్! వాకిట నిల్తువే? యనుచు హస్తాలెత్తి తర్జించి నన్
జననీ కిట్టటుఁ జుట్టి తిట్టెదరు తేజః ప్రఖ్య మాణిక్య కాం
తిని ముల్లోకములందు నింపు హారికాంతి ప్రస్ఫురన్మాళి నా
మనసున్ వశ్యముఁ జేసికొన్నదిటుపై నా యాస మీకేటికో?॥ 670

—♦ఫలశ్రుతి♦—

చ॥ కనుఁగొనఁ గాని బ్రహ్మశితికంఠ బలారిముఖాది దేయులున్
గనుగొనఁ గాని కృష్ణునకుగాఁ "గురుకూరు" శఠారియోగి జె
ప్పిన శుభమా సహస్రమున బ్రీతిగ పైపది నభ్యసించు స
జ్జనుఁడును నిత్యసూరిజన సంగతి బొందును పాయడెన్నఁడున్

## —♦ఎనిమిదవ పది♦—

శా॥ రావే! మాయుఁడఁ వామనా! మధుమదప్రధ్వంసనా! నాయెడన్
నీవే నేలయు గాలి కీలి నభమున్ నీరమ్మునుం దల్లివౌ
దీవే! తండ్రివి పుత్రమిత్రులును నీవే! శేషమున్ నీవునున్
నీవే! యిన్నిఁట నీవయున్న విత మేనీమంబొ? యే హేతువో?॥ 671

మ॥ మకరంద ప్రసవ ప్రశస్త తులసీ మాలాంచితా! యచ్యుతా!
నక్స్వపం జూడు రమ్యంబు తారలిరులున్ సరగంబును స్నీవ! వ

ర్షక మేఘుంబవు నీవ! ఖ్యాతివిని దుష్టఖ్యాతివి న్నీవ! త్ర్యం
బక రూపుండవు మృత్యువీవ! యివియో! స్వామీ! బలే చిత్రముల్॥

మ॥ అరుదైనట్టి శతాంగ చోదకుఁడ చక్రాన్వీత! విచ్ఛేయుమీ
కరుణన్ సర్వయుగాధినాథ! చనుఁ బల్కాలంబులం దిగ్గచున్
సరియై యున్నవి నన్యమైనవిగ నెంచం గానివా చేతనో
త్కరముల్ నీవట! విస్మయాత్మక! భవద్వ్యాపారముల్ చిత్రముల్॥

మ॥ మకరందాంచిత ఫుల్ల పద్మనయనా! మాటేని యొండాడవే!
సకలానశ్వర నిత్యవస్తువులు నాశస్థానముల్ నీవెగా!
ప్రకటాంభోధి విషోద్వమత్ఫణిప తల్పస్థుండవై యాత్మఁ బల్
రకముల్ జింతలఁ జేతు లోకరతి నారా! యే యుపాయంబులో?॥ 674

శా॥ బంధాల్ ద్రెంచి త్వదేక వశ్యునిఁగఁ బ్రోవం గొంటి పుష్పోద్గమద్
గంధశ్రీ తులసీ కిరీట! హరి! నా కాయంబు, జీవాత్మ సం
బంధం బంతయు, జన్మ మృత్యువులు, దేవా! నీవ నీమాయలన్
సంధానం బొనరింతు వీపనుల నీచందాలు దుర్జ్ఞేయముల్॥ 675

మ॥ భ్రమదా! వామన! నిన్నెఱుంగునొక సూత్రంబున్నఁ జెప్పంగదే!
భ్రమలుం జ్ఞానము లుష్ణ శీతముల భావంబీవ! చిత్రాతి చి
త్రములుం జిత్రితనీవ గెల్పులునుఁ గర్మవ్రాతమున్ దత్ఫలం
బు మహాదుఃఖమునీవ నీ యునికి చొప్పుల్ వేదనాపాదముల్॥ 676

మ॥ వెతఁ గావించెదు మాయకృష్ణ! పొడవై వెల్గారు నీ మూర్తితో
వెతలం గూరుచు మానము, న్మదము,ఁ దృప్తిం గూర్చు సంతోషమున్
దత కామంబులునున్, బ్రమాణములున్ స్థైర్యంబు యానంబులున్
గతి నీవే యయి దుఃఖపెట్టెదవు చెల్గాటంబొ? నీ కీపనుల్॥ 677

శా॥ ఓ' నా యేలినవాఁడ! నీవితము లేమో? చెప్పకున్నాడవే '
జ్ఞానుల్ నిన్ను 'ఫలాన' పోల్కి యని పోల్చం గాకనాది ప్రపం

చానన్ బూని జగాల్ సృజించి మఱిలో నన్నిండి పైనుండి లో
కానీకంబును నిర్వహింతువిది యేఁరా? ఏమి చందంబురా?॥ 678

మ॥ ననుఁ గన్నయ్య! య దేస్వభావగతి నున్నావయ్య? పాణుల్ పదాల్
మునుగా నుండెడు నంగపాళి వలనన్ భుక్తంబులౌ స్పర్శ, వా
సన, శబ్దంబును రూపమున్ రసము నీచందాలె యత్నించి నిన్
గనుచో నీవు వినా పదార్థములు సూక్ష్మాలైననున్ లేవుపో!॥ 679

మ॥ కమలాబద్ధ హరిప్రియా లలితవక్షా! యచ్యుతా! నీకు భి
న్నముగా సూక్ష్మపదార్థమున్ గలదె? ప్రాంచద్వేదముల్ దెల్పు స్థూ
లము సూక్ష్మంబును నీవ; యోపి యొకలీలన్ నీది వర్ణించు మా
త్రమునన్ దానవె నీస్వభావ పరిపూర్ణత్వంబు సంప్రోక్తమే?॥ 680

## —♦తొమ్మిదవ పది♦—

మ॥ కలకాలమ్మును సాగు కాలముల నన్ గారామునన్ సాకి నా
కలఘు స్వీయవివేకమిచ్చి తన యుద్గ్రంథంబు నాచేత నిం
పులుఁ గుల్కం ద్రవిడంబునం బొనరు ప్రొప్పుం జేసె నీశుండు ను
జ్వలుఁ డాద్యుండిఁక నేమిఁ జెప్పికొని నిల్వన్ నేర్తు? పత్యర్థమై॥ 681

శా॥ తానే యిష్టు మదాత్మ నానొకఁటియై దైవాఱ నాపల్కులన్
నేనేఁ బల్కిన నవ్యకావ్యమను భంగిన్ వెల్లడిం జేసి స్వీ
యానూనోక్తులఁ దానె తన్ బొగడు మాయావర్తి మూర్తిత్రయే
శానుండాద్యుఁడు నాకు మున్ బలుకు నే జాడన్ బదుల్ దీర్చెదన్?॥

మ॥ ఇతఁడే మూలమటన్న జ్ఞానమును నా కిప్పించి నా జిహ్వపై
కుతుకం బొప్పఁగ ముందె చొచ్చి రసవద్గాఢ ప్రబంధంబుఁ బా
వితులున్ ముఖ్యులునైన భక్తులకుఁ దృప్తిం గూర్ప తన్ దానె కీ
ర్తితుఁడౌ మత్కృతికారకుం డితని మూర్తిన్ నేమఱన్ నేర్తునే?॥ 683

చ॥ మఱతునె? యెన్నఁడేనియును మాధవు నప్పను నన్నుఁబూన్చి యే
నెరసులులేని వైతల సరణిం దనయంతనఁ జెప్పి పాప దు
ర్భరు ననుఁ బైకిఁ దీసి స్వకృపాకమనీయ కటాక్ష వీక్షణన్
బఱచుచు నన్నుఁ బ్రోచెడు స్వభావమెఱింగి యెఱింగి యాపయిన్॥ 684

ఉ॥ శీలరమన్ గ్రహించుటకు శిక్షితమున్ సనులక్షణంబు ర
మ్యాలపనంబునై భగవదర్థమునైన కవిత్వ భంగికిన్
జాలని జ్ఞాన హీను నను స్వప్రతిమాను నొనర్చి నా వచో
జాలము నుర్విపైఁ బఱచు, చంద మొనర్చినదెట్టి ప్రీతియో॥ 685

చ॥ పరమ కవీశ్వరుల్ మధురపాటవ చిత్ర కవిత్వచాతురీ
నిరతులునుండ స్వీయ మహనీయ చరిత్రము వారిచేత చే
త రచనఁ బొంద కిప్పుడు ముదంబున నన్విడకుండి నాకె నా
పరమ పదాధినేత నిజ భవ్యకవిత్వముఁ గూర్చుఁ గూర్చెడిన్॥ 686

శా॥ వైకుంఠాధి విభుండు నాయఘమునున్ భంగించు శుద్ధుండు నన్
జే కొన్నాఁడు, తనంత వానిగను నాచే స్తుత్యుఁడై చుంట నే
వైకుంఠుండగునట్లు, స్వీయ విషయ ప్రాంచత్క విత్వాప్త శు
ద్ధా కారుండగునట్లు, లెంచె నతనిం ధ్యానించినం దీరునే? ॥ 687

మ॥ తగకున్న న్ననుఁ దాసమానునిగ సంధానించి నాచేత ఖ్యా
తి, గడింపం దనుఁగూర్చి మంచికయితం దీరారఁజెప్పించె నీ
మొగ మోటంబున కాత్త చకుృడగు నాముఖ్యేశు సత్కీర్తి భూ
గగనస్థాఖిలభావ మూని పొగడంగా నైన సంతృప్తియే?॥ 688

మ॥ మఱపునులేని నన్ దన సమానునిఁజేసి స్వకీయగాథఁ బల్
తెఱఁగుల తీయకబ్బములఁ దేలుచు నా వలనన్ బొసంగఁ గా
నెఱపెడి నిట్టి సత్కృతికి నిత్యసమర్థుని విష్ణు సద్గుణో
త్కరమును నెల్లకాలము స్తుతంబు నొనర్చిన నాకుఁ దృప్తియే?॥ 689

మ॥ ఇఁక మాటెయ్యది వాని సత్కృతికి? లేదే యాత్మనా? ఁజిత్తగిం
చి కనంగా నిపుడాత్మయు న్నిగులకా శ్రీదేవు సొత్తయ్యె స్వీ
య కృపాబోధక సాధుమంజుల కవిత్వారంభుఁ గావించు సా
మికిఁ జేయన్ బ్రతి యొండొకింతయును భూమిన్నింగినింగల్గునే?॥ 690

## —•పదియవ పది•—

మ॥ కమలామాతయుఁ దాను సౌఖ్యముగ లోకాలేడు సౌఖ్యంబుఁ గాఁ
దమితోఁ గ్రోలుచు నేలు మా ప్రభువుఁ బ్రీతస్వాంతుఁడై నీవివా
సముఁ గావించు మనోహరోపవన జుష్టంబైన *"వారన్విళా"
ఖ్యము గ్రామమ్ముఁ బ్రదక్షిణించికొని మొక్కంగల్గు టెన్నాళ్లకో?॥

మ॥ పొరయం గూడునో? సంశయంబునకు తావున్ లేక లోకంబులన్
జరణద్వంద్వముచేతఁ గొల్చువటు వాసంబై నభంబున్ ధ్వజా
లొరయన్ గోటలు మేడలున్ దనర బాలోద్యాన సంతానమా
"తిరువారఱన్ విళె" గంధతోయముల భక్తిం జల్లి చుట్టుం జనన్॥ 692

మ॥ హరి గోవిందు మధుప్రహారకుని సింహక్రాంతుఁ గాంతోద్గమ
ద్గరు డారోహునిఁ గాంచి మొక్కి హరిక్షేత్రంబై చతుర్వేద వా
గ్వరులై జన్మములైదు నంగములషట్కం బారు వారున్న యా
"తిఱువారన్ విళె" నాశ్రయించునటు లేదీ? నిచ్చలుం గల్గునే?॥ 693

మ॥ చెఱుకుల్ కొల్లగ నెఱ్ఱడాల్ వరిపొలాల్ చెల్వొంద పొంపైన యా
"తిరువారన్విళె" నర్హాకీర్తి త్రిజగద్దేవుండుఁ గొల్వొందు ను
త్తరమందా మధురాపురిన్వెలసె నుదయన్నీల వర్ణుండు శ్రీ
హరి యంఘ్రుల్ మన మింద యుండి మది నిత్యంబెంచ సిద్ధించునే?॥

మ॥ స్ఫుర దంఘ్రిద్వయి నాదు చిత్తమున నెప్డు న్నిల్పి దాసాళి ముం
దఱ నాకాశ్రయ మిచ్చి శేషశయుఁ డందం బొప్ప నున్నాఁడు త
ద్గురుకీర్తిన్ మణిసౌధ వప్రములుఁ బూఁ దోటల్ సదాయొప్పు నా
"తిరువారన్విళె" యంచు పాడి కలుషార్తిన్ బూర్తిఁ జెండాడెదన్॥695

మ॥ అరినాఁడోడిన యాఁడె రుక్మిణి భుజాలాశ్లేషమున్ జేయు శ్రీ
వరు మైనందినమున్ సదా మతి నుతింపం గూర్చుచున్నట్టి మేల్
"తిరువారన్విలె" యన్ బురంబు మదిఁ జింతింపుండి చేరుండి ధీ
వరులారా! యొకపాపమున్ న్మిగులకే పాయుఁంజుఁడీ! యన్నియున్॥

మ॥ "తిరువారన్విలె" యే పరం పదముగాదే? పుష్పితోద్యాన సుం
దరమందుండు పరుండు నాశ్రిత జనత్రాణుండు కృష్ణుండు త
త్సుర నాథుండని రుద్రునోంచి భుజధూర్తున్ బాణునోడించెమా
శరణంబాతఁడె వేఱుపాయమును నెంచన్ మాకు లేకుండెడిన్॥ 697

మ॥ శరణంబీవె! మఱొండుఁ గాదనుచు విస్తారంబు గంభీరమా
సరసిన్నిల్చి స్వపాదమెంచిన గజస్వామిన్ సుఖం జేయు శ్రీ
హరి, వాసంబయి ప్రీతిఁ జేయు సఫలోద్యా నావృతంబైన యా
"తిరువారన్విలె"ఁ జుట్టి రానగునె? యార్తిం బాయగాఁ గల్గునే?॥698

మ॥ దురితం బుల్లముపట్టువీడఁ దెలివిం దూగించు స్వర్గాప్తి సం
బరముం బొందక డెంద మెల్లఱు మనోవాక్కాయ కర్మంబులన్
స్థిరులై దేనినమస్కరింతు రెట సందీపించుఁ బూఁ దోపులా
"తిరువారన్విలె"ఁ జేరి యుండుటకె చింతించున్ సదా మ్రొక్కుచున్॥

మ॥ ధరణీ దేవులుఁ జిత్తవాక్తనువులన్ దన్ గొల్వఁ జెల్వొచ్చు నా
"తిరువారన్విళె" నున్న తీర్థనకె మత్ చిత్తంబు తా శేషమై
మఱివేఱెందు మెలంగ నేరదని శ్రీమంతుండు దేవేశ్వరుం
డెఱుఁగుం దా నెఱుఁగండు నామనసునం దేయొండు మాయంగనన్॥700

* గ్రామనామము





# శఠకోపగీతామృతము.

## ఎనిమిదవ శతకము

—♦మొదటి పది♦—

మ॥ సిరియుం ధారుణి రాణు లానతిని సంసేవించు జేజేలు నీ
పరివారంబు జగత్త్రియంబును భవత్పాల్యంబు వేళార్హ్వా సుం
దర మున్మేనులు పద్మనేత్ర! మణివర్ణా! ప్రాణనాథా! సుధా
ధర! న న్వేపకు మప్ప! అబ్ధి మథనా! దాసుండఁ గన్పింపవే!॥ 701

శా॥ కానం గొల్పు మటంచుఁ బెక్కు మొఱలం గావించి దుఃఖించి బా
ష్పానద్ధాత్ముల గంపెడాసపడ నీ యాఖ్యల్ జపింపంగ సం
ధానంబయ్యెను రామ! కృష్ణ! ఖలుఁడన్ నా కల్పపాకంబ! ఆ
శానందామృత! ఉద్వృతాంబుధిగతాజాండా! మహాపూరుషా!॥ 702

సీ॥ ఎత్తుకొనిన భాగ్య మేపారు నందుని ప్రాణపదుడవైన బాలకుండ!
అల్ల యశోదమ్మ నలరింప గడుకొని వచ్చిన యానంద వైభవంబ
అడియండుపొంద దురాపహుండవుస్వామియూహవకండూతి యడఁగకున్న
చెడుగు హిరణ్యుని యొడ లిరుపటియలుగాఁ గోళ్లఁ జీల్చిన కడలి వీవు

గీ॥ నిప్పుడనురూపమైన మేనేదియేని గొనుచు విచ్చేయకున్నావు కనుల బడగ
నా కెఱంకెట్లు నీవనినమ్మికొన్న కొదువ శ్రితులకు విశ్వాస మొదవు? ననఘ'

శా॥ అంతల్ పోరులొనర్చి నేల విరియన్ వ్యాపించు సైన్యాల నా
ద్యంతం బూడ్చిన సామి! దివ్యసుధ! దైత్యత్స్వేళ నా ప్రాణమా

కాంతా! ఆశ్రితభోగ్యమూర్తిఁగొని వేడ్కం జేయు నీమాయ శం
కింతున్ బాపుఁడ నాట నిన్ గనమి నీ నీమంబు లేవే? ప్రభూ॥ 704

శా॥ పంచప్రాణ సమాన! నేల నుదయింపం జేసి పైఁదీసి లోఁ
గొంచున్ బైనిడి కొల్చుపోఁడ! జడధిం గూర్పంగ నందుండ నం
దంచద్భంగి మథింపఁ గట్టఁ దెగ నేయ న్నేర్చు సచ్ఛీల! నిన్
గాంచన్ లే మమరుల్ నరాళికి వలెం గన్పింతు దేవాళికిన్॥ 705

శా॥ నీవే! సప్తజగంబులా దచటి ప్రాణి శ్రేణి యా దేవతల్
నీవే! పొంగి పయిం దొలంగుఁ బొరలున్నీవే! లయం బొందు నా
పై వర్తిల్లెడు సూక్ష్మతత్వములు సువ్యక్తంబులా జీవులున్
నీవే! ఇట్లయి యుంట నిన్నెచటఁ దండ్రీ! నేనుఁ బ్రాపించెదన్॥ 706

మ॥ నవదుగ్ధంబ! ఘృతంబ! తద్ ఘృతరసాంతఃస్థా! సుధా! తత్సుధా
భవదంచద్రస! తద్రసాత్మ! పరిరంభకాంతినీళా! భవ
ద్భవితవ్య ప్రగతార్థ సంచయము నీ భావంబె ఇట్లాట న
య్యవియు న్నియ్యవి యెయ్య వీవెయని పాపాత్ముండ నేనేర్తునే?॥ 707

శా॥ మాయాలింగనకర్త! గోపమణి! నీ మాహాత్మ్యము త్రాటితున్
జేయు న్నన్నసుర ప్రహంత! గరుడాజేయధ్వజా! అబ్ధి సం
శాయీ! భోగికులేంద్రతల్ప! తనుభాషా చిత్తముల్ నీవికా
వే? యేనున్ భవదీయుఁడన్ దెలియరాదేరీతి నిన్ జేరుటో?॥ 708

ఉ॥ ఏ నీవాడను నీదె ఘోర నరకం బెగ్గయ్య? సౌఖ్యాస్పదం
బా నాకంబా? తదన్యమా నరకమో? యాఁ గాక యట్లయ్యునున్
నే నీవాఁడ నటంచెఱింగి నరకానీకార్తి కిం జంకుచు
న్నా నో! నాకనివాస! మోదమయ! నన్ శాదాలకుం జేర్పవే?॥ 709

ఉ॥ వేయి భుజాలు వే తలలు వేయి కనుల్ మఱి వేయి పాదముల్
వేయునుఁ బేరులొందుహరి! విస్తృత తేజుఁడ! అద్వితీయ! నీ

వేయఖిలంబు నీయడుఁగుఁ బ్రీతిని నిండుగ నాకొసంగి నా
వీయుపకారపుం బ్రతిగ నిచ్చితి రెక్కలుకట్టు కాత్మనే॥ 710

## —♦రెండవ పది♦—

మ॥ చెలియల్! బంధురకంకణల్! జననికిం జెప్పంగ సిగ్గాట నేఁ
దెలుప న్వచ్చియు మీకుఁ దెల్పఁ దగు సూక్తిం గాంచ శ్రీవేంకటా
చలనాథున్ గరుడాధియానుఁ గను నాసన్ బోయి పోగొంటి నా
పొలుపున్ జార్చితి గంకణా లురుకుచ స్ఫూర్తుల్ గృశించెం జుఁడీ॥ 711

మ॥ వరమేదేఁ గొనవచ్చి పొందఁ దగు నప్పల్ మీరు మీకేని నా
వరుసం జెప్పగ నేరనార! వికసత్పద్మాక్షుఁడా దొంగ ని
ర్జర నాథుండు మదీయనాథుఁ డతనిన్ రాఁ జూచి వాఁడొందు నా
మురిపెంబున్ మురువుల్ మరల్చికొన నెప్డుం జిక్కి వాపోయెదన్॥ 712

శా॥ నీలాభా పరివృత్త నీరద కళాన్వీతుండు కృష్ణుండు నా
కేలన్ మువ్వను మేన మువ్వఁ గొనె భక్తిన్ వెంట నంటాడితిన్
నేలన్ నిందలఁ గంటి సిగ్గులిఁక తన్వీ! యేల? వెన్ దీయ నీ
కాలంబే వెనుఁదీయుఁ గాక హరినేఁ గాంతున్ విడన్ నెచ్చెలీ॥ 713

మ॥ ధ్వజసౌధ వ్రజ వప్రశోభిత "కుళంద" గ్రామ పశ్చాద్ గతున్
ద్విజరాడ్యాను మనోజ్ఞవర్తను జయద్దివ్యాయుధున్ గొల్చి వె
నకఁ జనం గంకణ ముల్ల మెల్లయవి యండం బాసె రావింక పం
కజనేత్రిల్! ధృతకంకణల్! పరువె పోఁ గంటిన్ మతేముండెడిన్?॥714

మ॥ చెలియా! ఎంతటి జ్ఞానవంతులకు నీచెల్వంబు వాఁడంచునుం
దెలియంగాఁ బడడెట్టకేనియు ననాది ప్రజ్వలాకారుఁడున్
గలితోపాయుఁడు చక్రి లోకపతియాఁగా! వానికైఁ గొల్చు ట
వ్వల వాఁడాగతుఁ డాటయు న్మన వశంబా? చెప్పనున్ శక్యమా?॥

మ॥ తరుగుల్మాది లస"తుక్కడంద"పురి నిద్రాముద్రితాక్షుండు సుం
దర తేజోమయమూర్తి నానుడుల కందన్ రాఁడు జేజేలకే

యరయన్ రాఁడది యట్టులుండ మఱి నాయందంబుదోఁచెన్ విక
స్వరమా చల్లని పూలమాల నిడఁ డీపై నేర్చి కై నామొఱల్?॥ 716

శా॥ నావాఁడై హరి! మాలి! కేశవ! యనన్ నారాయణా! మాధవా
గోవిందా! యన నచ్యుతా! యనగ నాకుం ఘోషిలం గూర్చి యే
తావంతుం దన గుర్తుఁ జూపకె విడెన్ దల్లీ! మఱేమందు? సం
సేవింతు న్నిజమెన్నడే నతని; విచ్చెన్ నాకు మీాబంధముల్॥ 717

శా॥ నే నాడించుచు బెంచు చిల్కలు! పికాల్! నెమ్మిల్! విడెన్ మీాకు నా
కీ నేస్తంబులు ముర్వ నెమ్మది ముదం బీతండె కొల్లాడె తత్
స్థానుల్, వేంకటశైల వారిధి పరంధామంబు లాసన్నముల్
వానిం గన్గొన నౌనె? సాంతముగ సంబంధంబులం దెల్పకే?॥ 718

శా॥ ఏరిం గన్గొన నీడు తన్ను మనచేయిన్మించె శ్రీవామనా
కారంబున్ మృషఁ జూపి భూదివము లాక్రాంతమ్ముగా లేచి తే
జోరూఢోన్నత బాహుజాలధరుఁడై శోభించు జేజేకె నా
సారున్ సిగ్గు నొసంగితిం జెలియ! యే సామగ్రి యీాతున్నదే?॥ 719

మ॥ "దరినింకుండన"టంచు స్వాంతము ననున్ దా వీడి చంద్రానా!
దరచక్రించితుఁ డౌచు; పాలవలె నందంబైన జాబిల్లితోఁ
గిరణోద్దీప్త విభానుతో దరియు భంగిన్ బొల్చు నీలాద్రియన్
గరణిం గన్పడు విష్ణు; పాదమొరసెన్ గార్యంబు లేదీపయిన్॥ 720

## —•మూడవ పది•—

ఉ॥ అందును నిందు నెందు నమరాసురముఖ్యులు నిన్నుఁ గూర్చి నీ
పొందగు చందముల్ దెలియు పోడిమి నేరమి నేమొ చెప్పి శ్రీ
సుందరి, నేల, నీలయును సొంపెలారెడు మేనువాఁడు మ
మ్మొందఱి శంఖ చక్రధరుఁ డాతఁడ పోల్చు నటండ్రు శ్రీహరీ!॥ 721

మ॥ శరణోపాయముఁ జెప్ప నాల్గుశ్రుతులున్ శాస్త్రంబు లున్నేరకే
కరణోపేతచమూా సమూహములు పిక్కల్ జూపి నిశ్శేషులై

పరవంజేయు సుదర్శనాయుధము శేవన్ బూను సర్వేశు కిం
కర సంఘంబులమై జయించితిమి జన్మవ్యాధి వార్ధక్యముల్॥ 722

శా॥ నేలం దాసులఁ బొందలేదు మఱి తానే శంఖ చక్రంబులం
గేలం దాలిచె నందకంబు ధనువున్ జేకొంచు నవ్వేంటఁ బోఁ
గా లేకుండె నొకండు శ్రీచరణయుగ్మంబున్ భుజద్వంద్వమున్
గేలారన్ భజియించు కింకరుఁడ నన్వేషించి కాంచన్ గదా!॥ 723

మ॥ జగమున్ బుక్కిన యొక్క లేబుడుతవై జ్ఞానైన న్యగ్రోధ ప
త్రిగతిం జీర్ణముఁ గొల్పఁ బండుకొను నాథా నీవు సభ్రాభతోఁ
దగు రూపుం గనఁ గోరి క్రుంగు ఖలుఁడన్ దాసుండ నాకుం దమో
యుగమై తోఁచు నిమేషమాత్ర మితమయ్యున్ సాగుకాలంబయో!॥724

మ॥ గుడులున్ మేడలుఁ గేతువుల్ గల "తిరుక్కోడూరు" నందున్ "బుళిం
గుడి" యందుం జలియింప కీవిటువలెన్ గూర్కొంది మోదింతు నీ
యడుఁగుం గాపుల దుఃఖముల్ జెఱుచు నాయాసంబు చేసేమొ? యి
ప్పుడమిన్ వర్ధిలి కాలఁ గొల్చు శ్రమపెంపుం బొందితో? చెప్పవే!॥725

మ॥ పరదైవాశ్రియ హీనులౌ సురల చేపట్టైనవారై గుణా
కరులై సుందరులై సుదర్శనము శంఖం బూను వారే యన
శ్వర మాయారుజల న్వదల్ప మణి కృష్ణచ్ఛాయ నెమ్మేనితో
ధరకు న్వచ్చుచు నుంద్రు నాపిరికి చిత్తం బుత్తలం బొందగన్॥ 726

శా॥ రాకల్ పోక లొనర్చు మీరు "పరికార" గ్రామ సంవాసియున్
నాకున్ జేఁ డగు శ్రీనివాసునకు శంఖంబున్ లసచ్చక్రమున్
జేకొంచున్ భవదీయ పార్శ్వ గతుఁడై సేవింప దాసుం డొకం
డీ కాలంబున నుండె నంచు నను నేమీ? చెప్ప రింకేమగున్?॥ 727

మ॥ ధరణిన్ సప్తకులాద్రి సంయుత; ససప్తద్వీపనున్; సప్తసా
గర సంవృత్తను నిల్చి కొల్చిన సుదీర్ఘంబైన పాదాలు భా

స్వర చక్రింబునుఁ గల్గు దేవ! నను భూషాభాసితంబైన శ్రీ
చరణ ద్వంద్వము క్రింద దాసునిగ నుంచం దల్చు టెంకెన్నడో?॥ 728

మ॥ వనమాలీ విధియో? జటాధరుఁడో? యెవ్వారయ్య! సర్వేశ! నీ
గుణకల్పం బెఱుఁగంగ నర్హులు? ననుం గుందించు ముఖ్యాది కా
రణభూతుండ! సమస్తవస్తుపతి! సార శ్యామవర్ణుండ! దా
సునిగాఁ జేసితివంచుఁ బల్కెదను విష్ణూ!దాన నేమయ్యెడున్?॥ 729

మ॥ కలఁ కల్ లేని తపోనిధుల్, మునులు, ముక్తశ్రేణి, గీర్వాణ ని
త్యులు వీరందఱుఁ గొల్వ నర్హులయి తారున్నారు వారాన్నిధిన్
గలఁ గంబాఱగఁ జిలుకువానినిఁ ద్రిలోకస్వామి సంపూర్తిఁగా
నలితో స్తోత్రముఁ జేయుటన్న మనకున్ సాధ్యంబౌకో? చెప్పఁడీ!॥ 730

## —♦నాల్గవ పది♦—

సీ॥ దాన ధారాఝరీధారి గంధేభాద్రి దంతశృంగద్వయీ ధ్వంసుఁ డగుచు
దొరలించి నడిపించు కరి మావటీనికి యసువులఁదీసిన యముడ యగుచు
అంగణంబందు చేరంగ మల్లుఱనెల్లఁ జంపి నల్తట్ల మంచములనున్న
రణ ధురంధరులైన రాజులు వెనుఁదీయ మేడపైఁ గంసుని మీది కురికి

గీ॥ చంపు కల్యాణ గుణుఁడైన స్వామి బాలగోపుఁ డుండెడి "చంగన్నూర్" దాపునందుఁ
బాఱు "చింగాఱ" యనునేఱె ప్రాపుమాకుఁబోయి పొందగఁ దగి యున్న పుణ్యభూమి॥

శా॥ మా కొండందగు ప్రాపు మాయమృతమున్ మాస్వామి యా దేవతా
నీక స్వామి సమృద్ధలోకచయమున్ సృష్టించి రక్షించి తా
నై కూలింపగఁ జాలు మూర్తులును మూడై మాయుఁడౌ వాఁడు మ
త్సాన్య కీర్ణామృత నీరపూరిత తటాకాంచత్ "తిరుచ్చెంగ నూ"

రేక గ్రామము దాని చెంగటనె సొంపేపారు "చిన్నాఱు" యే
రా కమ్రస్థలమందె తా నమరి లోకాధ్యుండు వాసించు భూ
లోక ప్రకట పారమార్థిక కృపాలోలుండు వాఁడొక్కఁడే
గాకెవ్వాఁడిఁక నాకు సాయ మరయంగా? నాశ్రయోన్నతిన్॥ 732

మ॥ అనురూపుండగు సామి నా కఖిలదివ్యస్వామి యాభూమిఁ గొ
ల్చిన నా సామి యనాది పాపచయమున్ శీఘ్రంబుఁ గానెల్లఁ ద్రుం
చిన నన్నేలినసామి దక్షిణదిశన్ జెల్వౌ "తిరుచ్చెంగనూ"
రను క్షేత్రంబునఁ బ్రక్కపాటుఁగనె డాయం బాఱు "చెన్నాఱు" యే
ఱునకున్ బశ్చిమభాగమందు తన సొరున్ దీరుఁ జెన్నార ని
ల్చిన నా సామి పరాత్పరుండు శ్రిత సంసేవ్యుడుఁ గానుండు నా
తని శ్రీపాద సరోజ యుగ్మమొకఁడే తక్కన్ మనోవీథి యం
దును నాకొండొక యాశ్రయంబు నెపుడెందున్ బొందగా నుండునే?॥

మ॥ గురువైశాల్య జగత్రయంబు నలుదిక్కుల్ నిండగా మేనుఁ బై
బెరుగన్ బెంచిన బ్రహ్మచారి, హరి, యబ్ధిం జిల్కు నాసామి, సుం
దర మాణిక్య కలావిలాస తనుఁడౌ నాసామి, పెంపై గెలల్
పొరయంబొల్చు ననంట్లు ,కొబ్బెరతరుల్, పోకల్ దెసల్ నిండి పల్
వరుసల్ గట్టగఁ గంటి పండువఁగ చెల్వంబౌ "తిరుచ్చెంగనూ"
రొరయన్ బాఱు "తిరుచ్చినాఱు" నది యీ రొడ్లందు వాసించు వా
రరయన్, దా, నయివచ్చి నిచ్చలు యథార్థాకారుఁడై యుండు నా
పెరుమాళ్లాతని యడ్గులే శరణముల్ వేఱొక్క దిక్కున్నదే?॥ 734

మ॥ అల, యూరైన మఱొక్కయూరయిన సర్వాధీశు క్షేత్రంబులై
యలరుంగొంట యథార్థమైనను, మదీయంబైన యీయాత్మయ
స్థల దైవంబునె కాక యాసపడి క్షేత్రంబన్యముం జేర ద
వ్వలనన్ వాని నివాసమైనదియు, సర్వశ్రౌత విద్యా సము
జ్వలులౌ సాధుల కాలవాలమును, యజ్ఞప్రోద్ధితాంచ త్పరీ
మళ ధూమావృత నాకభాగమును, రమ్యంబైన సౌగ్గోత్కరం

బెలయన్ బువ్వుల తోఁటలున్ జెఱువులెందే నుండు నా 'చెంగనూర్
చెలఁగున్ దీప్తిని నందుఁ బాఱెడు "తిరుచ్చిన్నాఱు" నా దిక్కఁగున్॥735

మ॥ తరణోపాయమ్ము నాకు ప్రాణపదుఁడుం దద్దేవతాశ్రేణి కం
దఱకుం దల్లియుఁ దండ్రి తానె తన నిత్యప్రాభవాధిక్యమున్
నెఱుఁగన్ న్నేరనివాఁడు వారినిధి యందే పొందుగాఁ బండు శ్రీ
హరిఁ జిత్తంబుల హత్తఁ జేసికొని శీలారాధ్యుఁ గా వాఁడు, బం
ధుర విజ్ఞానధురీణుఁడౌ శివునకున్, లోకంబులం జేయు వా
గ్వరుఁడౌ బ్రహ్మకు విష్ణుకున్ సములనంగా మూఁడువేల్ విప్రులే
పురి వాసింతురో? యట్టి సౌధవళులన్ బొల్పౌ 'తిరుచ్చెంగనూ'
రొరయన్ బాఱెడు నేఱు గంటి తమకం బొప్పార 'చిన్నాఱు'నున్ ॥736

మ॥ చెలువున్ నించెడు "చెంగనూరు" పురిలోఁ జెన్నారు 'చిన్నాఱు' యం
దలి సామిం గనుఁ గొంటి వాని కనుగెందమ్ముల్ జిగుల్ నింపు కెం
పుల సొంపుగ్గల సుందరాధరముఁ, గెంపుంజాయ పాదంబులున్
బొలుపౌ నెఱ్ఱని లేత చేతులును నంభోజాత పుష్పంబు తోఁ
దులకింపం దగు నాభి, యొఱ్ఱతొగ పొందుం బొందు వక్షంబు ర
క్త లసత్కాంతుల నీను చీరయును రత్నస్వర్ణ రక్తప్రభో
జ్వల కోటీరము చారుహారమును రాజచ్చక్ర ముఖ్యాయుధం
బులు నా యుల్లములోన నెల్లపుడు దీప్తుల్ నించి కన్పట్టెడిన్॥ 737

మ॥ ఇరవారంగ మదీయచిత్తమున హాయిన్ నిల్చి యున్నాఁడు ధీ
వరులై నాలుగు వేదముల్ జదువు విప్రశ్రేణి నల్దిక్కులన్
గరముల్ మోడిచి సన్నుతింప కడు భోగ్యంబౌ "తిరుచ్చెంగనూ
ర రయంబౌఱఁగఁ బాఱి పాడిఁ గల పేరన్ మీఱు "చిన్నాఱు"యన్
దరణీతీరము నందున న్వెలయునా ధన్యుండు తేజస్కలా
సురలం బ్రోచెడివాఁడు క్రూరతర హస్తుల్ రాక్షసుల్ వారి కా
వరమున్ మాపి, నిజోదరస్థము జగద్వర్గంబు సృష్టించి యా
దరతన్ బ్రోచియు సంహరించు హరి స్తోత్రం బాడగా నేర్తునే?॥ 738

మ॥ పలు దానంబులఁ బెద్దపేరులను సంపాదించి వీరింతవా
రలనన్ వన్నెకునెక్కి వెన్నుసరియై రాణించు వారర్థమున్
దెలుపన్నేర్చిన విద్దె విద్దె కనురీతిన్ విధ్యనుష్ఠానమున్
జెలగఁన్ గూడిన దేవతార్చనము నెందేఁ గందుమా "చెంగనూ
ర లలిం జెంగటఁ బాటి పాపములు పాఱన్ మీరు 'చిన్నాఱ' యం
దలి నా సామియె సృష్టి, రక్షణము, విధ్వంసంబుఁ గావించు శ్రే
ష్ఠులలో శ్రేష్ఠుఁడయైన బ్రహ్మ యతఁడే సుమ్మాతఁడే రుద్రుఁ డెం
నుల వాఁడుండు సమస్తమాతఁడె కదా! స్తోత్రాలు కావీనుడుల్॥ 739

మ॥ అనురూపేశుఁడె వీరు వారనఁగనై యా యాజనుల్ గోరు యా
చన సాఫల్యముఁ జేయు స్వీయకృప ప్రాంచచ్ఛీతకా సారముల్
దనరారన్ ఫల పుష్ప రమ్యవన వంతంబౌ "తిరుచ్చెంగనూ
రునఁ 'జిన్నాఱను' నొక్క ద్వీపవతి మీరున్ దాని తీరంబు నం
దున నావాసముఁ గొన్నవాఁడు; ననురక్తుల్ గణ్యసౌగుణ్యులున్
జణులౌ వైదికులైనవారుఁ ద్రిసహస్రంబుండు రవ్వీట నిం
కను భూదేవత లంద యుండ్రచటఁ బొంకం బొప్పు మాయుండు ము
కఱను లున్నాతఁడు నల్మోగాల యతఁడొక్కం డాతనిం గాంచితిన్॥740

## —♦ఐదవ పది♦—

శా॥ మాయామోహన వామనా! కనులునుం బాదాలునుం జేతులున్
బాయల్ విచ్చిన పూలు, మోవి మొగడల్, భవ్యాకృతి శ్యామల
చ్ఛాయల్ జల్లని పచ్చనాకులుగ నంచద్గంధి లాబ్జాకర
చ్ఛాయన్ బోల్చి యొకప్పుడేని గనుపించన్ నాకు విచ్చేయవే?॥ 741

మ॥ ఉదయాదిత్యు ధరించు నీలమణి నవ్యోర్వీధరంబట్లు కాం
తి దెసల్ నింపెడు కెంపుమాళి తలపై దీపిల్లునో సామి! రా
వె? దయన్ గన్పడుమంచు దేవురిలగా వెల్లెండె నోరుం గనుల్
పొదలెన్ సిగ్గు లలంగమాడి నను నెపున్ రావు నీవయ్యయో॥ 742

మ॥ బొమిడీకంబు తలన్వెలుంగుదొర! నీపూదండ నిండారు గం
దముతో రంజిలఁ గాంచి యేఢ్చెదను రత్నంబట్టి కెమ్మోవి యం
దముగా నాల్గుభుజాలు కుండలములుం గానుం గనుల్ దన్వగా
విమలాంభః పరిపూర్ణ వారిధర దీప్తిం గన్పడన్ రావలెన్॥ 743

మ॥ జల మధ్యంబున వెండికొండపయి నోజన్ వ్రాలు నీలాబ్దమున్
బలె, పుణ్యాంబుధి శేషుపై నిదురశోభన్ వ్రాలు నాసామి ని
ర్మల వాఃపూరితవారి దోజ్వలము నీమై, మంజులోష్ఠమ్ము తే
నెలు జిప్పిల్లెడు కన్నుదమ్ములు మదిన్ నిండున్ ననున్ దూల్చుచున్॥

మ॥ జలధి ప్రావృత భూరి భూగ్రసన! వర్షపో ద్యదబ్దాంగ! యు
జ్వల తేజంబునఁ బొల్చు నీదుపదముల్ బాలార్క యుగ్మంబు సొం
పులతో నా మదినుంచి మించగల చొప్పుం జెప్ప లేకుంటి నా
కులతా బంధురి తాంధకారమిఁక నాకుం జేర్పుగా వచ్చునే?॥ 745

మ॥ జలదాకార! ఘటాస్త్ర నృత్తచణ! కృష్ణా! దుష్టుఁడన్ నాకుఁ గన్
వెలుఁగా దీవ, యజాండనాథ!" యని నిన్ సేవింప గొంతెత్తియుం
బిలుతున్ నీ పరమాస్పదంబుననొ? పృథ్వీసీమ యందో? పయో
జలధి స్థానమునందొ? యెందొ? కననీ! స్వామీ! నినున్నొక్కెడన్॥746

మ॥ పొలుపై చల్లని యెఱ్ఱతామరల చొప్పుంగన్న కందోయి, చే
తులు, పాదా, లరుణాధరం బెసఁగ నెంమం గాంతులం జింది సొం
పిలు కృష్ణాకృని లాగుఁ దోచెదవు రావే! కానరావేని భూ
తలముం గొల్చిన నీ పదాబ్జముల క్రిందం గొల్వ నన్ బిల్వుమా॥ 747

మ॥ ఇది యే పాత్రొకొ? సామి! నీ యొడలితో నీడంచు నానాడు నె
మ్మది మబ్బుల్గన నేడ్తు గన్పడవు ధీమత్పాండవార్థంబు గా
నెదిరిన్ నూర్వర నాఁడు చేట్పఱచి మాయింపన్ బ్రవేశించు శ్రీ
పవిదమా నస్త్రను తేరి కొక్కడవు సారథ్యంబుఁ గావింపవో?॥ 748

మ॥ ఇదియా? పొత్తని వెక్కి వెక్కి పలుమాఱేనేడ్తు చక్రోజ్వలా!
యదనో తెక్కలు పక్కి తేజియు సిడంబై వెల్గు సామీ! విపద్
పరిద భూ భారముఁ దీర్పఁగా మధురస ప్రిసారితోద్యాన హా
ర్మ్యదగాశా మధురాపురోద్భవుఁడు మాయుండేమిఁగాఁ దల్చెనో?॥749

మ॥ జననాశ్చర్యము భారతాహవ మహాశ్చర్యంబునున్ దాటు నీ
ఘన సౌలభ్యము లెట్టి వొక్కో? జలమున్, ఱొమ్మ, నిప్పు, గాడ్పాక సం
బునుఁ దక్కుఁగలవీవె దుగ్ధముల యందున్ నేయిలాగన్నిటన్
గనరాకవ్వల నుండు వెవ్వలనఁ గానన్ నేర్తు? మాయామయా!॥ 750

## —♦ఆరవ పది♦—

ఉ॥ పూనిక రేఁబవల్ తన విభూతి స్మరించి మనంగ మాఱె సం
ధానముఁ జేయు స్వీయదయ నైజకిరీటము నందు శీతలా
నూన లతాంత మాలను గొనున్ హరి కాపురమై "తిరుక్కడి
త్తానము" నందు చెల్వుఁగల ధన్యుల తానమునందు వర్ధిలున్॥ 751

ఉ॥ దానవ గర్వమూడ్చి యనిఁ దత్తనువుల్ విదళింప నంపలన్
వానలొనర్చు వాఁడొకఁడె నాదగు చిత్తము నన్ "దిరుక్కడి
త్తానమ" నంగ బేర్వడిన తానపునందు నొకప్పుడే తిరం
బై నివసించె నాహృదయ మందుపకారకుఁడై వెలింగెడిన్॥ 752

ఉ॥ తానె, యొకండు నిర్వురుఁ బదంపడి మూవురనంగనై యొకే
మేనుఁ గనంగ నీయఁ డెదమీఁద సిరిం గలఁడా "తిరుక్కడి
త్తానము" నందు పొందుపడి తక్కినవాఁడును మాయలాఁడు నే
ధ్యానముఁ జేయునంత మధురాకృతియై కనుపట్టు చుండెడున్॥ 753

ఉ॥ మానితతేజులౌ సుర లమంద సుగంధవనుల్ "తిరుక్కడి
త్తానము" నందుఁ గాననగు తత్పురి వాసముఁగాఁగఁ గొన్న మా
యా నిరతుండు నా యఘములన్ని నశింపఁగఁ జేయ స్నేహమున్
బూని మదీయచిత్తమను భూమి నివాసముఁ గాఁగఁ జేకొనెన్॥ 754

ఉ॥ మానుగ కోవెలల్గల యమర్త్యుల సేవకునై పరంపద
స్థాని వసించువాఁడు ఘటతాండవ లోలుఁడునై "తిరుక్కడి
త్తానము" దావుఁగా తనకుఁ దాఁ గొనె నాపురితోడఁ గూడ నా
మానస సీమయున్ దనకు మాన్య నివాసముఁ గాఁగఁ జేకొనెన్॥ 755

ఉ॥ జానగు చెయ్యుల న్వేలయు సామియుఁ బాపుఁడనైన నావగన్
మానుపు సామియున్ మధుని మాపిన సామి వసింపఁ బుప్పితో
ద్యానము లొప్పఁ జల్లఁ దన మారగఁ బావనమౌ "తిరుక్కడి
త్తానము' సన్నుతింప భవ తాపము నిల్వదు చిత్తగింపుఁడీ॥ 756

ఉ॥ పూని ధరాదివంబులను బూర్తిగఁ గొల్చిన వెన్ను సుందరం
బైన పదాబ్జ ముర్విజను లందఱఁ గొల్వగఁ జేయు నాశ్రియ
స్థానము; స్థానమౌ సురలు సంతతమున్ గొలువన్ "తిరుక్కడి
త్తానము" దుఃఖముల్సడల దానినె చిత్తములందు నుంచుఁడీ॥ 757

ఉ॥ తాను పరంపదంబునను ధాత్రిని క్షీరసముద్రమందు నె
న్నేని పురంబులందుఁ దన కెంతయుఁ గాపురముండు శ్లాఘ్య సం
స్థానములుండ నాదయిన స్వాంతపదంబుననుం "తిరుక్కడి
త్తానమునందునన్ దనకు దాయపదాలని తావులం గొనెన్॥ 758

ఉ॥ మానిత పుణ్యతీర్థ మహిమంబులనెన్ని యనాదిదేవతా
స్థానము లుండు నన్నిఁటనుఁదా నివసించెడువాఁడు నచ్యుతా
ఖ్యానుఁడు గోపకేశుఁ డమరాశ్రితపాదుఁడు నా "తిరుక్కడి
త్తానము" నందు తావుగొనె తారసమై నిజ సత్కృపామతిన్॥ 759

ఉ॥ ధీనిధులైన వైదికులు దివ్యయశస్కులు నిచ్చలున్ శ్రుతి
ధ్యానము నింప కల్ప వనవైఖరి సుందరమౌ "తిరుక్కడి
త్తానము"న స్వసించు హరి దాసవశుండు నరాయణుండు మా
యా నిపుణుండు వామనుఁడు సాదరుఁడై నివసించు నామదిన్॥ 760

## —ఏడవ పది—

మ॥ తన సౌందారు పదారవిందములఁ గ్రిందన్ నన్ను సానందుఁడై
కొన నర్థించి చిరంబుఁ బిల్చితిని నన్ గూర్మిన్ బ్రవేశించి వా
మనుఁడే నాదుమనోరథంబుఁ గొని ప్రేమన్, నామెయిన్ స్వీయ శో
భన వీక్షానిచయంబులన్ బఱచి నాభావంబు నందుండెడిన్॥ 761

ఉ॥ చంచలమైన నామది వశంబొనరించుక మించు క్రూరమౌ
పంచ హృషీకముల్ సడలి పాడ్పడ నన్ గరుణించి చూచి మ
న్నించె గజాధిరాజు, మహనీయపదున్, గుఱియించి సామి గా
వించు ననుగ్రహంబు నొక వింతగ నెంతు నె? యింతనుండియున్॥ 762

మ॥ గమనింపన్ దొలి విన్నకూర్మి నిపుడా కల్యాణ శీలుండు మచ్చి
త్తమునం జీకటి విచ్చఁ జొచ్చె పురుషార్థంబింతకంటెం గలుం
గమినో? మూడు జగాలువాఁడువిడె భాగ్యంబింత చేకూఱునే?॥
భ్రమయో? వాఁడె నిజేంద్రజాలమున విభ్రాంతాత్మునిఁగాఁ జేసెనో?॥

మ॥ భ్రమలన్ బెట్టునె? నన్ను వంచనకుఁగాఁ బ్రఖ్యాతుఁ డాదిత్య సిం
హము గోపాలుఁడు నాప్రియుండు హరి యీయావాడలందెల్లఁ దె
ల్లముఁగా స్వీయమమైన శ్రీకృపను గ్రోలంజేసి నాయొక్క యు
ల్లము నందుంచె స్వకీయ నిర్మల కల్లోల్లాసాకృతిన్ సాదృతిన్॥ 764

చ॥ ప్రకటితమైన స్వీయసుకృపన్ విరియించి జగంబువారలె
న్నికఁ గొను మెప్పుఁ గన్పఱచి నేడు మదీయ మనస్సులోపలన్
బ్రకటితమైన యొక్క మణిపర్వతమట్లు వసించె నేను గా
కొక పురుషార్థమా హరికి యున్న దె? యెన్నికఁ గన్న యెన్నికన్॥ 765

మ॥ హరి నీలాద్రిపయిన్ సరోజమటులింపై లచ్చి వక్షంబుపై
మెఱయన్ గాలునుఁ గన్నునుం గరమునున్ బింబాధరంబొప్ప సుం
దరుఁ డబ్జోదరుఁ డొండు శ్లాఘ్య పురుషార్థంబంచు నాకిచ్చినన్
మఱి తన్నేఁ బురుషార్థమంచుఁ గొను సంపన్నుండు లేడీ యిలన్॥ 766

మ॥ అరుణోష్ఠంబును నాభి పల్వరస దీవ్యత్కుండల ద్వంద్వమున్
బర దివ్యావయవద్యుతుల్ గలిసి శోభన్ దాము నన్నున్ బర
స్వరమున్ మున్కొని వచ్చి చుట్ట నరుణోష్ఠస్మేర మొప్పార నా
హరి యుల్లంబున నొప్పు చొప్పులు వినా యన్యంబెఱుంగం గదా॥ 767

ఉ॥ నా యొనరించు మాటెఱుఁగ నాకు స్వదాస్య మొసంగు సామికిన్
స్వీయ విధేయులన్ మనుచు వేడుక నూరక మూడు లోకముల్
స్వీయ మహోదరంబుననె చెన్నుఁగ జేరిచికొం చకించన
ప్రాయుఁడ నైన నా హృదయ భాగమునందునఁ జొచ్చి నిల్చెడిన్॥768

చ॥ ఉదరములోనఁ బెట్టికొని యుర్వరబ్రోచెడివారి నందఱి
న్నుదరములో నమర్చికొని యొక్కవిధంబున నీ జగత్త్రయం
బుదరమునం దిమిడ్చికొని యొప్పిన మున్నటులున్న వెన్ను నా
హృదయమునందు సమ్మతిని నింపెసగం గయికొంచు నుంచితిన్॥ 769

చ॥ తగుఁ గెరటాల్ నిరంతరముఁ దార్కొను చల్లని పాలవెల్లిఁ బెం
పగు పడగల్ ధరించి తగు నాతని పెన్ జిగి పాపతేని శ
య్యఁగఁ గలసామి నాహృదయ మందున సమ్మతి నుంచికొంటి నె
వ్వగలిఁక రావు దేవునెడఁ బాయ నికెయ్యెడ నెట్టివేళలన్॥ 770

—•ఎనిమిదవ పది•—

మ॥ ఎఱుపౌ చేరెడు కన్నులుం ఫలమురంగింపారు కెమ్మోవి, లో
మెఱుగుల్ జల్లెడు వెల్ల పల్వరుసయున్ మేల్ డాలుతో లోలసుం
దరముల్ పోగులుఁ గల్గి మబ్బుజిగితో నాల్గౌ భుజాలన్ ధను
గ్దర చక్రాది ధురీణుఁడై యొకఁడె యాత్మన్ నిల్చు నా కియ్యెడన్॥771

శా॥ అండాంతర్గతుఁ డండబాహ్యగతుఁ డీఁడఁజొండు లేకుండు దే
వుండా మోదమరంద భోగ్యమయి తప్పుల్ లేని మోదంబుతో
నిండౌ నిత్యసుఖంబువాఁడు మఱి జ్ఞాని శ్రేష్ఠుఁడౌ వాఁడు దా
నుండంచున్ దయచేసి యుండి మది నిల్చున్ వాఁడు నెమ్మేనుసన్॥772

శా॥ జ్ఞాన స్థామరలోకనాయకునిఁ గాంచంగోరి తత్ప్రేమ నా
జ్ఞానం బందమరింతు నయ్యదియు నాసర్వేశు కారుణ్యమే
జ్ఞాన ప్రాణ శరీరముల్ మఱియుఁ బల్చుందాల తత్వాల్విడన్
జ్ఞానం బిచ్చుచు నేను దానె యగుచున్ సాగించె వాఁడెప్పుడున్ ॥773

శా॥ నా నాస్థావర జంగమాద్యుడగుచున్ దానున్ శివుం డబ్జజుం
డై నిర్మించిన యేకకారణుఁడు; చెన్నై తేనెఁ బాలన్సుధన్
బోనీకింపయి యుండి నా తనువునన్ బుద్ధిం దగ న్నిండుచున్
నేనే తానయి యున్నవానిని జగన్నేతన్ హరిన్ బోల్చితిన్॥ 774

మ॥ కలదొక్కండదియే నెఱింగితిఁ బరుల్ గన్గోగలేరెవ్వ రె
వ్వలనన్ సుంతయుదానిభంగి మఱి కాన్పన్ లేరు కన్గొన్న న
న్యుల కాయాత్మఁ బరంపరాగతినిఁ బోనుం బోను బందాల్విడన్
దెలివిన్ దాటి విలక్షణంబయి గుణాతీతంబునై యుండెడిన్॥ 775

శా॥ జ్ఞానంబుం జవదాటి యింద్రియగతిన్ సాధించి; యైక్యంబయాఁ
గానన్ బాయని శాశ్వతప్రకృతినిన్ గన్పట్టి పోనెట్టి యం
దే నిక్షిప్త సుఖార్తుఁడై విడిచి ధ్వస్తేచ్ఛుండగున్ నాఁడె తో
డ్తోనా మోక్షము మోక్షమన్న నదె, యొందుం బూరుషార్థంబునున్॥

మ॥ అదియే మోక్షము మోక్షసౌఖ్య మదియే యంచెంచి సంబంధముల్
వదలన్ సర్వము మూలముట్టవిడ తద్భావంబె మోక్షంబు స
మ్మద మిట్లారయలేక మోక్షమెదియో? మోక్షంబులో మోదమె
య్యదియో? యంచును సంశయించు జనులారా! ప్రస్తరెల్లప్పుడున్॥

శా॥ పోయెన్ బోయెనటంచు నింటిజనులున్ బార్వైన సంబంధులున్
డాయన్ మొఱ్ఱలబెట్టి చుట్టుకొన ప్రాణంబేగువేళన్ మతిన్
బాయన్ వెర్రిబ్రమంబుఁ గూర్మి పొడసూపన్ దాను లక్ష్మీశ్వర
ప్రాయుంబుచు నిజాత్మ నెంచి మది సంభావింప శ్రేయంబగున్॥ 778

మ॥ ఫలమెంతేఁ గలదంతిమస్మృతిని దుష్ప్రాప్యంబు ప్రాపించినన్
గలుగున్ స్వాత్మ నటత్వంతగపతి రంగత్ కేతనుం డౌటయున్
దలపంగా నదియన్న నయ్యదియె భూతంబందు ముందిప్డు యో
గులుఁ దోఁగాడుచునుండు ప్రాలఁగ తెఱంగుల్ లేకపో లేదుగా॥ 779

ఉ॥ లేడనఁ గాక యుండి మఱిలేకయునుండి మదీయనాథు డు
న్నాడొకరుండు నాదగు మనంబున వృద్ధిశశాంకునట్లు మేల్
గూడిక క్షీణ చంద్రుగతి కుందుట వర్ధిలు తేజ మట్టులే
కూడిన తెల్వి చీకటులకున్ సరి మఱ్ఱును మాయఁ జేసితిన్॥ 780

## —•తొమ్మిదవ పది•—

ఉ॥ నీలమణి ప్రభాద్రి రమణీయ సరోనలినీ వనోపమ
శ్రీలలితో రమోష్ఠమునుఁ జెన్నగుఁ గన్నుఁ గరంబు నాభియున్
గాలును నెట్టబట్టఁ గల నాథు "తిరప్పులియూరు" వాని నా
మాళినె కాని వేఱు నుడులాడదు తల్లులు! యీమె, యేమియో?॥781

ఉ॥ మేరువుపై మెలంగి జిగిమించి యెసంగు పతంగుభంగి నిన్
దారల భంగిఁ గ్రాలు మణి దామకిరీటము నన్యభూష లొ
ప్పారఁగఁ దాల్చి వెన్నుఁ డలరారు "తిరుప్పులియూరు"ఁ బొన్నలే
పారెడు నూరునే పొగడు నమ్మరో! దీని నిఁకేమిఁ జేయుదున్?॥ 782

మ॥ అలలన్ ఘూర్ణిలు నర్ణవంబు ననలంబంటంగ నల్లట్టుఁ బ్రి
జ్వలమౌ చెల్వునఁ దత్సుదర్శనముఖ ప్రఖ్యాత శస్త్రంబులన్
గలనం జొచ్చి నిశాటులన్ దునుము శ్రీకాంతుండు నిల్చున్ "తిరు
ప్పులియూర"న్ స్థిరసౌధ నాపురినె యీ పూబోడి వేడున్ సదా॥ 783

చ॥ పురి నెఱిచొప్పుఁ జెప్పు వనముల్, జెఱుకుల్ వరిచేల్ దటాకముల్
సరసులు "కుట్టునాట్టు" ననెసంగు "తిరుప్పులియూర" నుండి సుం

దర గుణముల్వేలుంగ భువనత్రయి లోఁగొని యుమ్ము దేవు పే
ళ్లరసి వచించు నొండనదు సాభరణాంగన యాపె యెప్పుడున్॥ 784

ఉ॥ తాలుచు సొమ్ములుం బోలుపు స్థైర్యమునం దలపంగ నీమెకుం
జాలెడు నట్టివే? ఝరుల చాయల విచ్చిన తమ్మిపూలతోఁ
గ్రాలుచు చల్లనౌనెడలు గల్గు "తిరుప్పులియూరి" సామియున్
బాలిత లోకుఁడౌ హరి కృపాజలధిన్ బడి యోలలాడెడిన్॥ 785

ఉ॥ శ్రీకృపఁ బ్రోవఁ జేరెహరి; శీత "తిరుప్పులియూరు" వానిదౌ
శ్రీకృపఁ గాంచుపూగ ఫలరీతి నెసంగెడి నీమెమోవి తత్
శ్రీకృప నీమె కొంత కదె చెన్నగు చిహ్నము గోపకృష్ణరాట్
శ్రీకృప యంద యీ నెలఁత రేఁ బవలుంగడు మున్గి తేలెడిన్॥ 786

మ॥ ఎల యాకుల్గల తీవ లల్లికొను వేళ్లేపారు పోఁకల్ దళత్
దళ శుంభత్కదళీ గుళుచ్ఛములు సాంద్రంబైన టెంకాయ తో
పులు గ్రాలన్ మృదుగంధ గంధవహుఁ డెస్తుం జల్వసేయం "దిరు
ప్పులియూర"ం జెలువారు కృష్ణు నడుఁగుల్ బొందెంజుఁడీ యాపెయున్

మ॥ చెలులారా! యిఁక నేమనందు? సిరులం జెల్వారి గీర్వాణ వా
కులఁ బ్రాఁబల్కుల యర్థముల్వెలుకు ముఖ్యుల్ వేల్చు యాగాగ్ని నే
తుల చేతన్ బొగ నింగి కేగి తిరసై తూగాడఁ సొంపౌ "తిరు
ప్పులియూర"న్ ఫణిశాయి పేరులనె చెప్పున్ బాల యెుండాడకే॥788

చ॥ హిమజలమూర్తి కృష్ణునకు నిక్కయు సంతత సామవేద గా
నము లొనరించు వైదికుల యజ్ఞనిభార్భటి కీల్గునె యెుస
ళ్లమరు కొలంకులం దొగలు వారు "తిరుప్పులియూరు" క్షేత్రసా
రముఁగల యూరుపేరొకఁటె రాత్రి పవల్ వచియించు నీమెయున్॥789

మ॥ మలలట్లెత్తగు రత్నసౌధముల శుంభద్దక్షిణాశాసతీ
తిలకంబట్లగు "కుట్టనాట్టు" నను ఖ్యాతిన్మీరు మేరన్ "తిరు

ప్పులియూర''న్ గల మాయు శ్రీకృపను నీపూబోడి తానొందె, నోఁ
డులసీ శీతల గంధ మేమిటనుఁ బొందున్ దానఁ గాకుండిననీ?॥ 790

## —•పదియవ పది•—

మ॥ ఘనునిన్ సేవకుఁ డట్ల తల్ప తొఱఁగంగాఁ గాని దోషంబులున్
ఘనును వంచించి తొఱంగి పోయిన తెఱంగుం జూడ నాపోఁడ దా
స నికాయంబులె యీపయిన్ శరణు విశ్వంబెల్ల పాలించినన్
జను నే? వారి త్యజింప నాకకట! నా నా ఘోర పాపాత్ముఁడన్॥ 791

శా॥ ఈముల్లోకము లేలినన్ గడచి నేనే నన్ను భోగించినన్
శ్యామాంభోధర వర్ణ కృష్ణు, వలయాంచత్పాద సాన్నిధ్య దా
స్యా మోదంబున మించువారి పదముల్ సాష్టాంగతన్ మ్రొక్కి యీ
భూమిన్ నేఁ బురుషార్థమందు నెఱితోఁ బోల్పంగ నేముండెడిన్?॥ 792

ఉ॥ వెన్నుని దాసులైన చిన పెద్దలు శిష్టులు నన్ను నేల నే
లన్ నెలవున్నమాని సకలంబు జగంబు నొకప్డె నిండగా
జిన్ని బెడంగు మేన్బఱచు చెందొగ కన్నుల గుజ్జు గందపుం
గ్రొన్నన యట్టి యద్దుకడకుం గడకొంటయు నాకు నాయమే?॥ 793

మ॥ మునుపీ భూమిని మ్రింగి యుమ్ము పరు సొంపుల్ జిమ్ము కెమ్మోవి వి
చ్చిన కన్‌దమ్ములుఁ గల్గువాని వికసచ్ఛీలమ్ము సా నాల్క ప
లుకన్;ఁ బులకల్ గొలిపించు మేన్ మదిని; కేలుం దోయిలోఁ బూలు స
జ్జన వృత్తుల్ గృపచేసెనేని కొదువే? ఝమ్మాయంద నేనుండెదన్॥ 794

మ॥ వరవృత్తింజను భాగ్యమబ్బినను; దేవస్వామి పుష్పాభమా
చరణద్వంద్వము క్రిందఁ జుట్టికొను తేజస్సీమ నానందమున్
బొరయన్; కొండొక చెయ్వి లేని మెయితోఁ బుట్టొంది తచ్ఛీల బం
ధురతం గూర్చి వచోమృతంబున మునుంగుల్ గొంటతో సాటియే?॥795

మ॥ తన నిస్తుల్య మదంబుతో నరుణ వక్త్రచ్ఛాయతోఁ బొంగు నే
స్గను బ్రింగించిన చక్రిహస్తు; నరుణాక్షుల్ రక్తకేశంబు, లా

రు నిశాటావళి వంచి చంపు గరుడారోహున్ దదీయా సమా
ఖ్యను నగ్గించుటకీడె? లోకరచనా వ్యాపార సంహారముల్ ?॥ 796

మ॥ అతులశ్లాఘ్య యశస్సు లెప్పుడును నొప్పారన్ బరబ్రహ్మ ని
శ్చితుఁడై నిత్యనిమిత్తహేతుఁ డయి సృష్టిన్ బొంది చేసెన్ జగ
త్త్రితయం బా, పరదేవు పల్లవపదాల్ క్రిందన్ జనన్ బోక త
చ్ఛ్రిత శుంభత్పరిరంభ సౌఖ్యమునె యాసింతున్ దినం బెంతయున్॥ 797

శా॥ శీతాంభోధి సృజించి యందు వివిధస్వీయాంఘ్రులున్ బాహువుల్
జేతుల్ శీర్షము లెల్లెడన్ బఱచి, వాసిన్, బుష్పితాదిత్య భూ
జాతోద్యానములోన భానుకరతేజంబారు రత్నాద్రియన్
భాతిన్ బండెడు వాని దాసుల భజింపం గల్గుగా కెల్లెడన్॥ 798

ఉ॥ దాసులకౌ విరోధము వదల్చు చతుర్విధమూర్తియున్ సమి
ద్భాసిత శంఖ చక్ర కరవాల గదా ధనురాదిధారి సూ
నాసమ బాణు తండ్రియగు యావనవంతుని ధూతదోషులౌ
దాసుల దాసులౌ జనుల దాస్యమె నా పురుషార్థమయ్యెడిన్॥ 799

ఉ॥ భాసిలు తెల్లుపూవు జిగి వర్ణము నాల్గుభుజాల్ సుదర్శ నో
ద్భాసిత హస్తమున్ గలుగు స్వామిని బాయని దాసపాళి యా
దాసుల దాసులున్ మనకు దైవసమానులు వారి దాస్యమే
యాసిలు నాకు నిచ్చుఁ బురుషార్థము గావుత కల్పకల్పముల్॥ 800





# శఠకోపగీతామృతము.

## తొమ్మిదవ శతకము

—♦మొదటి పది♦—

మ॥ కొనుఁ బెండ్లాములు బిడ్డ లాప్తులునుఁ దక్కంగల్గుఁ జుట్టాలుఁ గ
న్గొను నల్లప్పుడె కూర్తు రొండపుడు పొందుల్ జార్తు రష్టాశలం
దునుఁ గ్రిందన్ బయినున్న యన్నిఁ దనయందున్ బొందు సర్వేశు భ
క్తిని జీవించుట తక్క దిక్కు మఱి యేదీ? మీకు లేదే సుఁడీ 801

మ॥ చెలులున్ రక్షకులట్లు పట్టుకొనుచున్ జేఁజిక్కు మేలున్నచో
జలగల్ వోలిక జ్ఞాతి బంధువులు పైసాఁ బీల్తు రేకాస్త్రిని
ర్దళి తోత్పాటిత సప్తసాలు, మన, యభ్రిశ్యామునే నేతగా
గొలువన్ బూని మనుండు తక్కినవి బొంకుల్ వ్యర్థ సంబంధముల్॥

మ॥ పైసా చేతులఁ జెల్లుచుంటఁ గని నిన్ బాగుండ దీవించి నీ
వాసన్ జేతులు మోడ్చి నిల్తురు తమోవంతుండ నంతాపదా
. యాసుండైన దరిద్రుఁ జేకొనరు దైత్యధ్వంసిఁ గృష్ణున్ హరిన్
దాసత్వంబునఁ గొల్చు జీవనము కన్నన్ రక్ష వేఱున్నదే?॥ 803

మ॥ సిరిఁ గోల్పోయిన నాఁటి కొడురనుచున్ జేపట్టు చుట్టాలు పో
దురు వంచించి ఋణానుబంధులటు లంతున్ బొందిరో యంతె పా
మరుల న్వేడకుఁడీ' యుదజ్మధుర జన్మంగొన్న శ్రీకృష్ణు నే
శరణంబంచు మనుండు కొండొక యుపాస్యంబేది లేదే సుఁడీ॥ 804

మ॥ తమ కార్యజ్ఞతఁ దామె మెచ్చుకొని పౌంతన్ దేనియల్ జిలుఁగు వా
క్యములన్ బల్కెడు స్త్రీలతో మధుర భోగంబందువా రాదట
న్యమునుం గందురు భీకరాసురులఁ జెండన్ బుట్టు శ్రీకృష్ణు దా
స్యముఁ జేపట్టి మనుండు లేదు సుఖమన్యం బంతకన్నన్ జుఁడీ!॥ 805

మ॥ అరయన్ లేదు సుమండి! సౌఖ్యమన నిత్యానందు ధ్యానింప కెం
దటో మున్ బుట్టియుఁ గిట్టి రింపగు పురాణక్షేత్రమై యున్న యు
త్తర సీమన్ మధురం జనించు హరి పూతంబైన శీలంబు సం
స్మరణంబొంది మనుండు కొండొకటి సూక్ష్మంబైన త్రోవున్నదే? ॥806

శా॥ చేరన్ వేఱొదిలేదు చెప్పితిమి సంక్షేపించి యీభూమిలో
హా రెవ్వారు శ్రమింపనేల? స్మరియింపం జాలునంచీరుఁ గ
న్నారయ్యో! యొకతప్పుఁ గాదు మన కృష్ణస్వామి గోవిందు సత్
చారిత్రంబునె యభ్యసించి దినముల్ సాగించుటే మేలగున్॥ 807

మ॥ ఇటు జీవించుటె మీకునుం గుణము సుండీ! యయ్యో! మాయార్థలం
పటుపాదా ల్వినుతించి నాళ్లు గడుపన్వాంఛించి, స్వార్థంబునుం
గుటిలత్వంబును లేని వారి మనుపన్ బుట్టొందు శ్రీకృష్ణు పా
కట శీలంబె శరణ్యమంచుఁ గొను మార్గంబొండె మేలన్నిఁటన్॥ 808

ఉ॥ దానికి మిన్న లేదనుచు దానినఁ బల్మఱుఁ జెప్పి యెంచుచున్
వీనులఁ బెంచి వించుఁ గడువెల్తిగఁ దొల్లిఁటి చెన్నుఁ బోవఁగన్
బూనుదు రంబరధ్వజ విభూషితమౌ మధురన్ జనించు శ్రీ
జాని హరిప్రియాంచిత భుజమ్ముల వాఁడొకరుండ ప్రోచెడిన్॥ 809

మ॥ హరి కంఠెన్ బరమై శరణ్యమిఁక వేదంచున్ నిరూపింప భూ
భరమున్ మాన్పగ నుత్తరంపు మధురన్ బ్రాపించి తాఁబుట్టె మీ
సిరి "కృష్ణార్పణమస్తు" టంచుఁ గని యుజ్జీవింపుఁడీ సందియం
బొంద[illegible] బోకుఁడి వాని యర్థములె కావో? యన్ని లేవన్యముల్ ॥810

## —•రెండవ పధి•—

మ॥ కడు నూర్మ్మల్గల తామ్రపర్ణి దరిపైఁ గాసారసీమన్ "పుళిం
గుడి" నిద్రించెదు తండ్రి! నీకృపయు నీకుంగూర్చు దేవేరి ప్రే
ముడిఁ జాలంగని నీదు కోవెలకు మేమున్ వంశపారంపరిన్
బడిగాపుంటిమి కన్నువిచ్చి కనవే! వావిచ్చి మాటాడవే!॥ 811

మ॥ సిడముల్, గోటలు, జల్వతోటలుఁ బూలాల్ జెల్వార సొంపౌ "పుళిం
గుడి" నిద్రించెదు వంశకీర్తి నిడి నన్నుం దీర్తుఁ గావింతు నీ
యడుఁగుల్ గొల్వనుఁ గొల్వుసేయఁ గని పాదాబ్జాతముల్ మీఁరకుం
డెడు నీశేషుని నెత్తి నిల్పు తొలి మంటిన్ గొల్వఁ బెంపౌపదాల్॥812

మ॥ కడుఁ బొద్దిట్లు "తిరుప్పుళింగుడి"నిఁ గూర్కన్ నీయొడల్ నొవ్వ ని
వ్వడి నింకెంతకుఁ బండుకొందు? తమిసేవల్ జేసి మున్నుండి చొ
ప్పడు దాస్యంబున నొప్పువాఁడ సరసీభాసంత పద్మాక్షులున్
విడఁగా జూచుచు నీవు లక్ష్మి నిలుఁడీ! విశ్వాశ్రియార్ధంబుగన్॥ 813

గీ॥ కొమరారగాఁ'బుళింగుడి'యందుఁ బవళించి 'వరకుణమంగ' నాదరతనుండి
కరుణ "శ్రీవైకుందపుర" మందున న్నిల్చి నానిర్మలాంతరంగము విడువక
నన్నేలు నారాజ! నాయందుఁ గృపఁ జేసి చల్లని నీ గుణ జాలమునకు
ముల్లోకములు నొక్క మొగి నచ్చెఱువు నొంద నానందవశత మే మాడు
కొనుచు॥ 814

గీ॥ నిలిచి కోలాహలముఁ జేసి చెలఁగునట్లు । విమలజలమున నిండు మేఘ
మున నుండు
పగడపుండంబు మోవి కెంజిగి యెసంగ । శ్రితులు సేవింప నీవు విచ్చే
యుమయ్య॥

మ॥ పగడంపుం బొదలందు సంకులు నెలర్పం "దామ్రపర్ణీతటిన్"
దగి చెల్వైన "పుళింగుడిన్" గునుకునాథా! శ్రీగజేంద్రార్తి మా

యగఁ గుప్యత్ ఖగమెక్కి యేగితివి కెంపౌ మోవిపై దంతపుం
జిగి లేనవ్వొలయం గనంబడవె? యక్షీన్ విచ్చి విచ్చేయవే?॥ 815

సీ॥ బంగారు కొండపై రంగారు కారుమబ్బునువోలెఁ గాల్చెడుఁ గినుకఁగ్రాలు
గరుడు పైకొనివచ్చి; కాల్చెడుఁ గినుకచేఁ గనలు చక్రము, సంకు, గత్తి విల్లు
గౌమోదకియుఁ దాల్చి; ఘనకోపులగు మాలియు, సుమాలి యనునట్టి యసుర లాజి
ను సురుల విడునట్టు లుగ్రింబుగా నగ్రమున నిల్చి; కాల్చు కోపనుడవైన

గీ॥ సామి! కిరణోజ్వల కిరీట! జలసమృద్ధి నడరు పొలములు గల పుళిం గుడినిఁ బండు
కొనెదు నోయయ్య! మాదుఃఖమును నశింపఁ జేయునోయయ్య! నిలచి విచ్చేయుమయ్య॥816

శా॥ మాలో దుఃఖమడంచి యిందునె మమున్ బాలింతు వందున్న జే
జేలన్ బ్రోతువు రక్తవారిజ సరశ్శీతస్థలీ శాయివై
కాలం గంటెఁ "పుళింగుడి"న్ శ్రితులు పొంగం గంచు మోదించి మూ
ఢాళుల్ సూడ నొకప్డు మా కనులముందై నిల్వ ప్రేమోద్ధతిన్॥ 817

మ॥ "తిరువైకుందమునన్" "బుళింగుడిని" నెందే నిందు సంచార మం
దిరముం బెల్లటనుందు దేవ! ప్రజలుద్దిన్ నిన్ను మాకంటి ముం
దఱ సేవించి వినమ్రులై యలరి పంతాలాడి కొండాడ శ్రీ
ధరణీ క్షేత్రమునంద, నీమహిమఁ జిందన్ రావె యేదో తఱిన్॥ 818

మ॥ ఎల మీల్ బందలఁజేల మిట్టిపడఁ గోనేళ్లారు నయ్యారునన్
నెలవుం గొంటి "పుళింగుడిన్ దనుజ పంక్తిం జీల్చు మృత్యూప మో
జ్వల ఘోరాయుధ! ఆశ్రితాళి నిను నిచ్చల్ మెచ్చి కన్నారఁ బూఁ
బాలుపౌ నీమొముఁ గ్రోల వెలఁదుచు నీఘృణోద్రేకిన్ రాఁ గదే॥ 819

శా॥ క్రూరాస్త్రౌఘ సురార్తి డింద నసురుల్ కుందొందఁగాఁ జేయు నో
క్రూరక్ష్వేళ! శ్రితామృతాభ! అసదృగ్ రూపోల్లసల్లక్ష్మి, భూ
నీరేజాక్షి, స్పృశించు నీ మృదుపదాల్ నేఁ దాకు నట్లెందుఁ గొం
పోరా! లేకిట రా! పుళింగుడివి తావుం గొన్న లక్ష్మీశ్వరా!॥ 820

## —మూడవ పది—

ఉ॥ వేయిఁటి పెట్టఁగా నొకటె విశ్వజగంబుల నేలఁ జాలు నా
ఖ్యేయములైన నామముల నెవ్వఁడు వేయునుఁ గల్గు? నద్వితీ
యాయత తేజుఁ డెవ్వఁడు? హిమాబ్జ నిభాంగుఁ డెవండు? నట్టి నా
రాయణుఁడే సుఁడీ! మన పరాత్పరుఁ డాతని నమ్మి యుండుఁడీ॥ 821

ఉ॥ వాఁడె కదా! విశాలమగు పంటవలంటిని సృష్టిఁ జేసి పై
పీడగఁ దీసె వాఁడె పృథివిం దనలోఁగొనె, నుమ్మ, గొల్చెపో!
వాఁడొకరుండ వాఁడు, మఱి వాఁడును, వాఁడును నయ్యె, నెయ్యెడన్
గూడిన యన్ని వస్తువులుఁ గూడను వాఁడనియే యెఱుంగుఁడీ॥ 822

చ॥ తెలియఁగఁ గాని వస్తువితతిం దెలియంగల వేదశాస్త్రముల్
దెలియఁగఁ గాని వస్తువనిదేని విధిన్ దెలియంగ వచ్చునో
తెలిసిన వారలెల్లఱు నదే హరి యంచును నాశ్రయించి వ్యా
ధుల వదలింపగాఁ దగిన తోరపుమందని నిశ్చయింపరే?॥ 823

మ॥ మనకున్ భోగరసాతిరేకకరమౌ మందీతఁడే యంచు నె
వ్వనిఁ బేర్కొందురు పేరుఁ గొన్న యమరవ్రాతంబు, లాతాత్రత, మే
ఘనిభ శ్యామల కోమలాంగు జ్వలితాకారున్ మదీశానుఁ గృ
ష్ణుని, దేవున్ సురలోకదున్ మనస! యెందున్వీడఁగాఁ బోకుమీ!॥ 824

చ॥ వెడిదపుఁ బాపమందుఁ బడి వేగెడు నేనును నీ కడన్ గడుం
గడు బ్రతిమాలికొంచును మనస్సు! నిజస్థలమందు వృద్ధిఁ బొం
దెడు తులసీ సుమాలికల దీపిలు సామ్యములేని దేవు ని
ల్కడఁగ భజింపు మంటి నిదె గాటముగాఁ గొని పీడకుండుమీ॥ 825

చ॥ జలరుహగేహినీ మృదుల చారు భుజంబులఁ గౌఁగిలించుటన్
దులువల బూచి మూకలనుఁ ద్రుంచు నుపాయముఁ జిత్తగించుటన్
జలనిధిలో సుధారసముఁ జక్కఁగఁ జిల్కుచుఁ జిక్క జేయుటన్
దలచుచు వానికై మనసు తల్లడ మందెడి నొక్కకైవడిన్॥ 826

ఉ॥ చిత్తము నందు నేడు నరసింహమహాకృతిఁ జేరి భీకరో
ద్వృత్తిగ నొక్క రక్కసు శరీరముఁ దీక్ష్ణ నఖంబు లెత్తి యు
ద్వృత్తున గుచ్చి చీల్చు హరి యిక్కఁ బరంపదముం గనంగ నా
చిత్తము రేఁ బవల్విడక చింతనఁ జేసెడి నేకవైఖరిన్॥ 827

ఉ॥ రెండు విధాల కర్మములఁ ద్రెంచి సమూలము మాపి, పాపమై
యుండు శరీరపాళిఁ జొఱకుండగఁ బ్రోచెడిసామి కాపురం
బుండెడు వేంకటాచల మహోత్తమసీమయె భూమినుండు న
క్కొండకు వెళ్లి వాని నటఁ గొల్చెడువారలు భాగ్యజీవనుల్॥ 828

చ॥ తెలుపగుఁ గ్రొందొగల్ జలము దీపము ధూపముఁ దెచ్చి నీదు న
గ్గలకడ నాశ్రయించి బ్రతుకుం గడుపం దలఁ పెక్క నస్మదా
దుల కపవాదదూర మహితుండ వఖండ పురాణకీర్తి వీ
వలఘు ఫణీంద్రశాయి! భవదంఘ్రుల బట్టు విధంబు నేర్తునే?॥ 829

ఉ॥ నాళము తోడ నున్న నలినమ్మునఁ బుట్టినవాఁడు బొడ్డుపై
గ్రాలును నీకు దీర్ఘమయి రాజిలు శూలమువాఁడు మేనుపై
వాళిగ నుండు నీకుఁ బరివారములై సురలుంద్రు నీ మహా
శీలము నెంతకాల మిటుఁ జెప్పియు నేను నుతింపఁ గల్గుదున్?॥ 830

## —•నాల్గవ పది•—

ఉ॥ కాటుక కట్టికన్నుఁ గవ కాంతెడు నక్కమలాలయన్ సిరిన్
గాట్టపు బొజ్జ్జు పీటపయిఁ గాంచిన కాంచనవస్త్ర! యుష్ణమై

ఫోటరి పోడిమింగలిగి పొల్చెడు చక్రము వంక శంఖమున్
నీటుగఁ గేలఁ దాల్చికొను నిన్నుఁ గనుంగొనఁ గన్నులాసిలున్॥ 831

ఉ॥ నిన్నుఁ గనంగ నాసపడి నెమ్మది పెక్కు మనోరథంబులం
దున్నది నిల్చి ఘోషలిడు చున్నది నాకునుఁ గన్నవైన సం
పన్నుఁడ! నేను దేవతలు మానులుఁ జూడగఁ గాని నిన్ను నా
కన్నులఁ గాంచి తీరెదనుగా, యని మాటికిఁ బిల్చుచుండెదన్॥ 832

చ॥ నినుఁ గడుఁ బిల్చు వాఁడనయి నీచుఁడనై యడియండనైన నా
మనసొక కుక్కతోకఁ బలుమాఱును నూపుచు స్వీయభావమున్
గనఁ బడఁ జేయుమై కరగఁగాఁ దొలియిందుఁ గ్రిని తాళ్లవాన క
ద్రినిఁ గొను గోపరక్షకుని ప్రేముడి తప్పెనొ యంచుఁ బొక్కెడిన్॥833

చ॥ సురలును దైత్యులెప్పుడును సూటి నెఱుంగగ దుర్లభుండవౌ
నరహరిరూప! నాకుఁ బ్రియనాథ! ఇదేతగునంచు నెంచి నీ
చరణము లాశ్రయించు పరిచారక భావమె కాంచి నీ కడన్
బొరసెడి దేది? నాకు నిరుపేద నటంచు మదాత్మ బెగ్గిలున్॥ 834

మ॥ నరహరి! దేవతాప్రియుఁడు నాథుఁడమేయ మహత్వశాలి ముం
దఱ పరమేష్ఠిసృష్టినె యొనర్చిన యాదిముఁ డద్వితీయ సుం
దరతయుఁ దేజముక్ బొరయు తత్ఫణిశయ్య శయించువాఁడు కృ
ష్ణరుచులవాఁడు వాని చరణమ్ములఁ గాంచ మనస్సు వేగెడిన్॥ 835

చ॥ మనసునకుం బలంబొస గు మాధవ! నిన్నుఁ గనంగఁ గోరి నా
మనసున నిన్ దిరంబుగను మాటితి సర్వసుపర్వ మాన్య దీ
పన మొనరించు తేజమున భాసిలు మిన్నున నున్న యద్వితీ
యుని నిను నా మనస్సు ముదమొప్పగ ధ్యానముఁ జేయ నిచ్ఛలున్॥

ఉ॥ శ్రీపతి! నిన్నుఁ జింతనముఁ జేసి సుఖంపడు నా మనస్సులో
లోపల నంతమేర విమలుండవు పొల్పున నిల్తు వీవు సం

దీపితుఁడౌ హిరణ్యుఁడను దేవవిరోధి విశాలవక్షమి
ద్వైపులఁ జీల్చు గోళ్లు గలవాని నృసింహుని రూపమెంచితిన్॥ 837

చ॥ అరయమి శాస్త్రభంగిఁ దనరారెడు నారుమతాల దృష్టికిన్
దొరకని యప్రకంప్యుఁడయి తోఁచు సమస్త పదార్థ కోటికిన్
బరగెడు నంతరాత్ముఁడయి సానికి నాదియు నాదితేయు లం
దఱకును గారణంబయిన దైవముఁ గృష్ణుని నేనుఁ జూచితిన్॥ 838

ఉ॥ నాకసులారఁ గంటి మననాథుని మోదముతో ననాదిగాఁ
బ్రాకిన కర్మలన్నిఁటి సవాసనగా విదళించి యండమున్
నాకము నోము సామి చరణమ్ముల దాసుఁడ దాసులా సుధా
పాకముఁ ద్రావునట్లు శుభవాక్కుల మాలల నిట్లుఁ జెప్పితిన్॥ 839

చ॥ "అడియఁడు వీఁడు నాక"ని దయారసమెంతయు నించుచున్న దే
వుఁడు శుభకీర్తి పూర్తిఁ గల పూజ్యుఁడు సుందరపక్షతార్క్ష్య కే
తుఁడు, కడు నిర్విచారముగఁ దోరపు ధారుణిఁ గొల్చినట్టి పే
రడుఁగులవాఁడు వాని యడియండను నేఁ బడయంగఁ గాంచితిన్॥ 840

## —ఐదవ పది—

శా॥ మీరున్ గోకిలలార! ప్రాణపదమా మీపుంజులుం గూయు చీ
తీరున్గా రతికూజితంబులిట నెంతేఁ జేయ నా ప్రాణమం
దారాటంబగు మానుఁడా హరిని నాప్రాణేశు రాఁ బిల్వఁ బో
రారా! ప్రాణముదోచి వానికిడు మీకా? యింత కాఁబట్టెడిన్॥ 841

శా॥ ఆడుం గౌంచములీరు మీమగలు నారా! యెంతకంచీవడిన్
గూడన్ గూయను? నింతయేమిటికి? శ్రీగోవిందుఁ డాశ్చర్యమా
వాఁడెవ్వారలనేని సత్యరతిఁ బ్రోవంగూడనే? వశ్యుఁడే
కాఁడే? నా యుసురింక మీదు కరయుగ్మంబందె చిక్కించితిన్॥ 842

రతిచే నాతని చేతఁ జిక్కినది నాప్రాణంబు కొంచాంగనా
తతులారా! తమి మీరుచున్గి పలుచందాలేమొ వాకొంచు నల్

గతులం డాసి చరింత్రు పుణ్యరహితన్ గష్టాత్మ నిచ్చోట నా
స్మృతి యేదీ? యెటులుండు? మీస్వనములే నీరీతి విన్నంతటన్॥ 843

మ॥ స్వనము ల్విన్న ను నెమ్మలార! పరమాశ్చర్యుండు కృష్ణుండు రాఁ
జనఁ జీరన్ మగలున్ గడుం ధ్వనులొనర్చన్ రాదు మూఢైన నె
మ్మనమున్ వాకొనుఁ గర్మమాతని కడన్ బాఱంగ ప్రాణంబు నుం
దనువున్ మాత్రమె మధ్యనుండి పెనుబాధన్ బొందుచుం గుందెడిన్॥

మ॥ నడుమన్ బాల్పడి రిత్తచెట్టుములచే నాచిల్క లీరేమి న
న్నడఁచంగగ్గిరె? కూయకుండుడిఁక స్వీయం బిందజాలంబుఁ జొ
ప్పడఁ జూపించుచు నేఁడులోకములనున్ వశ్యంబుఁగాఁ గొన్న దే
వుఁడె శ్రీవత్సుఁడె పూనె నాయుసురు గొంపో మంచి పన్నాగమున్॥

శా॥ నాకున్నెయ్యుఁడు నీదుమోవి, కనులున్ గాల్సేతులుంబోలు సు
శ్రీకాంగంబులు, నీదుశ్యామల తనూశీత ప్రభల్ గ్రాలు నా
కాకుస్థాగ్రిణి కౌగిలించి విడెఁ జిల్కా! నన్ను నీసాయమున్
గైకోఁ బెంచితిఁ దెల్వి తక్కువగఁ బల్కన్ మాను మంజుధ్వనిన్॥ 846

మ॥ నను నాలింగితఁజేసి పాసిచను నంచత్ పద్మనేత్రుండు బిం
బనిభోష్ఠుండు ననూననీలమణి శోభాధుర్యుఁ డాశ్చర్య వ
ర్తనుఁడా కృష్ణునిఁ బోలి యింద్రధనువారన్ బొల్చు మేఘంబులా
ర! నిజాకారముఁగాన్పకుం డదియు నాప్రాణాంతకంబయ్యెడిన్॥ 847

మ॥ అవురా! జ్ఞానములేదె? కోకిలలు నా కామాట మృత్యూపమం
బవుటం గృష్ణుని పేరునెత్తకుఁడు మీరంచేను యాచింప ను
ద్దవిడిం దానినఁ బల్కి చంపితిరి నేఁ దధ్యన్నముం బెట్టి పే
ళ్లు వచింపం దగుమాఱుఁ జేసితిరి చాలున్ మంచివారైరి పో॥ 848

ఉ॥ పాటలు చాలు మానుఁడిఁక బాలమిళిందములార! మాకు మీ
పాట నినాదముల్ వ్రణముపైఁ బడు నీటెలపోటులయ్యె చ

న్నీటనుఁ బూర్ణిమా కమలినిన్ వికసించిన తమ్మిపూలతో
సాటిగ పెన్ గనుల్గలుఁగు సామి మనస్సు హరించి చేకొనెన్॥ 849

చ॥ సరసులలోఁ జరించఁ నగు సారసపక్షులు! మేము వాని శ్రీ
చరణము లొందఁ బోయి మనసామి పరంపద వాసుఁ గోడ నీ
వరకును నేకమైతి మిటుపై గుమిఁ గూడగ నేల? భూష నై
ఖరి తనువున్ జనున్ గ్రమముగా, సుసుఖంబగుగాత! యెల్లెడన్॥ 850

## —♦ఐదవ పది♦—

మ॥ తెలివల్! కల్వల చల్వ కమ్మనలతోఁ దేరన్ "తిరుక్కాట్కరై"
పురిఁ దీరారెడు మాయ సద్భుతవిధంబుల్ దల్చికొన్నంత నే
కరగుం జిత్తము నాత్మహాస్తిలక వేష్టల్ లేచు నేఁ జంచలా
స్థిర భావుండను నేమిఁ జేయఁ గలని చిత్రంబుఁ జింతించుచున్॥ 851

మ॥ సరసుల్ పూవులతోపు లేపుఁ గొనగా జూసె "తిరుక్కాట్క     "
పురినొప్పారెడు నప్ప! పాపహరమున్ బుణ్యంబు నీశీలమున్
బరికింపన్ స్మరియింప నా మనసు నీ వశ్యంబగున్ బాడినన్
గరఁగున్ నీకయి నేనొనర్పనగు కైంకర్యం బనూహ్యంబయో!॥ 852

మ॥ మనసున్ వంచనఁ జేసి చొచ్చి నిజసుంభచ్ఛీల మొప్పంగ నా
ర్ద్రునిఁ గావించి మదాత్మ భోగమును బొందున్, దా, మదీయాత్మనై
వనశోభాంచిత "కాట్కరై" జనపదావాసుండు మాయప్ప మే
ఘనిభ శ్యామల కోమలాంగుఁ డెటుగంగాలేను తన్మాయలన్॥ 853

మ॥ తన సంకల్పమునందె లోకము సమస్తంబుండ సంబంధ యు
క్తిని, తా, నందున నుండు తత్పరుఁడు నెందే గంధిలారామముల్
కననౌ నయ్యెడఁ "గాట్కరై" పురిని యిక్కంగొన్న మాయప్ప య
ల్పుని నాయాత్మ రమించు శ్రీకృప కతంబున్ నేర నేతీరునన్॥ 854

మ॥ పరమానుగ్రహ మొందఁ జేయునటు నా భావంబులోఁ జొచ్చి నా
స్ఫురదంగంబును నాత్మ నొక్కపుడె, తా, భోగించె, నారామసుం
దరశ్రై వర్ధిలు "కాట్కరై" పురిని నిత్యంబొప్పు మాయప్పభా
స్వర నీలాంగుని కృష్ణదేవు కపటవ్యాపార మేరీతిదో?॥ 855

శా॥ నా కృష్ణప్రభు మాయ నిక్కమటు కానవ్వచ్చె. శ్రీలోలుఁడున్
వైకోఁ దక్కిన నాదునాత్మ కడు దుఃఖంబంది "నాకృష్ణుఁడా!
నాకుం భవ్యుఁడవంచు రేఁ బవలు సంతాపించి ఘోషించి ల
క్ష్మీకాంతుండు వసించు "కాట్కరయి" యన్ క్షేత్రంబుఁ గొండాడెడిన్॥

శా॥ నా కైంకర్యము నొందువాని వలెనై నాయాత్మ భోగించె, మా
యా కృష్ణా పహృతంబ యయ్యు నొక కొంతాతంపుఁ గొం[illegible]ని య
ప్పై కన్పించెను నాదునాత్మ కడుఁ గొండాడున్ "తిరుక్కాట్కరై"
నాకున్ భవ్యుఁడ! యంచుఁ బిల్చు వలపున్ సాగించి యార్ద్రింబగున్॥

మ॥ తనకై నాయొక సేవఁ గైకొనకె యాత్మం జొచ్చి భోగించుచున్
దినమున్, దా, ననుఁ బూర్తిగా ననుభవించెన్ నీఱుచేకూఱి కా
రొక్కను మేఘంబటు లున్నవాఁడు పొలుపౌ ప్రోలా "తిరుక్కాట్కరై"
తనకుం దావుగఁ గొన్నవాఁడతనికిన్ దాసుండ గాసిల్లితిన్॥ 858

మ॥ పెను రేకుల్గల తమ్మివంటి కనులున్ బింబోష్ఠమున్ గల్గిన ।
ల్లని సొంప రెడి మబ్బునట్టిఁడునుఁ జెల్వొంబా "తిరుక్కాట్కరై"
యను చోనుండు చతుర్భుజుండు భుజవీర్యశ్రీకుఁడున్ దేవకీ
వనుఁడా దేవునికై మదాత్మపడు క్షోభంబొంద దే యాత్మయున్॥ 859

మ॥ నినుఁ గన్గొన్ననుఁ బ్రోవుజేసికొని పూనిక్కన్ మ్రింగివేయంగ నా
సను నేనున్నను, నన్నుమించి భవదాశన్ నీవు నాకన్న ము
న్నున నన్ను న్నెఱిగా భుజించితివి విష్ణూ! వారిదోదార పా
వనమూర్తీ! చుఱుకైనవాఁడ వగు దప్పా! "కాట్కరై" నాయకా!॥

## — ఏడవ పది —

మ॥ అరుణాంఘ్రిద్వయ రమ్యసారసమ ! యాహారార్థమై మా వనాం
తరమం దొప్పిన యుప్పుటేట సుగమున్నా వీవు నాదూతవై
"తిరుమూడిక్కళ"వాసి దివ్యతులసీ దీవ్యత్కిరీటిన్ ఘటీ
ధర నృత్యప్రియుఁ జూచి నాశిరసు మీఁదన్ బెట్టు నీపాదముల్ ॥ 861

మ॥ పరమ ప్రీతిని మీరు మీమగలునున్ బంధుల్ సుగంబుండ్రి పా
యరుగా రెన్నఁడు నీరకుక్కుటములారా ! బందుగుల్ నిందమో
పిరి "మూడిక్కళ" మందునున్న ప్రభువున్ విచ్చేయకేపోయె! ని
ద్దరి నేలా? యట వాని భక్తులను జెందన్ గూడదో? యగ్గఁడీ ॥ 862

మ॥ సరసిన్ మేతను గాఁ జరించెదరు నిచ్చన్ గొంగలున్ బాతులా
"తిరుమూడిక్కళ"వాసి కెందొగ జిగిన్ దీపిల్లు కందోయియున్
గరముం గాలును మోవి క్రాలఁ గటిపైఁగా తామరాకట్టి సుం
దర వర్ణంబుఁ గలాడు మేము తగమో? తన్మూర్తి కించక్కఁడీ ॥ 863

మ॥ "తిరుమూడిక్కళ" మన్ స్ఫురత్పురమునం దీపిల్లు నాసామి, సుం
దర మేఘావళులార ! స్వాంగరుచి చేతన్ భృత్యులం జేయు శ్రీ
హరికిం దూతలుగాగ నేగి "తమ దేహంబీయరే" యీపె కం
చెఱిగింపన్ మిము సొంపుమాపి మినుఁగా కెందేని పోదట్టునే? ॥ 864

మ॥ త్వర శుభ్రాభ్రమునన్ జరించి, యనలోద్యచ్చక్ర సాదృశ్యమై
మెఱుపుల్ రంజిలు మంజులాబ్దములు ! శ్రీమెండారు స్వైవాఁడునున్
"దిరుమూడిక్కళ"నుండు దివ్యపదవీదేశుండు నాలోని వాఁ
డరుదా క్రొమ్ముడివాడు వానిఁగని నా యాలాపముల్ జెప్పరే? ॥ 865

మ॥ సరసాలాప ముఖాళులార ! ననలన్ జైమంచుఁ గ్రొందేనియల్
దొఱఁగం డ్రావఁగ గల్గుతోఁట లెట విందుల్ సేయుఁ గందోయికా
"తిరుమూడిక్కళ" శ్రీనివాసునకు సందేశంబు గొంపోయి నా
తెఱఁగున్ జారిన కంకణాంబరగతిన్ దెల్లంబుఁగా జెప్పరే ॥ 866

మ॥ వనులం గన్పడు నీరుకోళ్ళు! చనుడీ! వస్త్రంబు, డంబారు కం
కణముల్ దోచి యభాగ్యురాలి నను బిగ్గఁ బాహులఁబట్టి కై
కొనె "మూడిక్కళ"వాసి వ్యాప్తయశుఁడుఁ గ్రొందమ్మి కన్నుల్ ప్రవా
ళనిభోష్ఠంబుఁగలాఁడు వానిఁగని యుల్లంబుచ్చి పోనాడుఁడీ! ॥ 867

మ॥ పరపౌ తోఁపుల తేనెఁ దావి సుఖయింపం గూడునో తేంట్లు! సు
స్థిరమై దట్టములైన కోటలు సమృద్ధిన్ జుట్టునుం జుట్టఁగా
"తిరుమూడిక్కళ" మందు నుండు తులసీ దివ్యత్కిరీటుండు సుం
దర వర్ణుండగు నాదు నాథునకు వార్తన్ జెప్పుఁడీ యొక్కెడన్॥ 868

మ॥ తులసీదామ పరీతమౌళి కరమందున్ దివ్యచక్రంబునుం
గల "మూడిక్కళ"వాసి వానికయి సింగారంబు గావించు రొ
మ్ములు చిక్కెన్ దొఁగకన్నులన్ జలమునుం బూరించితిన్ వాఁడిటుల్
దొలఁగం గూడనిదంచుఁ జెప్పు మెలబాతూ! నీరసంచారిణీ! ॥ 869

మ॥ ఉరుతోయంబున మేతకై తిరిగి సౌఖ్యోత్సాహమున్ బొంది తొం
దఱ లేకేగెడు నంచలార! మెయి జీర్ణంబయ్యె నొడ్యాణమున్
గరముం జారెను లోనిరూపెడసి భంగంబందు మున్ముందుగా
"తిరుమూడిక్కళ" వానికిన్ నుడువుఁ డీతీరొప్పదంచున్ వడిన్ ॥ 870

## —•ఎనిమిదవ పది•—

మ॥ మదియం దాతని నుంచు దాసులకునుం బాపాలుఁబోఁగొట్టు న
ట్టిది; యామోదము జల్లి చల్లనయి కంటిన్ దన్పు సొంపైన పూఁ
బొదలున్ దోపులు దీపిలన్ బొదలు తావున్! దేవు "నావాయి" యన్
గుదురౌ క్షేత్రముఁజేరు కీలకము నాకుంగల్గునే? పాపికిన్॥ 871

మ॥ లతికా సుందరమధ్యఁ బద్మనిలయన్ లాలించు నాథుండు తీ
క్ష్ణతఁ బెంపుంగను కన్నునున్ సుగుణముల్ గన్పట్టు నీలాంబకున్

బతి సర్వేశుఁడు తావుకొన్న "తిరునావాయిన్" సుమోద్యాన శో
భితమున్ దాసుఁడ నేనుఁబొందు దినముల్ వేగంబుగా వచ్చునే॥ 872

మ॥ పారయంగాఁదగు వాసరంబు లిఁక నెప్డున్ రావా? యంచున్ బరం
బరయన్నాఁని చిరంబు కన్నుఁగవ దుఃఖాశ్రుల్ దొఱంగించెదన్
వరనారాయణ వాసమైన "తిరునావాయిన్" దదీయాశ్రితా
దరగోష్ఠిన్ జరియించు పుణ్యదినవార్తన్ నేర్తు నేనాటికో?॥ 873

మ॥ తరుషండంబుల నిండు సూనభరితోద్యానంబు లెందుండు నా
"తిరునావాయికి" నాయకుండ! గుణసాధ్విన్ నీలమీనాక్షి సుం
దరిగాఁ బొందిన సామి! నేనును భవద్దాస్యంబు నిత్యంబునున్
బొరయన్ గోరితి నాకు నేర్పడిన యీపుణ్యంపు నాఁడెప్పుడో?॥ 874

మ॥ అరవిందాలయకున్ ధరాతరుణికిన్ బ్రాణేశుఁ డీలోకులం
దఱకున్, నాకులకున్ నియామకుఁడు స్వర్ధామాధినాథుండు త
త్పరతన్ నిత్యనివాసమున్న "తిరునావాయీ" పురిన్ గంటికిం
గఱవుల్ దీరగగాంచి యుండె ముదముం గాంచంగ నాకెప్పుడో?॥ 875

మ॥ నెఱితోఁ దేఁటులు పూవుఁదోటలునుఁ దేనెల్ ద్రావు నెవ్వీట నా
"తిరునావాయి" వసింతు వాదరముతో దేవేశ! గోపేశ! మ
త్పరమేశా! విషయాంతరంబువిడి నీదాస్యంబ కొంటిన్ నిరం
తరమున్నాకను లిందె నిన్ గనుచు నానందించుటేనాటికో?॥ 876

మ॥ అవనింగొంటి మహాబలి క్షితిపతిన్ యాచించి దేవాసురా
హవమందున్ బరిపంథులన్ దునిమి యిందావాసముం జేయుచుం
దువు "నావాయిని" సామి! సర్వగతు లందుండోచు సంపూర్ణ! మా
ధవ! యయ్యయ్యో! యితండు దాసుడని చెంతన్ దీయవయ్యా! ననున్॥

శా॥ నీవెంతే కృపఁజేయకున్న సరె తండ్రీ! చేసి నీదాసునిన్ ;
బ్రోవన్ నన్నొక వానిఁజేసి భవదంఘ్రిల్ క్రింద గొన్నన్ సరే

"నావాయిన్" నివసించు దేవ! చెడి యన్యజ్ఞానముక్ బోవగన్
భావంబందున నిన్నెయుంచుకొను జ్ఞానంబిమ్ము జ్ఞానాంబుధీ !॥ 878

శా దేవానీకము మానిలోకమును నేదేవుఁ సదా కన్గొనఁ
గా వశ్యంబునుకాదు మూవురకు నొక్కండెవ్వఁడా కారణం
బీవిశ్వంబున కెల్ల నొక్కపతి యా యీశుండు వాసించు శ్రీ
"నావాయిఁ" దరిసించు భాగ్య మెవరింకం గొందురో? యయ్యయో?॥

శా॥ విరిగుత్తుల్గల పూవుఁదోట లెటఁ దావిఁ నింపు "నావాయి" యఁ
బురికిన్వచ్చి వసించు నీలమణి దీప్తుల్ మించు స్వామీ! యయో!
పొరయంగూడెడు నాఁడు నాఁడనుచునే పూటఁ మనస్సీమ త
త్తఱముఁ బొంది శ్రియఃపతీ! యనుచు నీదాసుండు నిఁబిల్చెడుఁ॥880

## —♦తొమ్మిదవ పది♦—

సీ॥ మల్లికాగంధిల మలయ గంధవహంబు చెలరేగి ననుఁబట్టి చీల్చసాగె
అందమైన 'కురంజి'యనెడు స్త్రీరాగంబువినవచ్చె; నస్తంగతుని విభాను
గొనిన సంధ్యాకాలమును భ్రమింపగఁజేసె; నరుణాభ్రరుచిజాల మడలుబెట్టె
ఫుల్లమనోహర పుండరీకాక్షుండు మనసామి వల్లవజన వృషభుడు

గీ॥ సింహగమనుఁడు మాయుండు జిక్కబట్టు। కొని పరీరంభ మొనరించుకొ
నిన స్తనభు। జములఁ గొంపోయి యొంటిగా సాగి మనము। చేరికొను
తాన మెందేని సేరమకట॥ 881

సీ॥ అసహాయులము మన మరసి రక్షించెడు స్థానమ్ము నరయఁగ జాలమకట
ఘణఘణమని మ్రోయు గంటయు, మలయానిలంబులు వేణునాదంబు,పవలు
మాపెడు సంజయు, మంచిగందంబునుఁ బంచమరాగంబు మించు మొల్ల
పువ్వులుఁ జల్లగాపొదలు నుత్తరమారుతము, వీనినెట్టులో ర్తుము చిరంబు

గీ॥ నవని సృజియించి విడదీసి యారగించి। క్రిక్కి కొలిచియు నన్నిట రక్ష
సేయు। నతఁడు మాయుండు రాఁడు దైత్యాంతకుండు। వీనినుండి మన
లఁబ్రోచు వితములేదు॥ 882

సీ॥ ఒరసి… కౌస్తుభ తాసినచనుదోయి మెత్తఁగిల్లఁగలేమిమించు నడుము
వడఁకాడ వగలొప్ప పలువితంబుల కలయికలనుఁగావించి యాతనువున
నేకీభవించి నన్నింతలో నెడఁబాసి పడఁద్రోసి దాదవ్వ పాఱిపోయె
కుహనావినోదుండు కొదమసింగముభంగి వాఁడగు నామాయలాఁడు రాఁడు
గీ॥ తమ్మికన్నులుఁ గెమ్మోవి క్రిమ్ముకట్టి । చలువకొప్పును నాగభుజాలు
పాప । యుతము నామతిఁగుదిరి పల్వెతలఁ జీల్చు నకట! యికమీఁద
బ్రతుక ధారకము కలదే?॥ 883

సీ॥ ఉత్తర పవనంబు లుల్లమందునఁజొచ్చి విచ్చెడి నేనెంత విగతభాగ్య
నకట! చల్లని యుత్తరాశానిలంబులె మండెడుగాడ్పులై యుండె నాకు
నాసింపఁదగు చల్లనైన జాబిల్లియె వేడిమిఁగల చంద్రబింబమయ్యె
నతిమృదు కుసుమశయ్యయె నాకు వేడెక్కి పొలుపుతెక్కలుఁగల్గ పుల్గసేవ
గీ॥ తేజిఁగొను విష్ణుదేవుడన్ దేఁటి తినగ । నాదు స్త్రీత్వసుమంబు జిన్నత్వ
మొందె । వగలడంగక నాత్మలోఁ బొగులుకొనియె । సాయమీఁతయు
నా మనసీయకుండె 884

సీ॥ మనసును సాయంబు నొసరింపదాయెను; నావులుఁజేరు సంధ్యాసమయము
నాయెను మనగొల్లయాయన చిత్తంబు కఠినపాషాణమై కరగదాయె
వాని తియ్యని వేణుగానంబులు కలంచె మనకు సాయమొనగ్గు నవిఁక చెలులు
మనకన్నమున్న యాయనకయి మోహింతురకట కకట! వాని యాదరంబు
గీ॥ లాను కూర్మ్యంబులును బొందగాను మనకు । నెన్నినాళ్ళకు దొరకొను
చెన్ను లేదు । పరమ దుర్లభమయినది తెలివలార! మనకు నిఁక బ్రాణ
ము ధరించి మనికి కలదె ? ॥ 885

సీ॥ వాని కూరిమిఁగొంట పరమదుర్లభమమ్మ! వాని కూరిమికినిఁగాని గుడుల
వలన మిన్నడకాదు వాని కూరిమిఁబొందు వరకునుఁబ్రాణంబు వఱలకుండు
బగలు మాయింపఁగవచ్చు సంధ్యావేళ మనసుఁబట్టఁగలేక వనరుచుందు
శివుఁడును బ్రహ్మయు శీలలాలితలక్ష్మి చేరిన శ్రీమచ్ఛరీరమేచి

గీ॥ మఃస్సునురు వెట్టుచున్నదో యమ్మలార! ఇంకమీాదట మముబ్రోవ నేది
కలదు ? చేయఁదగినది యని యేమిచేయఁగలదు? ఎవరికింక వచింపంగ
నేమి కలదు? ॥ 886

సీ॥ నీలాబ్దనిభ రమణీయాంగుఁడౌ మనకృష్ణు మాయల నపహ్నృతమెయయిన
యంతటి నాస్వాంత మతని పొంత నెచేరె, పలుతావులీను నగలు బొగలును
వైణికారావంబు, పంచమరాగంబు చల్లని తెల్లని చందనంబు।
తనయందు వహియించి యనికి సన్నద్ధమై యుత్తరానిలము చల్వోత్తుకుంద
గీ॥ బంధురామోదమున మీాదఁబడగ వచ్చె। నింత బెడిదంపు చల్లనివింతగాలి
నాత్మ యోరువగాజాల దమ్మలార! యెవరికిఁక నాయవస్థ నే కేమనందు?

సీ॥ పొంగెసు లేగాడ్పు పొల్పు, గమ్మనలనుఁగొనివచ్చి విసిఱె నెమ్మనము గనల
సంజ కెంజాయలు సన్నఁగిల్లఁగసాగె, నట్టుల కౌఁగిటంబట్టి విడుచు
కృష్ణుని మాయ లాకృష్ణునికన్నను బెడిదంబులయ్యెడి. [వెలిఁదొఉంగు
తేనెలు వాసనలూను మల్లియదండ, సౌరభ శుభవర్ణ చందనంబు।
గీ॥ మించి పంచమరాగమ్ము మంచికూర్మిఁ। గొన్నవ్రేతలఁ గౌగిళ్ళఁగూర్చు
కొఱకె। యాదికొను వేణు మధురనినాదములును। వదల కేడ్పించు
నింకేటి బ్రతుకు బోటి ॥ 888

సీ॥ నడుమ సడుమ పెంకెనుడులాడియాడెడు మంజువేణుధ్వాన మాధురిమకు
సైపలే నాతండు సౌరు సింగారించుకొని దాత్యమునొనర్చు కనులసన్న
నొక్క- భావముఁదేల్చి చొక్కంపుమాటల పాటలనొక యభిప్రాయ మొసఁగి
వేడుఱు మొగముననూది తోపఁగఁజేసి పెచ్చుగా దానునునొచ్చిబుచ్చి
గీ॥ మచ్చికంటుల మనములం బ్రిణయరోష। మఱగఁబాడెడు పాటలేమె
ఱుఁగనేర! మమ్మ! అమ్మమ్మ ! సాయంతనమ్మొయమ్యొ ! మాయకృష్ణుఁ
డు రాఁడ నే పోయె నింక ॥ 889

సీ॥ సాయంతినము వచ్చె మాయకృష్ణుడురాఁడు పెనుగంటఁగల తోటపెద్దితోడ
గూడిన చక్కని పోడిమి యావులు మగుడుచున్నవి వేణుమంజురవము

లును కఠోరంబుగ ధ్వనియించుచున్నవి తెల్లనిరంగు రంజిల్లుచున్న
మొల్లపువ్వులయందు నల్లకల్వలయందు మల్లెపువ్వులయందుఁ గొల్లఁగొట్టి
గీ॥ తుమ్మెదలు పాడుచున్నవి తోయధియును। నింగిదెస ఘూర్ణ మానమై
పొంగుచుండె। నిట్టితరుణమునందు శ్రీకృష్ణువిడిచి। యేమనుచు నేము
మనుచుందు మింతులార ! ॥ 890

## —♦ పదియవ పది ♦—

గీ॥ కడలి కెరటంబు లొరయుప్రాకారచయము। బొరయుచున్న "తిరకణ్ణ
పురి"ని హరిని। వటదళశయాను నడుఁగుల వలచికొలిచి। పాపమడఁ
గఁ దొగలనుంచి బ్రదుకుడెపుడు॥ 891

గీ॥ పీతలు పొలయు పొలముల వెనుక కంద। కము, దరిని వెండిప్రాకార
మమరునట్టి। యా "తిరుకణ్ణపురి" నెంచి యలరులుంచి। ప్రతిదినంబును
బూజించి బ్రదుకుఁడయ్య ॥ 892

గీ॥ శ్రితులు వెతలు నశింప నేకతనుఁ దేంగ్లు। తిరుగు వనుల "తిరుకణ్ణపు
రి"ని హరి, న। జాండనాయకు సురనేత నరసి సద్వ। కాస ! యని పూ
ల నర్పించి గడపుఁడయ్య ॥ 893

గీ॥ లేడి సిగ్గిలు చూపు బూఁబోడి నీల। మగని, రమ్యు భజింపు కొండొగ
లొసంగి। గగనమొరయు ప్రహరి "తిరుకణ్ణపురిని"। స్వాశ నెలవున్న
హరి శరణ్యంబు నీకు ॥ 894

గీ॥ తవ పదమునొందు నందఱికును శరణము। తనువు విడిచన్న వైకుంఠము
ను నొసంగు। తారకస్థలి చుట్టుప్రాకార మారు। నా "తిరుకణ్ణ" నను
రక్తులందు గూర్చు ॥ 895

గీ॥ తన పదమునొందు నందఱ దయను మనుచు। నరుణవర,హిరణ్యాసురాం
తకుఁడు సు। వర్ణ వప్ర "తిరుకణ్ణ" వాసి తనకు। నెయ్యులగు వారికి
దినంబు నెయ్యుఁడగును ॥ 896

గీ॥ ఆశపడు నాశ్రితులకుఁ బ్రకాశితుఁడగు । పరమతిని వచ్చువారికి నరయఁ బడఁడు । భూసమృద్ధ "తిరుకణ్ణ" వాసి బంధు । డెదనుఁ దన్నెంచువారిక పొదలు తాను ॥ 897

గీ॥ స్వర్ణవరణ"తిరుకణ్ణ"వాసి పరమ। నాథు పాదాలుఁ గొల్వుఁడి నాఁడు నాఁడు । స్వపద సంశ్రిత సులభుఁడు సర్వరోగ । హర్త జన్మార్తి పరిహర్తయగుచుఁ బ్రోచు ॥ 898

గీ॥ పాదము దినంబుఁ గొలువంగ పాపమడఁగు । మఱియు నిఁకరాదు నాకింక కొఱతయేమి? । వైదికయుత "తిరుకణ్ణ" వాసి యాది । పురుషు దాసుల కే దుఃఖభరము గలదు ? ॥ 899

గీ॥ శ్రీనివాసు నివాసమై శిలలకోట । పొరయునట్టి "తిరుకణ్ణ" పురి స్మరింప । దరికిఁ జేర వఘంబులు తాపమనగ । నిలను నాకేమియును లేదిఁ కేమికొఱత ? ॥ 900





# శఠకోపగీతామృతము.

## —పదియవ శతకము—

### —మొదటి పది—

మ॥ వరనాళీక తటాకశోభితము దివ్యక్షేత్రమైయున్న యా
"తిరుమోకూరు"న నిచ్చలిచ్చపడి సందీపించు వాఁడున్ ఖలా
సురసంహారి చతుర్భుజుండు కమలాక్షుండున్ సువక్త్రాలకుం
డరుణోష్ఠుండగు కృష్ణుపద్మ విడి యన్యాశ్రయంబు నే నాగయన్॥ 901

మ॥ ప్రసవాంచత్తులసీ విభూషితు, సహస్రఖ్యాత పూతాఖ్యు గీ
ము, సుచిత్తుల్ శ్రుతివేత్తలున్న నెలవౌ "మోకూరు" సన్నాని, దా
స సహాయుండగువాని పాదయుగళీ చ్ఛాయాతటాకంబు మా
ని, సమస్తంబగు జన్మలందు పెరదానిన్నేముం గైకొందుమే॥ 902

మ॥ నినుఁ దక్కొండొక యుపాయ మారయము తండ్రీ! యంచు ఘోషించి ని
ల్చిన రుద్రాదిజులతోడి దేవతల రక్షింపన్ జయంబంది గ్రి
క్కున ముల్లోకము లేలు సామి ! "తిరుమోకూర్" గ్రామసంవాసినిన్
మన శత్రుల్ నశియింపఁ గొల్చెద మసామాన్యాశ్రయత్వంబునన్॥ 903

మ॥ వెతలన్మాపి సముద్ధరించుటకు రావే! యంచుఁ గొండాడి స
ద్యుతితో వేల్పులు మానులొప్పు "తిరుమోకూ"రన్ మహాభోగభా
సిత శేషాహిశయాను పాదముల సంసేవించి భావించి స
న్నుతిఁ గావింతుము భక్తులార! మనకుందుల్ డిందు రండీ! యిటన్॥ 904

మ॥ త్వర రండీ! జగదాది కారణుఁడునున్ బ్రహ్మాండలోకత్రయీ
గురువై శౌల్యముఁ గొల్చువాఁడు "తిరుమోకూ"రందు నష్టాశలన్
జెఱుకుల్ పండగ నెఱ్ఱధాన్యములునుం జెల్వారగానుండు ని
ప్పురి చుట్టుంజని యిందె యాడుదము సమ్మోదంబు సంధిల్లగన్॥ 905

మ॥ ఉరు నృత్యప్రియ గోపకృష్ణుఁడును, శౌర్యోన్మత్త దైత్యారి, త
త్పరులై వేల్పులు మానులేముఁ గొలువన్ భవ్యుండు శీతాంబు సుం
దర కాసారములున్, ఫలించు పొలముల్ దైవాఱుమోకూర్ పురిన్
బరమాప్తుండగు వాని పాదఘ్నులు తప్పన్ లేదు మాకాప్యమున్॥ 906

మ॥ అపరిచ్ఛిన్న ఘనాద్వయ ప్రకృతి మున్నైన్న యున్నయండంబుఁ జు
ట్టి పయోధింగలిగించి యందుఁదగు మాడ్కిన్ దొంటివేల్పున్ ద్రివి
ష్టపవాసుల్ జగముల్ సృజించు హరియుండ న్మీరు 'మోకూరు' పే
రిపురిన్ మీరు ప్రదక్షిణింపుఁడి! భవార్తిన్ బూర్తిగాడింపుఁడీ॥ 907

మ॥ వరసూనోప వనోపశోభితమునై పద్మాకరోపేతమా
"తిరుమోకూరు" దొరన్; సురారులు బలోద్దీప్తుల్ సహస్రాఖ్యులం
దఱునున్మగ్ని నశింప దాశరథి నాదైవాఱు రత్నాంబు జా
కరమున్ జేరుఁడి దాసులార! భవదుఃఖంబెల్ల చెల్లై చెడున్॥ 908

మ॥ అమలాబ్జాకర శీతలాంఘ్రియుగ మబ్జాక్షుల్ ప్రవాళారుణో
ష్ఠము, విస్తారచతుర్భుజంబులును గాంచంగల్గు దేవుండు దై
త్య మదధ్వంసి వసింపఁ దోటల ముదంబందించు "మోకూర్" సమీ
పము సంరక్షకమైన దేశముగ మద్భాగ్యంబునన్ బొందితిన్॥ 909

మ॥ మనకుం గోరి సమాశ్రయింపఁ దగు శ్రీమద్రక్షక స్థాన మం
చు నుపాయజ్ఞులు దేవతల్ ప్రబల రక్షోజాతిచే నొచ్చి కొ
ల్వనుఁ గామాకృతి వారిఁ బ్రోచుహరి కావాసంబు "మోకూరు" త
ద్వను తాఖ్యన్ జపియించి మెంచి స్తుతి గావింపుండి! నా బాంధవుల్॥

## రెండవ పది

ఉ॥ 'కేశవ' యన్నఁ గ్లేశములె కీడ్పడు నిత్యముఁ గ్రూరులౌ పరే
తేశుని దూతలుం దరికి సేనియురారు, విషాహి తల్పమం
దాశిలి పవ్వళించు హరి కాశ్రయమై యళిగాన మంజుళం
జాశయ రమ్యమౌ 'తిరువనంతపురంబున కిప్డె చేరుఁడీ! ॥ 911

ఉ॥ ఇప్పుడు పోయి చేరునెడ నెప్పుడు ముప్పులు చేరరావు పెన్
దిప్పల వంటిమేడ లటనేగురుగింజలుఁ బొన్నచెట్లులున్
గుప్పున తావితో వనులుఁ గూడు "ననంతపురంబు" సామి పే
రొప్పి యొకండె వేవితము లోము పరంపదమిచ్చు సంస్మృతిన్॥ 912

చ॥ పులుఁగున నెక్కివచ్చు సిడమున్ బులుగే జగమెల్ల, మ్రింగి యు
వ్వల వెలిఁగ్రక్కువాఁడు నిలువం జలువైన యనంత పట్టణం
బలరునఁ జొచ్చిరేని కలుషార్తులడంగెదు నేము గట్టిగా
దెలిపితి మీకు పేరులను దేనినొ వేయిఁట నొండుఁజెప్పుఁడీ॥ 913

చ॥ ఘన జలపూర్ణ వార్నిధి యగడ్తగ చుట్టగ తావికొట్టుచున్
వనులుఁ బొలాలుఁ బొల్పుఁ గొలు పంగ ననంతపురిన్ వరించి కై
కొను జగదీశు సన్మతినిఁ గ్రొన్ననలం గొని పూజఁజేయు భ
క్తుని కృతపుణ్యవైభవము గొంకక మెప్పుగ నెత్తి చెప్పుఁడీ॥ 914

ఉ॥ పున్నెముఁజేసి మంచి జలముం బువులర్పణఁజేసి నాదు సా
మిన్నియతిన్ స్మరింపుఁ డది మీ భవమున్విదళించు తోటలన్
జెన్నగు నియ్యనంతపురి సేవ్యుని పాదసరోజసేవ యం
దున్న జనుల్ సురాళి యని యొత్తి యెఱింగెదునట్లు జెప్పితిన్॥ 915

ఉ॥ ముందు కుమారుతండ్రి వగపుందొలగించు నమర్త్యనేత గో
విందుఁడు పవ్వళించు కను విందగునట్టి యనంత పట్టణం
బొంది భజించు నింద్రుఁడు సురోత్కరమయ్యెడ సేవఁజేయునో
బందుగులార! మాట విని పంకజనాభునిఁ బొందరండటన్॥ 91

మ॥ ఇలయు న్నింగియుఁ దక్కలోకములునే యీశుండు సృష్టించి లో
పల మ్రింగున్ బరమస్వరూపుఁ డతఁడే భవ్యాహిశయ్యాశయుం
డెలయున్; నీటిమయంబనంత పురి నెందే వీఁటిలోఁగిళ్ల ముం
గిలి వాకిళ్లను నూడ్చికొన్న మనకున్ ఖేదంబుఁ బాయఁదగున్॥ 917

మ॥ కడుఁ బాపంబులఁ బాపవచ్చు మదనుంగన్నట్టి పాయంపు కృ
ష్ణుఁడు రమ్యంబగు నయ్యనంతపురి లోనుండావుఁ గొన్నాడు పె
న్బడగల్ చొప్పడు చిల్వపాన్పుఁగల దేవస్వామి పాదాలపై
బడుఁడో బంధులు ! వెళ్లుఁడేమెఱుఁగగా భాషించినామీమెయిన్॥918

శా॥ మేమున్ మీకెఱఁగించి చెప్పు దినముల్ మించన్ సమీపించె నా
రామోద్యాన మనంత పట్టణము సర్వక్షేమదంబండి ! భ
వ్యామోద ప్రసవాళి ధూపమును నాయత్తంబుఁగావించి శ్రీ
స్వామిన్ వామనుఁ గొల్వ పాపములుఁబోవన్ సాగుతామై తొరన్॥919

ఉ॥ శ్రీపతి యన్న పాపము నశించుఁదనంతన పైడికోట చే
దీపిలు నా యనంతపురి దేవుని కంచును మంచిగందమున్
దీపము ధూపమున్ విరులుఁదెచ్చి దినంబునుఁ బూజసేయగా
నోపిన భాగ్యశాలురు మహోన్నత కీర్తినిఁ గాంత్రు భూమిపై॥ 920

## —•మూడవ పది•—

సీ॥ పచ్చివెదురులట్టి బాహులుకృశియించె నాకార్శ్యమును వియోగాకులతయు
దేని లెక్కింపక స్వానురాగమ్ముల గోయిలల్ తమ యిచ్చఁ గూయఁజొచ్చె
గుంపు గుంపులుఁగాగఁగూడి నెయ్యుఱతోడ నాడుచున్నవి నెమ్మ్లు లాడనీడ
చాలఁ గూరిమిఁజేయు నాల మందలమేపుటకు నీవుఁబోవు నీయొకదినంబు॥

గీ॥ వేయి యుగముల చాయఁ గన్పించు నాకు ! కమల విమల విశాలనేత్ర
ములతోడ
గాంచి యూరించుచున్నావు గదరకృష్ణ ! ! నీవు దయఁగలవాఁడవుఁ
గావు కావు॥ 921

సీ॥ కృపలేదు కృపలేదు కృష్ణ ! నీకొక్కింత మద్విశాలో రోజమండలంబు
గౌఁగిలించెదు నెడఁ గౌఁగిట నిముడక మిన్నందికొనెడు నమేయ దివ్య
సౌఖ్యప్రవాహంబు సాగి బుద్ధిఁగలంచి వ్యాపించి యంతలో నాసుఖమ్ము
కలవలెచన నట్టి కడఁ బ్రాణధారక మగునాస లోఁజొచ్చె నాత్మనైప

గీ॥ కున్న దయ్యయ్యొ! మఱి మఱి నిన్ను విడుచు । చున్న చెన్నునఁ గన్పడు చున్న దవుర ?
పసుల మందలమేపెడి పనికిఁగాను । ఁబోవుటయె నీకు నిఁక లేకపోవుఁ గాక॥ 922

సీ॥ ఆయావులను మేపఁబోయితివేని నెమ్మేని ణో ప్రాణంబు మిప్రులదింక
యాత్మ నిట్టూరుపు టగ్గని మ్రగ్గెడి దరిఁజేర్ప సాయమెవ్వరుసు లేరు
నేను బ్రదికియుండి నీశ్యామలాంగంబు నీగమనము గమనింపకుంటి
నీవు విశ్లేషించి పోవు నొక్కదినంబు నెంతకుంబోకున్న దెగిరిపోరు॥

గీ॥ మీనులట్లున్న నాకనుల్ మెండు నీరు । కొనియె గొల్లకొలంబున గోపికలము
నగుచు బుట్టు న భాగ్యల మనుభవించు । నీవియోగంబు మాకొక చావుఁగాదె?॥ 923

సీ॥ గోవింద నీసేవఁగోరి మేము సహించు నివ్వియోగంబు స్నేహితుని నిన్ను
నెడఁబాయఁగాఁ గలిగెడు వ్యసనంబును నించుకంతేనిఁ దలంచవైతి
నీ పశువులపాక నెగడు నావులకాసపడి మమ్ములను విడిచివైచి వాని
మేపఁగఁ బోతివి మేము సుధాపాక మధుర రసోర్మికా మంజులముఁగ

గీ॥ నీదు బింబాధర గళిత నీచకృతి । మోక్తులఁ దలంచినపుడు మాయుల్ల మందు
నవె ప్రవేశించి స్థిరమయి యానుకొనగ । ప్రాణ మెంతయుఁ బరితాప వంతమయ్యె॥ 924

సీ॥ పవలావులను మేపుపనిఁ బోవుచోకృష్ణ! ఓదార్చుమాటల నొక్కటొకటి
దలచి నాయాత్మ సంతాపించు నవ వికస్వరకుంద కోరక స్పర్శలొందు
నుత్తరపవనంబు లొత్తిపీవగ మద వంతమై యొప్పు సాయంతనంబు
వచ్చె కౌస్తుభధారి వక్షంబు నందలి మొల్లపువ్వులు నాదు ముగ్ధకుచము

గీ॥ లకుఁబరిమళము లొసఁగ నీలలితవాగ । మృతము నిచ్చుచు భవదలంకృత శుభంక
ర కరపంకరుహము మాశిరస్సులందు । నుంచు నీదాసురాండ్రి బాలించు మయ్యో! ॥ 925

సీ॥ సాగరగంభీర చారులోచన! కృష్ణ! దాసీ జనులము మా తలలమీద
నీవుంచవలయు మధ్యేమార్గమందున నీ రమణీయాంఘ్రి నీరజముల
నొత్తఁగఁ గొమరాండ్రు నున్నారు పల్వురు నీ వదియట్లుండ నిమ్మమీద
నారీత్వముందాల్చి యోరువలేమింక వడిఁగల మారెండు వెడదకనుల

గీ॥ నీళ్లుఁబ్రవహించె మనసు ననిశ్చితమగు । గావున న్నీవుఁ బశులకై పోవుటొక్క
ముప్పుమాకెల్ల మాయాత్మనిప్పుదరిని । మైనమటుల కరగి దహ్యామానుకట్ట! ॥ 926

సీ॥ వెలికంకణంబులు మొలనూలునుంజారె, విమల కమల నయనముల నశ్రు
జలబిందువులుఁ జారె, బలిసినచన్నులు సన్నఁగిల్లెను మా భుజాలువాడె
హరి నీలరత్నవర్ణా! కృష్ణ! కెందామరల సుందరత పుష్పముల మృదుతయు
గలుగు నీయడుఁగులుఁ గడునొవ్వ నీవేగి యావుల నాశించి యాదరించి

గీ॥ మేపికొనుచుండునపుడు నీమీద వచ్చి । యసురసేనలు పోరనే మగునొనీక
టంచు మా యాత్మభీతిల్లి యగ్గిచేర్పు । మైనమటుల కరగి దహ్యామాను కృష్ణ! ॥ 927

సీ॥ అసురులతోఁ బోరు లాయత్తమైనచో నేమగునోయని నామనస్సు
నారాటపడుఁ జనకయ్య మందలవెంట స్నేహంబు, వేడ్క, సంశ్లేషరతియు
లోన బాధించెడిఁ గాన నన్విడిపోకు వశపర్చికొను నీదు పద్మమట్టి
కన్నును వాతెఱ కరములుఁ బీతాంబరముజూచి మోహించు కమలనయన
గీ॥ లణువలగ్నలు జవ్వనులైన గోపి । కామణుల గూడి నీకునుఁ గామ్యలైన
లక్షణవతులగూడి శ్రీవక్ష ! నా,స।మక్షమందున విహరింపుమయ్య కృష్ణ॥

సీ॥ నీ వాసచేసిన నెఱజవ్వనులఁ గూడి వర్తించి యెదలోని వలపుఁ దీర్చి
కొన్న,మాకు ముదంబె కొలుపదె? మాదైన యాస్త్రీత్వమింక సహింపలేము
మాస్వామి ! పశువులమంద మేపుటకింక పోఁగాదు కంసు పంపున ననేకు
ల సురులుఁ గామరూపాప్తిఁ జేఁబొదలిసి ముందఱఁ దిరుగాడు చుందురచట
గీ॥ జిక్కితివయేని నీకును రక్కసులకు । గపట సంగరములుఁ బెక్కుఁ గ
లుగ వచ్చు
గానమము విడి యావులఁ గానమేప । గానుఁబోకయ్య ! నామాట నూ
నుమయ్య ! ॥ 929

సీ॥ స్నిగ్ధారుణాధర ! శ్రీకృష్ణ ! మాబాల గోపాలదేవ సక్రూరహస్త
ల సురులుఁ గంసరాజంపింపఁ జెలరేగ తపసులు మివుల సంతప్తులగుచు
నట సంచరింతు రయ్యటవుల కీవొంటిమై పోవుచుందు పల్మాఱులకట
మనసిచ్చి బలరాముఁ గలిసియునుం బోవు కపట సంగరములుఁ గలుగునంచు
గీ॥ మాకు జిత్తమునంజిచ్చు మాడ్కియయ్యో । నయ్యో ! నామాటఁ జెవిఁబెట్టు
మయ్య ! నీకు
బరమ పదవాసమునకన్నఁ బశులమేపు । టన్నమిన్నగ సంప్రీతియున్న
దేమొ ? ॥ 930

## —♦నాల్గవ పది♦—

ఉ॥ సోదకమేఘవర్ణుఁడును నుత్పలనేత్రుఁడు నీళ్లు నింగియున్
మేదిని కీలి గాలియును మించి సుదర్శనమున్ ధరించి భ

గ్యోదయులైన దేవతలయొక్క నుతింగను భూరితేజు దా
మోదరు పాదపద్మయుగ మొక్కటి ప్రాప్యము భక్తియోగికిన్॥ 931

ఉ॥ మిన్నున నున్న వేల్పులకు మిన్నయు నుల్లమునందు నుంచుకో
కున్నఁగనంగ దుర్లభుడు నొప్పుగ లచ్చిని నిచ్చ మేనునన్
గొన్న విభుండు రక్తనయనుండు నధీశుఁడు రెండు కర్మలన్
ఛిన్నముఁజేసి నన్ను దయచేసి ప్రపాలనఁ జేయుచుండెడిన్॥ 932

చ॥ నను ధృతచక్రిఁ డోము జననంబుల దుఃఖము వీడిపోయె నిం
కను మఱిరాదు నాకును నొకానొక లోపములేదు కాంతిఁగై
కొని యెలమీనులీను తళుకుంగల కన్గవఁగ్రాలు నీల నా
థుని పదములఁ గనుంగొనుచుఁ దుష్టిగ నొదలఁ దాల్పఁ గల్గితిన్॥ 933

చ॥ తలపయిఁ దాల్చి కొంటిని పదమ్ముల మఱ్ఱి దళంబుమీద ని
ద్రిలు పయిచేయి దివ్యజన దిష్టముగాఁ జని వేంకటాచల
స్థలిపయినుండి నామతి సతంబు వసించెడి విష్ణుదేవు ని
శ్చలతను నిశ్చయించికొని చాలఁ గృతార్థుఁడనైతి నేనునున్॥ 934

ఉ॥ నా మనసింకమీద గరుణన్విడఁబోడని నిశ్చయించితిన్
సామియుఁ జక్రహస్తుఁడునుఁ జక్కని మాయలవాఁడభక్త పూ
జాముదితుండుగాడు మఱి సత్యముఁజేసెడిన ట్లసత్యమున్
బ్రామెడువాఁడు నామనసుఁబట్టినవాఁడు భుజంగ తల్పుఁడున్॥ 935

ఉ॥ నాగ శయానుఁడుం బ్రతిదినంబు మనంబున భక్తి నుంచగా
సాగెడువారి స్వీయకృప సాకెడువాఁడు మహానభంబు నం
దూగెడు పిల్లచందురుడు నొప్పు జడంగలవాని మేనిలో
భాగమునందు నుంచుకొను వానిపదంబుల నాశ్రయించితిన్॥ 936

ఉ॥ నీలమణి ప్రకాశ రమణీయుఁడు న్మధుసూదనుండు నా
పాలకుఁడై యలంకృతిఁగఁ బచ్చని బంగరు రంగెసంగఁ గ

య్యాలకుదూకు చక్రమును హస్తమునంగలవాఁడు సంసృతిన్
గూలిచి ప్రోచు జన్మవెత కూడదు కొల్వుఁడు తత్పరాత్పరున్॥ 937

మ॥ ధృతచక్రుండు గభీర నాకులకునుం దివ్యప్రభావుండు ని
ర్మిత కాలుండునుఁ గాలసంస్థితుఁడు కూర్మిం గోపులన్బ్రోచినా
పతి దార్ఢ్యాంచిత బాహులెత్తి గిరిపై కచ్చెల్వుఁగాఁ దాల్చు శ్రీ
పతి యంఘ్రుల్ మఱువంగఁబోక మనసా! భావింపు నిత్యంబునున్॥

చ॥ తనయెడ భక్తిఁజెంది సతతంబును నాశ్రయమంది వర్తిలన్
మును దయచేసి తానుడువుబోధ ప్రకారముగానె పద్మపు
ష్పనిభ పదద్వయంబు గను భాగ్యము నాకమరించె కన్నయం
తన సకలాఘ దుఃఖములు దబ్బున నన్విడిపోయె నన్నియున్॥ 939

చ॥ మనసును శాస్త్రరీతి నొకె మార్గమునందున నుంచి మాధవున్
దిన దినమున్ నవీనమగు దీపము ధూపముఁబూలు నీరు తో
డను బ్రతిదిక్కునందుఁ బ్రకటంబుగ వేల్పులుఁ జేరి కొల్వ నె
క్కొను గొనమున్న వెన్నునడుఁగుల్ పరమాశ్రియమా శ్రితాళికిన్॥

—•ఐదవ పది•—

కం॥ వెన్నుని చరణద్వంద్వం । బున్నతిఁబొందంగ మనసు బొందిన మీలో
నెన్నంగఁదగిన నామం । బన్నారాయణ సమాఖ్యయగు నిశ్చితమై॥941

కం॥ ధారుణికి వల్లభుండును । వారణ దుర్వారమదని వారణుఁడు జగత్
కారణుఁ డొక్కఁడు శ్రీమన్నారాయణుఁడే సుమండి! నాకు రమణుఁడున్॥

కం॥ తానేపుట్టించెను మఱి । తానే వెడలంగఁదీసెఁ దానే మ్రింగెన్
దానేక్రక్కెను వెలికినిఁ । దానే పాలించు లోకతండముఁ దానే॥ 943

కం॥ నీరధిజలమునఁ దనుబల । సారంబునొప్పిరులున్న సర్పమ్ముపై నొ
ప్పారెడి సామిచరణముల । నారాధింపుఁడి దినంబు నలరులతోడన్॥944

కం॥ నాఁడును నాఁడునుఁ బనివడి। వాడని కుసుమములతోడ వానిం గొలుఁడీ
పాడుఁడి తన్నామము కా। పాడును మోక్షంబు నందనయ్యెడు మీకున్॥

కం॥ కాశతృణ కుసుమసమసం। కాశుఁడు పీతాసురీ స్తనక్షీరుండున్
శ్రీశుఁడు వేంకటకుధర ని। వేశుఁడు సర్వేశుఁడాదివిష్ణుఁడు సుండీ॥ 946

కం॥ ఎల్లెడ మాధవ యని యని । వల్లింప సమగ్గ లేని పాచీనాఘం
బెల్లయుడుల్లును మఱిమీ । వల్లఁ గనరాదు ముందు పాపంబెదియున్॥

కం॥ చేరనె చేరదు పాపము । నీరాపూరాభ్రనిభవినీలుని పెంపౌ
పేరు స్మరించెడువారె । వ్వారైనను వారమర్త్యవరులౌదురుపో॥ 948

కం॥ అమరులకును బొందనశ। క్యము భక్తులకు సులభుండు నాతనియందే
యమరిభజియించు శ్రితసం। ఘములకు బ్రతిబంధకములు గనరాకుండున్

కం॥ కూరాజ్ఞానములుం గ। ర్మారంభములనెడు నట్టివన్నియు భీతిన్
బాఱు ఝురీగతసుమముల । దారిచి సర్వేశు శ్రీశు ధ్యానించునెడన్॥

—♦ ఫలశ్రుతి ♦—

కం॥ హరికృపఁగల శరకోపుని । వరసూక్తి సహస్రమునను బదియగు నీపా॥
శురములు భక్తులకాహరి । పరమకృపామృతమునందు బాటొనరించున్॥

## —♦ ఆరవ పది ♦—

(వాట్టాఱు—గ్రామనామము)

మ॥ దయనొందందగు దాససత్తములకుం దాసుండ నాయందునన్
దయఁజేయన్ బనిఁబూనె చక్రి; యదియున్నా యిచ్చమైఁజేయు; నీ
పయినీభూమినిఁ బుట్టగోర; మనసా। పైబాయు మజ్ఞాన మె
వ్వియు నష్టంబుల గట్టిపెట్టికొలుమా। విష్వ్యంఘ్రి "వాట్టారునన్" 951

మ॥ ఘనభూమిన్ జననార్తిమాపికొను వేడ్కన్ నేను "వాట్టారు"వా
సుని పాదంబులవ్రాలి కేశవుని నీశుం జాలపద్యాలఁ బే

రొక్కని కర్మాగ్ని సమూలమున్విడిచి లౌక్యుల్ జట్టుబోనాడి వా
నిన నారాయణుఁబొందితి న్మనస! దీనిన్నీవు నూకొందువే ?॥ 952

శా॥ నా యుల్లంబ! బహుస్తుతుల్ సలిపి శ్రీనారాయణుంబొంది నా
నీ యుర్విన్ ఘనసంపదల్బొదలఁగా నేపారు "వాట్టాఱు" స
'స్థై యారన్ హరివచ్చి యిష్టు తన దివ్యాస్థాని విధ్యుక్తి సం
దీయం దొందఁజేసె నేఁదలఁచినంతే యొప్పవీకార్యముల్ ॥ 953

ఉ॥ మంచిమనస్సు! పాపమయ మానసుఁడైన హిరణ్యరొమ్ము చే
దించిన ప్రోడ తేడులు మదింజెదరం దురమందుఁ బొందుగా
ట్పంచ సుతార్థి మాయుధముఁ బట్టిన మాపతి లోననుండి గా
వించెను తానె యాద్రవిడవేదము మేదిని నా దయార్ద్రతన్ ॥ 954

మ॥ పరమాస్థానముఁజేరు దారులును శ్రీ "నాట్టాఱు" నాథుండు నన్
బొరయంజేసెను వాని సూక్తికృతి నేఁ బొందందగెన్ జిత్తమా !
నరకంబుం గని నవ్వ తేనియలుఁజిందన్ బువ్వదంపొప్పు శ్రీ
చరణంబుల్ గరుడాధిరోహుఁడెల యించన్ వచ్చె నాయాదలన్॥ 955

మ॥ చరణాలాదలమీఁదనిల్పె జలరుట్పత్రుండు నాసామి సు
స్థిరుఁడై యుల్లములోఁ జలింపఁడచలశ్రీఁబొల్చు సౌధాలతో
"తిరువాట్టాఱు"న శేషశాయియయి యాదిం దన్నుఁబైకొన్న దు
ర్భరదంతిన్ బొగరొత్తుసామి వినదత్పాదంబులం డాసితిన్ ॥ 956

మ॥ వినదత్పాదయుగంబు డాసితిని గోవిందుండు నాయందు నుం
డును భంగోద్భట వారిరాశి తనచుట్టుంజుట్ట "వాట్టాఱు" ద
క్షిణమందున్నది కొండలట్టి గృహాపంక్తిం గ్రాలి తద్దేవు పా
వన పాదంబులమీఁది శ్రీతులసి సంవాసించె నామేనిపై ॥ 957

మ॥ మయిపైఁ గమ్మనఁ గుమ్మరించు తులసీమాలా లసన్మాళియై
పయిపైఁబొల్చు బొరుచక్రము ( గరాబ్జంబందు గైకొన్నవా

డయి మేనుం జలమట్టుఁ గజ్జలము నట్టందంపుఁ గొండట్టు లో
ప్పయి "వాట్టాఱు"న నున్న వెన్నుఁడది జేయన్ నాకు లో వెల్గెడున్ ॥

మ॥ ఎదపై మంగళదేవతా కలితుఁడై యింపారు శ్రీలొలు పో
లది "వాట్టాఱ"ట తేరు పక్షిపతి విఖ్యాతుండు యోధుండు ద
ర్మదరక్షఃకుల ముక్కడంచు హరి, చేరన్వచ్చి నాయుల్లమం
దు దయన్నెక్కొనె సాదరుండగుచు నన్నుస్వీడఁడే నాఁడునున్॥ 959

మ॥ మఱికెల్లప్పుడుఁ గొల్చుచుండుమని జన్మస్మాన్బచ్చి నన్ జేకొనెన్
నరసింహుండు హిరణ్యహంత జిగియున్ బల్ రేఖలున్ నోరులున్
బరగన్ శేషునిఁ బాన్పుఁగొన్న పతి న"వ్వాట్టాఱు" నాథున్ మహా
పురుషుం గొల్చిన దాసుఁడొందఁగు పెంపున్ నాకుఁజూపించెడున్॥ 960

— ♦ ఫలశ్రుతి ♦ —

మ॥ తనవా మోక్షియునడుంగు దమ్ములనుఁ బొందన్ జూపి సంసారజీ
వనమున్మాపిన సర్వనాథుఁడగు శ్రీ"వాట్టాఱు" జేజేకునై
వనశుంభత్కురుకూరువాసి శఠకోపస్వామి తాఁదా్రవిడం
బునఁ గావించిన సూక్తి నీపదియు దివ్యల్విండ్రి సంతృప్తులై॥

## — ♦ ఏడవ పది ♦ —

### మాలిరుంజోల — గ్రామనామము

శా॥ మాయాచోరుఁడు, మాయి, మాయకవి నెమ్మె "మాలిరుంజోల"వాఁ
డే యస్మద్భ్రుది, నాత్మఁజొచ్చి నెఱిగా నేకీభవించెన్ బరా
జ్ఞేయుండయ్యెను తా నెమ్మై తనరె వానింగొల్వ విచ్చేయుఁడీ
మాయాత్మన్ గదుఁగాచికొంచు కవితా మేధావులారా? తగున్॥ 961

శా॥ నేనన్వస్తువుఁ దా నెయై తననుఁ దానే మెచ్చుచున్ న కునుం
దేనెల్ బాలునుఁ జక్కెరల్ సుధల భంగిన్ "మాలిరుంజోల"వా
డా నెన్నాదగు నాత్మఁజొక్కె నెఱి సర్వాపూర్ణుఁడైయుండి లో
కానీకంబునుఁ బ్రాణిలోకమునుఁ దానై యున్న సర్వేశుఁడే॥ 962

శా॥ ఈ నా యాత్మ నెఱిన్ భుజించుచునుఁ, దా, నీహేయకాయంబునం
దేనిం జొచ్చి మదీయమంతయునుఁ దానేయైన మాయాఢ్యుఁ డి
క్కై నిత్యస్తుతి దక్షిణంబునను వింతా "మాలిరుంజోల" ది
క్కేనున్ ద్రొక్క లభించె నొండెడకుఁ బోనీఁడెట్టి వ్యామోహమో?॥

శా॥ లోకప్రాణులకెల్లఁ దానెయయి భూలోకస్థుఁడై దానవా
నీకం బేదగ దక్షిణాపథమునన్ "శ్రీమాలిరుంజోల" నన్
మాకుంగూర్చెదు కొండవీడఁడొక గమ్యస్థాన మట్టిప్పు నా
దా కాయంబును వీడఁడేమికృపయో? యాస్వామికిన్ నాపయిన్॥ 964

శా॥ తన్నాశింపని సన్నిశాచరులు వంశంజావ సాధుల్ సురల్
జెన్నొందంగను నెన్నగాని సిరికై సేవించి సన్మౌనుల
చ్ఛిన్నానందము నొంద గెయకవిశాశ్రీ "మాలిరుంజోల" లో
నున్నయ్యే తనె నేనునై తననె నెంతోఁ దానె కొండాడెడున్॥ 965

మ॥ అరుణాభక్తి శివుండు బ్రహ్మ చరణాలర్చించి యిష్టార్థ మొం
దిరి పెంపైన త్రిలోకముల్ గడుపునం దేయుంచి కల్పంబులన్
బరమార్థంబుగ వానిఁ బ్రోచెడిని సుమ్మా! "మాలిరుంజోల" లో
హరి నన్నుం గరుణించి కాచుటకునై వ్యామోహముం బొందెడిన్॥ 966

మ॥ "దొర! మమ్ముం గృపఁ జూడు" మంచునుఁ ద్రినేత్రుం డాదిజుం డింద్రుఁడున్
సుర లజ్ఞాన విహీనమౌని జనులున్ స్తోత్రంబు గావించు శ్రీ
హరి వాసంబగు వేంకటాద్రియును భూతాజ్ఞానమై యంతమం
దిర సౌందర్య రమణీయమైన కుధరం బీ "మాలిరుంజోలయే"॥ 967

మ॥ పరవైకుంఠముఁ బాలసంద్రమును శుంభన్ "మాలిరుంజోల" సుం
దర శేషాద్రియు నాశిరంబుఁ దనువున్ నామాయ జీవాత్మకున్
మఱి నాయుల్లము వారలం గ్రియల నేమాత్రంబు రుస్వీడకా
హరి కాలాదికి వస్తుకారణుఁడు నిత్యార్థుండు నాశ్చర్యమై॥ 968

శా॥ కాలాది ప్రథమైక కారణుఁడునై కల్పంబుఁ గల్పంబులో
కాలం గల్పనచే సృజించి పెరుగంగాఁజేసి పోఁజేసి యం
దోలిం దిర్గెదు నబ్ధివర్ణ నెలవోయుల్లంబ! యీ "మాలిరుం
జోల"ఁ బాయకు మేన బ్రాణమెడలం బోనోపు మీ జానగుణా॥ 969

శా॥ నేనే నీవయి నన్నుబ్రోచితివి తండ్రీ! "మాలిరుంజోల" వా
సా! నాసామి! చెలంగునైదు విషయాల్ జ్ఞానేంద్రియాలైదు క
ర్మానీకేంద్రియపాళి, భూతములునై దాత్మ ప్రధానంబు లం
దాఁనవ్వచ్చు మహత్త హంకృతి, మనం బామాయ మాయింపవే॥ 970

—♦ఫలశ్రుతి♦—

గీ॥ మహదహంకార మనసులు మాయ నింద్రి। యంబులఁదా నహంకార
మగుచు దానె। యన్నియగు "మాలిరుంజోల" యతనిగూర్చి। కురుక
శఠకోపుఁడీ పదివరలఁ జెప్పె॥

## —♦ఎన్మిదవపది♦—

మ॥ సిరితోడాగతుఁడై మదిన్నెఱిగఁజొచ్చెన్ "మాలిరుంజోల" భూ
ధరమున్ బేర్కొనునంత శ్రీశు వసతిస్థానంబనన్ శ్లాఘ్యసుం
దర రత్నంబులఁ ద్రోయు తోయములతో దైవాఱు కావేరి యన్
దరణీరత్నము దక్షిణంపుదరి చెంతన్ "తెన్‌తిరుప్పేర"యే॥ 971

శా॥ "పేర"గ్రామ నివాసి కృష్ణుఁడిపు డిష్టే వచ్చి "నిన్‌బాసి పో
నేరన్నే" నని నా మనస్సుననుఁ దా నిండారఁగాఁ జొచ్చె న
వ్వారిన్ సప్తసముద్రముల్గిరులు నభ్రంబుల్ జగంబుల్గొనన్
భూరింపంగనురాని పొట్టగలదేవున్ బూర్ణుఁగాఁ గొల్చితిన్॥ 972

మ॥ కొలువం గంటిని వాని నా భవముఁ బోఁగొట్టంగనుంగంటి వ్యా
ధుల నింకొందక గెంటి మంటి భవమందున్ జిక్కగాఁజేయు నిం

దలి మాయన్మఱగిడించుకొంటి ధ్వజసౌధాల్ గోపురాల్ చుట్టు వ
ర్ధిలు "పేర"న్ హరిపాదముల్ సులభరీతిన్ నాకుఁ జేకూఱెడిన్॥ 973

మ॥ సులభంబయ్యెగదా! యటంచును మదత్యుల్ సంతసిల్లంగ మో
దిలు డెందంబున మోదమందెదను నెందే చారుకీరాది ప
క్షుల సంచారము తోఁపులందుఁ గనుపించున్ ద"త్తిరుప్పేర" యం
దలి దేవుండె యొసంగు నుత్తమ పరంధామంబు నాకుంగృపన్॥ 974

మ॥ మకరందస్రవ పుష్పవాటికల రమ్యంబౌ "తిరుప్పేర" నా
యకుఁడే నాకును నాకమీఁదలఁచి డాయన్వచ్చి తా నొట్టఁబె
ట్టుకొనెన్ నాదగు మాంసదేహమున నిష్ఠన్ బానుగాఁజొచ్చి చై
తక లాడించుచు నన్నుఁగీడ్పఱచు మత్కర్మంబులం గూల్చెడిన్॥ 975

మ॥ చెలువారన్ బెనుపేరి "పేరపురి"లో శ్రీ "మాలిరుంజోలలో"
నెలవై యుండు పరుండె యిష్ఠ చనుఁదెంచెన్ "నేను నెక్కొందు నీ
స్థలమం"దంచును నా మనోగృహమునన్ సంపూర్ణుఁడై చొచ్చె సం
కలిత ప్రీతిని తత్సుధామధుర భోగంబౌని మోదించితిన్॥ 976

శా॥ భృంగామోద వనంబులొప్పిన "తిరుప్పేరం"దు నున్నాడు త
న్నుం గాన్పించుచు నన్నుఁ దన్పుచునుఁ గన్నుందోయి యందుండి పో
వంగా నోపడు వానిఁజొక్కి ముదమొప్పన్నేను నున్నాను ధ
న్యుంగావించె సుభక్తి నంతిమ శరణ్యోక్తవ్య వాక్కొందితిన్॥ 977

మ॥ కదలంబోఁడఁక కంటినుండి తన సంకల్పంబునన్ బెద్ద యెం
చుదమన్నం గడుఁ జిన్న యేదురసౌముల్ సొంపట్లు భోగ్యంబుగా
బొదలున్ రంగులమానికంపు పనిగీముల్ మీరు "పేరం"దు నా
హృదయంబందును నిష్ఠ నెయ్యమున వాఁడేయుండె నిక్కంబుగన్॥ 978

మ॥ ననుఁ దా వస్తువొకండుఁ జేసి యిపుడే నాయందుఁ దన్నుంచెఁ దా
మును నన్ దవ్వున నుంచ నెంచిన కతంబున్నేర స్ఫారాద్రి దీ

ప్తిని సౌధంబుల నెల్లెడంగల "తిరుప్పేరం"దునున్నాడు చ
క్కని ముక్కొక్కటి నాకుఁ బలుక్కమని పలక్కన్ నేను యోజించితిన్॥

మ॥ కరుణాబ్ధీ! నినుఁబొంది సంతసిలి కైంకర్యంబుగావించి త్వత్
చరణానందము నొందినా నిటుపయిన్ స్వామీ! యిదే కావలెన్
వరశాస్త్రాధ్యయనుల్ శ్రుతిస్థిరులు నొప్పంగా "తిరుప్పేర" భా
సురుఁడౌ శ్రీశు ననన్య శేషులగు దాసుల్ దుఃఖముల్ గాంతురే?॥ 980

— ♦ ఫలశ్రుతి ♦ —

చ॥ గుణిగణముల్వసించు కురుకూరుపురిన్ శఠకోపుఁడార్జవం
బున ద్రవిడోక్తులన్ బలుకు భూరిసహస్రమునందు "పేర"పై
నొనరుచు నీపదిన్ జదువు నుత్తమభక్తులు దుఃఖ మేద కాం
తినిఁ దనరారి వ్యాప్యమగు దివ్యపదంబు గ్రహింతుగ్రావుతన్॥

## తొమ్మిదవ పది

మ॥ ఘను నాయప్ప, గొనాలకుప్పఁగను భక్తశ్రేణిఁ గన్గొన్న యం
తన సంతోషము పొంగి నింగికి నలంకారంబులై మబ్బులో
య్యాన గర్జించె; నగాధవార్ధి యలలన్ హస్తాలుబైకెత్తి యా
డెను సంభ్రమ్మున నేడుదీవులును నుండెం గానుకల్ పూనుచున్॥ 981

శా॥ ఆనారాయణదాసులం గనుట కత్యానందమున్ బొంది యె
త్తౌ నింగిన్ జలదాలు స్వర్ణరచితోద్యత్పూర్ణ కుంభాకృతుల్
బూనె న్నిర్మల నీరపూర్తి జడధుల్ పొంగారి ఘోషించె లో
కానీకంబచలాభ తోరణము లందందుంచి సేవించెడిన్॥ 982

మ॥ ఇల మున్ గొల్చిన యీశు దాసులకు ముందింపారు ధూపాలు న
ష్ట్వలఁ గ్రొంబువ్వుల వానలుంగురిసి శుంభద్దివ్య లోకాల వా
రలు సేవించిరి మానులెల్ల నెదురై రాఁజొచ్చి వైకుంఠమం
జుల మార్గింబిడి రండు రండు తమరంచున్ జెప్పిరిర్వంకలన్॥ 983

మ॥ మకరందంబులు కారు చారుతులసిన్ బైడాల్చు శ్రీచిత్తనా
యకు భక్తాళికి దేవతల్ పథమునం దందందు మున్ముందెయుఁ
టకుఁసై కట్టిరి పల్ బసల్ వెలయుదంటల్ జేతులం బార్లుక
ట్టుక కన్పించిరి మ్రోసె భేరులునుఁ జుట్టున్ భంగదధ్వ్యస్థితిన్॥ 984

మ॥ సురలా దారుల నిల్చి "మీరు హరిదాసుల్ రండి! విచ్చేసి మా
పరమోద్యోగము లీరె పూనుఁడ"ని సంప్రార్థింప నాఁగోసఁ బ
ల్వురు వేదామలినాననుల్ గ్రతుఫలంబుల్ నారి కర్పింపఁ గి
న్నరులుం గారుడు లుబ్బిపాడిరి విశాత్మంబైన సంగీతమున్॥ 985

మ॥ తమ యజ్ఞార్థ ఫలంబొసంగుచును సద్గంధంబు గ్రాహమ్మ్మ ని
య, మహావ్యాప్తిగఁ గాహళంబులట మోగ్రియన్ దక్షిణావర్త శం
ఖము లూదించిరి చంచలేక్షణలు "శ్రీనాథాశ్రితుల్ మీరు స్వ
ర్గము నేలుండని" దీవెనల్ నుడివి రేకగ్రీవలై తృప్తలై॥ 986

శా॥ గంభీరాంబుధిశాయి కేశవుఁడు రంగద్రత్నకోటీరుఁడుం
టం భాసిల్లు "కుడంద" గృష్ణ ననువంశఖ్యాత భక్తాళికెం
దుం భామల్ జయవాద మీయఁగ మరుత్తుల్, తద్వసుల్ సాగసం
పం భక్తిన్ వెసకాడి కొంతవడి యాపైఁ జేతురాశ్లాఘనల్॥ 987

మ॥ కులపారంపరి గోపకృష్ణునకు భక్తుల్ వీరలంచున్ మహో
జ్వల కోటీరులు నిత్యసూరులు క్రమాచారాభి ముఖ్యంబునుం
గొలువన్ మాధవు సుందరంబయిన వైకుంఠంబుఁ జేర్పన్ ధ్వజా
దులుఁ బ్రాకారములొప్పు గోపురము ముందున్ నిల్చ రుద్యుక్తులై॥ 988

శా॥ వైకుంఠంబునఁ జొచ్చు నత్తరిని తద్ద్వారస్థులౌ దేవతల్
"వైకుంఠాశ్రితులార! స్వాగతము మాపట్నంబుఁ జేరుండి!" నా
వైకుంఠస్థిత కింకరుల్మునులు "మావైకుంఠముం జేరు భూ
లోకావాసుల దెట్టి భాగ్యమని యాలోకింతు సానందులై॥ 989

మ॥ 'మన భాగ్యంబున నిందు వచ్చిరని' ప్రేమన్ వైదికశ్రేణి స్వా
సనమందుంచి పదంబులం గడిగిరాస్థాసీమ శ్రీచూర్ణమున్
గొని దీపంబును బూర్ణకుంభము నిధిన్ గొంచిందు బింబాననల్
మునుగా తా మెదురేగి వచ్చిరి కరంబున్ మంగళార్థంబుగా॥ 990

—♦ఫలశ్రుతి♦—

చ॥ అతఁడె యెదుర్కొనంజన మహామణిమంటపమందు భక్త సం
తతి సతతప్రమోదమున దాఁకొనుమై సుమనిష్కుటంబులన్
గుతుకముఁగూర్చు "కురుక" శఠకోపుఁడువాఁకొను వేదరూప సం
హితయగు నీసహస్రమున నీపది నేర్చిచరింతు ప్రమానులై॥

## —♦ పదియవ పది ♦—

మ॥ ముని చూడామణి ! నల్మొగాళ్లలుగు వేల్పా! నాదుముకుంటి! బిం
బనిభోష్ఠంబును, నంబుజాక్షులును నొప్పంగా ననావిద్ధ ర
త్ననికాశాంగుడవై కనంగనగు దొంగా! నాకుఁ బ్రాణాంగ! నె
త్తిని గొంటిన్నిను పోవిడన్ జరుపకేదే మాయనీవిపయిన్॥ 991

మ॥ నను వంచింపకు మింక నీయురమునన్ మాలాగతిన్ గంధ పూ
ర్తిని జొప్పిల్లెడు గొప్ప కొప్పుఁగల యా శ్రీయాన నీయాన క
న్గొనుమిా! నేస్తముఁజేసి నీకు మఱి నాకున్ స్వాత్మభేదంబు మా
య నొకేభంగిఁగఁగొంకులేకఁగొని నా వయ్యో! ననున్ బిల్వవే?॥992

శా॥ నా పొల్లుండని నల్లమానికమ! నిన్ సద్భక్తి సేవించు నా
యా పద్మోద్భవ, శంకరేంద్రులకు ముందై నాభిపద్మంబు నీ
దై పొల్చున్; బరనాథ! యాత్మకిఁక నీవే పట్టు కొమ్మొందునే
నై పైదాని నెఱుంగ నాకడకు రావే? నన్ను గొంపోవయో! ॥ 993

శా॥ మేలా సుందర శీతల ప్రకృతిసామిా! నీవ; యందున్న జీ
వాళుల్ నీవ; నభంబు జ్యోతులును నీ వందున్న బ్రహ్మభవుల్

మేతా జేజెలుఁ దక్కువారిఁ గను నెమ్మిన్ మానివాదీవ శ్రీ
లోలా! నా భర మేనె మోతునని యాలోకించి దవ్వుంటివే?॥ 994

మ॥ ఇనుముం జల్లవడం గ్రసించు జలమట్లీ యాత్మనిండారగా
నను భోగించితి తన్పు లేని యమృతంబా వాడ! నన్నిపు ద
వ్వునఁ బోఁదట్టి యనాదరించి విషయాప్తుం జేయఁజింతించి షే
ని, నీఁకెవ్వారిని జేరనేమి? పెరయే? నేనన్న నాదన్ననుక్?॥ 995

మ॥ తననేలంగల తెల్లుపూవుజిగి మేన్ గైవాలు, బింబోష్ఠమున్
వస జాతుల్ గల నీకునుం దగిన శోభన్ మించు శ్రీడవిపైఁ
గొను ప్రేమన్ ననుఁ బ్రేమచేసితివి నాకున్ భోగ్యుఁడా నాయొడఁ
మన మీా యాత్మ భుజించి తెంతయును రమ్మా! కొమ్మా! యిష్టాదటన్॥

మ॥ కమలా సుందరియందుఁ బ్రీతిఁగొని నాకైఁ బ్రీతిఁగావింతు నీ
ల మహాపర్వతమొందు, నోట, నవలీలన్ రెంపుఖండేంగ బి
బములం గైకొని లేచినట్లుఁ గిటివై పైకెత్తితీ భూమి శృం
గమునన్; ఒల్కితి నీలనాస్త్రి; నిను నేఁ గంటిన్ విడంగానీఁకన్॥ 997

మ॥ కల్ల కర్మద్వయముం దదీయ ఫలసాకల్యంబునుం జీవ రా
శులు నీవై త్రిజగాలఁబెన్ బాదవలెన్ జోద్యంబుగాఁ జేసి యం
దులఁ జొత్తెంచుచు నంతట న్వీరిసి కన్గోరావు యాదృచ్ఛి కే
చ్ఛల నాకిచ్చిన తండ్రి! కొంటి నిను నీశా! వీడగా లేనిఁకన్॥ 998

మ॥ మొదలై యేకముగా, కతంబునయి, సంపూర్త్రింద్రిలోకాదులై
మొదలై యేకమ యందు నిండు సకలంబున్ బొందు నవ్యక్తమై
మొదలై యేకము నిండి క్రిందఁ బయివైపుల్ గ్రమ్ము జీవాత్మలై
మొదలై యొక్కడవున్న నిన్నెపుడు బాబూ! నేనునుంగూడెదన్?॥ 999

శా॥ క్రిందన్ మీాదనుఁ బ్రక్కలన్వీరియు నక్షీణోన్నతావ్యక్తమా
యందున్ దానిని మించి నిండు సువికాసాపూర్ణమా జ్యోతి! వ్యా

ప్తిం దానిన్ గను మించు భూరితరదీప్తి జ్ఞానమోదాకృతీ !
పొందంగంటిని దాని మించు తమకంబున్ దీర నిన్ శ్రీపతీ ! ॥ 1000

—♦ ఫలశ్రుతి ♦—

మ॥ అరువంబుల్విడఁ గౌగిలించు హరియై యాతండతండై పరే
శ్వరుఁ గీర్తించుచుఁ గోర్కిదీర్చికొని మోక్షంబంది సద్భక్తితో
"కురుకూరన్" శఠకోపుఁడు న్నుడువుసూక్తుల్ వేయిలోనీపదిన్
గుఱివల్లించిన నిందెపుట్టియును లోకుల్ నాకులై యుండరే ? ॥

గ ద్య .

ఇది శ్రీమాన్ నల్లాని చక్రవర్త్యుప నామక కౌశిక సగోత్రి లక్ష్మీనరసింహా
చార్యపౌత్ర వేంకటరామనరసింహాచార్య పుత్ర శస్త్రాది పాశ్చాత్య
వైద్యశాస్త్ర ప్రవీణ, శ్రీ సీతారామ పాదపద్మ సేవైక
ప్రధాన వేంకట రాఘవాచార్యాభిధాన ప్రణీ
తంబైన శఠకోప గీతామృతంబను
నాంధ్రీకృత ప్రబంధము
స మా ప్త ము.

# త ప్పొ ప్పు ల ప ట్టి క.

| పద్యము | పాదము | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 92 | 1 | నీళ్లు | నీళ్ల |
| 161 | 1 | శీలావిభు | శీలాభగ |
| 172 | 1 | సంహార | పంహార |
| 350 | 4 | హాగ్వా | హాగ్ని |
| 376 | 3 | దానవిష | దానమిష |
| 451 | 1 | స్రష్థ | స్రష్ట |
| 642 | 2 | రాక్షషా | రాక్షసా |
| 646 | 2 | కుఱ్ఱమ్మ | కుఱ్ఱమ్మడి |
| 670 | 3 | మాళినా | మాళినున్ |
| 763 | 2 | గలుం | బాసగ |
| 772 | 1 | డచొండు | డంగొండుం |
| 779 | 2 | పంతగ | పతంగ |
| 787 | 2 | సాంద్రబైన | సాంద్రంబైన |
| 827 | 4 | బల్విడక | బవల్విడక |